

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక

స్వాతి

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM




పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 34 | 29.6.2018 | సంచిక 52

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Expressing our gratitude because it empowers us to live life as though everything is a miracle.

## సీరియల్స్



## కథలు



## స్పెషల్ ఫీచర్స్



## శీర్షికలు



ముఖచిత్రం మెహరీన్ కౌర్

# ప్రేమను నింపుకో

హృదయం ఎప్పుడు శుభ్రంగా వుంటుంది?! మనసు ఎప్పుడూ ఉత్తేజంగావుండాలి?ఆనందంగా, శాంతంగా ఎలా వుండాలి?అంటే మనసులో జ్ఞానం అభివృద్ధి చెందాలి. అప్పుడు అద్భుతాలు సృష్టించ వచ్చు.జర్మనీ అణుశాస్త్రంలో సాంకేతిక పరిజ్ఞానం సంపాదించుకుంది అంటారు.

ఆ సాంకేతిక జ్ఞానాన్ని అందించింది తూర్పు గోదావరి జిల్లాలోని వేదపండితులు అని చాలా మందికి తెలీదు.కొంతమంది మేధావులకు తెల్సు. అయితే మనం మేధావులనీ పట్టించుకోవడంలేదు. వేదాలనీ పట్టించుకోవడంలేదు.

వేదాలలో ఎంతటి జ్ఞానం వుందో, యుద్ధ తంత్రం గాని, వైద్యంగాని, విద్యగాని, రాజ్యాంగం గురించిగాని అన్నీ వాటిలో వున్నాయి.

వాటిని పట్టించుకోకుండా మనం ఇష్టం వచ్చి నట్లు చేస్తున్నాం కాబట్టి, సమాజాన్ని పాడుచేస్తున్నాం. బాగుచేయాలంటే సాయిమార్గం ఒక్కటే.

హృదయంలో ప్రేమను, మనసులో శాంతిని, జ్ఞానాన్ని నింపుకుని ఎక్కడికెళ్ళినా అందరికీవాటిని అందించాలి.మన దగ్గర ప్రేముంటే దానిని అందించాలి. మనలో ద్వేషం వుంటే, అందరూ మనల్ని ద్వేషిస్తున్నట్లు, దుర్మార్గులుగానూ కనిపిస్తారు.

ఒక్క ఉదాహరణ. భీష్మాచార్యులు, ధర్మరాజును ఒక చెడ్డవాడిని,దుర్యోధనుడిని ఒక మంచి వాడిని తీసుకురమ్మన్నాడు. ధర్మరాజుకి అందరూ మంచివాళ్ళలాగ, దుర్యోధనుడికి అందరూ చెడ్డ వాళ్ళులాగా కనిపించారు.

అంటే నీ యొక్క దృష్టి ఎలా వుంటే, అలా సృష్టి కన్పిస్తుంది.ప్రేమ పెంచుకుంటూపోతే అవతలివాళ్ళు ద్వేషించినా, ప్రేమలో కలిసిపోతుంది. వాళ్ళుచేసే అపకారంకూడా మేలు కలిగిస్తుంది.

-శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు

E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076

విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM

Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad

Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



## అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక



### సాక్షి

**15.6.2018**

**త**నని తాను ప్రేమించుకోలేనివాడు ఇతరులను ఏం ప్రేమించగలడు? 'హృదయం ఎక్కడున్నదీ' సీరియల్‌లో విష్ణుని ప్రేమించి గాన గంధర్వ ఆకర్షణలో పడిన యశస్వి జీవితం ఏ తీరాలు చేరనున్నదో ఉత్కంఠగా ఉంది.

పరకాయ ప్రవేశం చేసిన కార్తికేయ విన్యాసాలు ఆకట్టుకున్నాయి.

'బౌండరీ', 'తాతయ్య', 'వాట్సప్ వైద్యం' కథలు బాగున్నాయి.

వి.లంబకర్ణ రాజేంద్రనగర్

**'మ**నిషిలో మనిషి', 'వేట' సీరియల్స్ మంచి సస్పెన్స్ థ్రిల్లర్స్.

'సామ్రాట్ సముద్రగుప్త' మంచి చారిత్రక సీరియల్. 'హృదయం ఎక్కడున్నదీ' రొమాంటిక్‌గా సాగుతోంది.

'బౌండరీ', 'తాతయ్య', 'వాట్సప్ వైద్యం' కథలు బాగున్నాయి.

'అంతా రాజకీయమే', 'ఒక చిన్న మాట' చాలా విలువైన శీర్షికలు. దేశ పరిస్థితుల్ని కళ్ళకు కడుతున్నాయి.

పి.తాతారావు విశాఖపట్నం

**జ్ఞా**నవంతుడైన మనిషి అల్ప జీవులైన చీమలనుంచి నేర్చుకోవలసింది ఎంతైనా వున్నదని శివయోగి ఉద్బోధించిన 'క్రమశిక్షణే సర్వరక్షణ' సంపాదకీయం మహోన్నతంగా వుంది.

'వాట్సప్ వైద్యం' కథ ఆద్యంతం నవ్వించింది. 'తాతయ్య' బహుమతి కథ చదివిన మా కళ్ళు చెమర్చాయి.

'మనిషిలో మనిషి', 'హృదయం ఎక్కడున్నదీ...', 'సామ్రాట్ సముద్రగుప్త', 'వేట' సీరియల్స్ మమ్మల్ని చదివింపజేస్తున్నాయి.

సి.ఉమాదేవి సికింద్రాబాద్

**'అ**ల్లం, శొంఠి రెండూ ఎంతటి ఆరోగ్యప్రియత్వకాలో 'ఫర్ U' శీర్షిక ద్వారా తెలుసుకున్నాం.

బాపు బొమ్మ బాగుంది. 'చివరి రోజుల్లో...' బ్రిగేడియర్ మహమ్మద్ ఉస్మాన్ ఉదంతం ఆశ్చర్యకరం.

'వరఫలం' ఉపయోగంగా ఉంది.

ఎస్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

వచ్చేవారం స్పెషల్

**జన్మదిన సంచిక**

**'చి**లిపి' ప్రశ్నలు మెదడుకు మేత స్థానాన్ని సంపాదించుకుంది.

'టఫ్ లవ్' సూత్రాలు దంపతులందరికీ ఉపయోగపడతాయి.

'తాతయ్య' కథ ముగింపు కన్నీరు పెట్టించింది. కథ, కథనం చాలా చక్కగా కుదిరాయి.

'వాట్సప్ వైద్యం' కొత్తగా ఉంది. హాస్యం, వైద్యం కలనేసిన కథ ఇది.

పి.నరసయ్య హైదరాబాద్

# ఇది మంచి సమయం

**21.6.2018 నుండి 27.6.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, గ్రీష్మఋతువు, నిజ జ్యేష్ఠమాసం, శుక్లపక్షం.**

**21.6.2018 గురువారం**

తిథి: నవమి రా. 3.19 వరకు
నక్షత్రం: హస్త రా. 1.27 వరకు
వర్జ్యం: ప. 9.46-11.22 వరకు
దుర్ముహూర్తం : ప. 9.51-10.43 వరకు. మ. 3.04-3.56 వరకు
రాహుకాలం: మ. 1.39-3.16 వరకు
మంచి సమయం: మ. 1.45 నుండి 3.00 వరకు
సూర్యోదయం: 5.32కి
సూర్యాస్తమయం: 6.37కి

**22.6.2018 శుక్రవారం**

తిథి: దశమి రా. 3.20 వరకు
నక్షత్రం: చిత్త రా. 2.08 వరకు
వర్జ్యం: ప. 9.41-11.20 వరకు
దుర్ముహూర్తం : ప. 8.06-8.58 వరకు. మ. 12.26-1.18 వరకు
రాహుకాలం: ప. 10.24 నుండి 12.01 వరకు
మంచి సమయం : సా. 4.00 నుండి 6.00 వరకు
సూర్యోదయం: 5.32కి
సూర్యాస్తమయం: 6.37కి

**23.6.2018 శనివారం**

తిథి: ఏకాదశి రా. 3.53 వరకు
నక్షత్రం: స్వాతి రా. 3.20 వరకు
వర్జ్యం: ప. 8.01 నుండి 9.42 వరకు
దుర్ముహూర్తం: ఉ. 5.30-7.14 వరకు
రాహుకాలం: ప. 8.47-10.24 వరకు
మంచి సమయం: ప. 11.50 నుండి 1.00 వరకు
సూర్యోదయం: 5.32కి
సూర్యాస్తమయం: 6.37కి

**24.6.2018 ఆదివారం**

తిథి: ద్వాదశి తె. 4.54 వరకు
నక్షత్రం: విశాఖ తె. 5.01 వరకు
వర్జ్యం: ప. 9.20-11.03 వరకు
దుర్ముహూర్తం: సా. 4.47-5.39 వరకు
రాహుకాలం: సా. 4.53-6.31 వరకు
మంచి సమయం: మ. 2.00 నుండి 3.40 వరకు
సూర్యోదయం: 5.33కి
సూర్యాస్తమయం: 6.38కి

**25.6.2018 సోమవారం**

తిథి: త్రయోదశి పూర్తి
నక్షత్రం: అనూరాధ పూర్తి
వర్జ్యం: ప. 9.22-11.06 వరకు
దుర్ముహూర్తం: ప. 12.27 నుండి 1.19 వరకు. మ. 3.03-3.55 వరకు
రాహుకాలం: ఉ. 7.09-8.47 వరకు
మంచి సమయం: మ. 2.00 నుండి 3.40 వరకు
సూర్యోదయం: 5.33కి
సూర్యాస్తమయం: 6.38కి

**26.6.2018 మంగళవారం**

తిథి: త్రయోదశి ఉ. 6.22 వరకు
నక్షత్రం: అనూరాధ ఉ. 7.07 వరకు
వర్జ్యం: మ. 1.17-3.03 వరకు
దుర్ముహూర్తం: ప. 8.06-8.58 వరకు. రా. 10.55-11.47 వరకు
రాహుకాలం: మ. 3.16-4.53 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.33కి
సూర్యాస్తమయం: 6.38కి

**27.6.2018 బుధవారం**

తిథి: చతుర్దశి ప. 8.13 వరకు
నక్షత్రం: జ్యేష్ఠ ప. 9.35 వరకు
వర్జ్యం: సా. 6.30-8.17 వరకు
దుర్ముహూర్తం: ప. 11.35 నుండి 12.27 వరకు
రాహుకాలం: మ.12.02-1.39 వరకు
మంచి సమయం: మ. 1.30 నుండి 3.30 వరకు
సూర్యోదయం: 5.33కి
సూర్యాస్తమయం: 6.38కి

* ఆ మీ నిర్ణయం చెక్కుచెదరనిది.



డాండ్రఫ్‌తో చిరాకు పడకండి...
బట్టతల వచ్చేస్తోందని బాధపడకండి...
హెయిర్ ఊడిపోతోందని వర్రీ అవకండి...
హెయిర్ పలుచబడుతోందని టెన్షన్ పడకండి...

హెయిర్ ప్రాబ్లమ్స్ అన్నింటికీ స్టెమ్‌సెల్ థెరపీతో చెక్ చెప్పండి. వత్తైన, అందమైన హెయిర్‌ని పొందండి..

# Angels®

(Since 1991) Advanced Clinic Pvt. Ltd.

**HAIR, SKIN & BODY CARE**

## బాల్డ్‌హెడ్‌తో బాధపడుతున్నారా......? Don't worry

అంకుల్ లుక్ నుండి హాండ్‌సమ్ లుక్‌కి మారండి...... సిలికాన్‌సిస్టమ్® ద్వారా కేవలం ఒక గంటలోనే బాల్డ్‌హెడ్ పై హెయిర్‌ను అరేంజ్ చేయడం జరుగుతుంది. ఇది పూర్తిగా నాన్ సర్జికల్ ఇన్‌స్టంట్ రిజల్ట్స్



## మీరు కోరుకున్న స్కిన్ కలర్ ఇక మీ సొంతం...

ఏంజిల్స్ A-Fair (GSH) టెక్నాలజీ ద్వారా Face మరియు Entire Body Complexion ని ఇంప్రూవ్ చేసుకోండి.



పింపుల్స్ ▶ మచ్చలు ▶ హోల్స్ ▶ పులిపిర్లు ▶ పిగ్‌మెంటేషన్ ▶ అక్కడక్కడ వచ్చిన తెల్ల మచ్చలకు మైక్రోపిగ్‌మెంటేషన్ ద్వారా ఇన్‌స్టంట్ రిజల్ట్స్ ▶ తీరైన వత్తైన ఐబ్రోస్ ఒక గంటలోనే ▶ వెయిట్ రిడక్షన్ ▶ ఫేస్ లిఫ్టింగ్

50% Special Offer On package



## అవాంఛిత మరియు ఎక్సెస్ హెయిర్‌కు చెప్పండి గుడ్ బై...

ND-YAG Long Pulsed Laser ద్వారా పై పెదవి, చిన్, చీక్స్, చెస్ట్, స్టమక్ పై వచ్చే అవాంఛిత రోమాలతో పాటు శరీరంపై ఏ ప్రాంతంలో ఉన్న ఎక్సెస్ హెయిర్‌నైనా శాశ్వతంగా తొలగించుకోండి.

## HELP LINE : 92464 74849 / 040-46474849 / 98481 13694

పంజాగుట్ట : 9848113694, హైదరాబాద్ : 9959666699,
విజయవాడ : 9848252499, విశాఖపట్నం : 9573544699,
నెల్లూరు : 8886322119, భీమవరం : 8886644448,
తిరుపతి : 8886622228, రాజమండ్రి : 8886611118,
కరీంనగర్ : 7337363679, బెంగళూరు : 9845566799,
చెన్నై : 9840046599, కోయంబత్తూర్ : 9244415899,
తిరుచ్చి : 9677127799, మధురై : 9840352499



తీరైన, వత్తైన ఐబ్రోస్ 1 గంటలోనే పొందండి
మైక్రో పిగ్మెంటేషన్ థెరపీ ద్వారా....



**Say Good Bye to Scars/Holes**
Meso Therapy ద్వారా Smooth స్కిన్ పొందండి.

ALL DAYS WORKING 9 A.M. TO 7 P.M. ALL SERVICES ARE UNDER SUPERVISION OF DOCTORS - Web : www.angelsclinic.in | e-mail: angels@angelsclinic.in

# సమస్యలతో విద్యాసంవత్సరం

**వేసవి వెళుతుండగానే విద్యాసంవత్సరం మొదలవుతుంది. సరిగా వేసవి ముందు నీటి ఎద్దడి గురించి పాలకులు ఎటువంటి మాటలు మాట్లాడతారో విద్యా సంవత్సరం ముందు కూడా అటువంటి ప్రకటనలే చేస్తారు. 'ఈ సంవత్సరం విద్యార్థులకు ఎటువంటి ఇబ్బందులూ కలగనివ్వం. పుస్తకాలు సకాలంలో ముద్రించి పంపిణీ చేస్తాం. విద్యాలయాలకు అవసరమైన సౌకర్యాలన్నీ ఏర్పాటుచేస్తున్నాం. విద్యారంగంలో రాష్ట్రాన్ని అత్యున్నతస్థానానికి తీసుకువెళతాం' అంటూ గొప్ప ప్రసంగాలు చేస్తారు.**

కాని చివరికి జరిగేది సమస్యల తోరణాలు విద్యా సంవత్సరానికి స్వాగతం చెప్పటమే. ఈ విద్యా సంవత్సరం అందుకు మినహాయింపు కాదు.

విద్యాసంవత్సరం ప్రారంభమవటంతోనే మీడియాలో స్కూల్‌బ్యాగ్ మీద కథనాలు మొదలవుతాయి. బండెడు బరువుతోవున్న బ్యాగ్ మొయ్యలేక ప్రాథమిక స్థాయి విద్యార్థులు పడుతున్న కష్టాల వివరాలు ప్రచురిస్తారు.

ప్రముఖ విద్యావేత్త యశ్‌పాల్ రాజ్యసభలో సభ్యుడుగా వున్నప్పుడు తొలిసారిగా స్కూల్‌బ్యాగ్‌లకు బలవుతున్న బాల్యం గురించి ప్రస్తావించినప్పటినుండి ఈ విషయం మీద చర్చ జరిగింది.

ప్రభుత్వాలు ప్రతి విషయంలో చేసినట్టే స్కూల్ బ్యాగ్ బరువుకు సంబంధించిన ఒక జి.ఓ.ను కూడా ఇచ్చింది. అయితే ఆ జి.ఓ.లు అమలు గురించి దాదాపుగా అందరూ మరచిపోయారు.

గత సంవత్సరం తెలంగాణ ప్రభుత్వం జారీ చేసిన జి.ఓ.లో స్కూల్‌బ్యాగ్ బరువును తరగతులవారీగా ఐదువర్గాలుగా విభజించింది.

10వ తరగతికి 5 కేజీల బరువువరకు వుండవచ్చన్నది ఆ జీవో సారాంశం. అక్కడినుండి 1వ తరగతి వరకు బరువును తగ్గించుకుంటూ వచ్చారు.

అసలు క్లాసుకు స్కూల్‌బ్యాగ్ బరువుకుసంబంధం ఏమిటి! అన్ని కిలోలు ప్రతిరోజూ మొయ్యాల్సినవసరం ఏమిటి! టైమ్‌టేబుల్‌ప్రకారం పుస్తకాలుతీసుకెళితే అంత బరువు బ్యాగ్ అవుతుందా! అనే ప్రశ్నలకు సమాధానంలేదు.

మరోవైపు విద్యను ప్రైవేటీకరించినఫలితంగా పాఠశాలవిద్యపెద్ద వ్యాపారమైంది. కాబట్టి పాఠశాల నిర్వాహకులు విద్యార్థికి సంబంధించిన ప్రతి అంశాన్నీ వ్యాపార వస్తువుగా చేస్తూ, అందులోనుండి అత్యధిక లాభాన్ని పొందుతున్నారు.

చర్చ స్కూల్‌బ్యాగ్ బరువు చుట్టూనే జరగటమే పాలకులకు కావాల్సినది. అటువంటి చర్చ పాఠశాల విద్యారంగంలో వున్న అసలు లోపాలవైపు వెళ్ళనివ్వదు.

స్కూల్‌బ్యాగ్ అంశం ప్రైవేట్ పాఠశాలలమీదకు ఫోకస్ తీసుకువెళుతుంది. ప్రభుత్వం నిర్వహిస్తున్న పాఠశాలలవైపు దృష్టి మళ్ళనివ్వదు. ఇటువంటి ఆలోచనాధోరణి విద్యావ్యవస్థకు మేలుచేయదు.

పాఠశాల వ్యవస్థలోని వాస్తవాలను అంగీకరించగలిగిన ధైర్యం విద్యావేత్తలకు, పాలకులకూ వుండాలి. సమస్యను మరుగునపర్చినందున సమస్య పరిష్కారమవదు. పైగా ఏదోక రోజున ఆ సమస్య తీవ్రమై, చక్కదిద్దటానికి వీలులేనంత సంక్లిష్టమైనదవుతుంది. పాఠశాల విద్య ప్రభుత్వరంగంలో వెనకపడటానికి ప్రాథమిక బాధ్యత ప్రభుత్వ విధానాలదే.

ప్రభుత్వరంగంలో వుండాల్సినవిద్య నుండిక్రమంగా ప్రభుత్వం పక్కకు తప్పుకుని ప్రైవేటీకరణకు దారి తీసే అప్రకటిత విధానాలను అనుసరించింది.

ప్రైవేట్ విద్యాసంస్థల ప్రారంభం చాలా సులభతరమైంది. పాఠశాలకుండాల్సిన ప్రాథమిక రూపం లేకపోయినా, పాఠశాల నిర్వహించేవారికి తగిన విద్యార్హత అనుభవం లేకపోయినా అనుమతులు ఇస్తున్నారు. మెడికల్‌షాపు పెట్టాలంటే ఫార్మసీ డిప్లమో కనీస అర్హత. కాని పాఠశాలను పెట్టేందుకు చదువుకుని వుండాల్సిన అవసరం లేదు.

టీచర్ ట్రైనింగ్‌లో శిక్షణ అవసరం లేదు. పెట్టుబడికి అవసరమైన ధనం, విద్యను వ్యాపారంగా నడపగలిగిననేర్పు, విద్యార్థులు, తల్లిదండ్రులను బురిడీ కొట్టించి అధిక ఫీజులు, డొనేషన్ల వసూలు చేయగలిగిన దక్షత వుంటే చాలు. అందువల్ల పాఠశాలవిద్యలోని డొల్లతనం ప్రభుత్వ విధానాలు, విభాగాల వైఫల్యం నుండి ఏర్పడినదే. ఆ విధానపరమైన మార్పు నుండే దిగజారుడు మొదలైంది. స్కూల్‌బ్యాగ్ బరువు పెరగటానికి, పాఠశాలవిద్య ప్రైవేటీకరణకు దగ్గరి సంబంధముంది.

పాఠశాల విద్య ప్రభుత్వరంగంలో వున్నప్పుడు విద్యార్థులుగా చదువుకున్నవారెవరికీ ఇంత బరువు బ్యాగ్ మోసిన జ్ఞాపకం లేదు. బరువులేని బాల్యం నాటిది. అటువంటి విద్యావ్యవస్థనుండివచ్చి మేధావులు అయినవారు కోకొల్లలు.

చెప్పే ఉపాధ్యాయులలో చిత్తశుద్ధి,నేర్చుకోవాలనే ఆసక్తి కలిగిన విద్యార్థులు వున్న కాలంలో స్కూల్ బ్యాగ్ అవసరమేవుండేదికాదు. చిన్న చిన్న సంచులు మొదలు, భుజానికి తగిలించుకునే గుడ్డబ్యాగ్‌లో ఇమిడేంతగానే పుస్తకాలు వుండేవి. ఐనా నేర్చుకునే విజ్ఞానం అధికంగా వుండేది.

విద్యారంగం ప్రైవేటీకరణతో బ్యాగ్ రూపం మారింది. బరువు పెరిగింది. విద్య వ్యాపారమైంది. ఇప్పుడు స్కూల్ యూనిఫామ్‌కి, బ్యాగ్ బరువుకు ప్రాధాన్యత పెరిగింది. నేర్పే అంశాలు తగ్గిపోయాయి. విద్యను వ్యాపారంగా చేసి, రంగు రంగుల్లో స్కూల్ ప్రగతిని ప్రచారం చెయ్యటంతో విద్యారంగ స్వరూపమే మారిపోయింది.

ప్రభుత్వ పాఠశాలలు ఎందుకూ పనికిరానివన్నంత నమ్మకం ప్రజలందరిలో కల్పించగలిగాయి కార్పొరేట్ కాలేజీలు తమ ప్రచారశైలితో.

ఆ ప్రచార ప్రభావం ఎంత తీవ్రంగా వుందంటే, ప్రభుత్వరంగంలో టీచర్లుగా పనిచేస్తున్నవారు కూడా తమ పిల్లలను తమ స్కూళ్ళలోకాక కార్పొరేట్ స్కూళ్ళకు పంపిస్తున్నారు. ప్రభుత్వ ఉద్యోగులు, అధికారులు, రాజకీయనాయకుల పిల్లలెవరూ తమ పిల్లలను ప్రభుత్వ పాఠశాలలకు పంపటం లేదు.

యోగి ఆదిత్యనాథ్ అధికారంలోకి వచ్చిన తర్వాత ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం



**భారత ఆర్థిక వాహనంలోని నాలుగు టైర్లలో మూడు పంక్చరయ్యాయి.**

-పి.చిదంబరం, కాంగ్రెస్ నేత

# మొదలు

ఒక జి.ఓ.ను యిచ్చింది ప్రభుత్వంనుండి జీతం తీసుకుంటున్నవారు, ఇతర లబ్ధిపొందేవారంతా తప్పనిసరిగా తమ పిల్లలను ప్రభుత్వ పాఠశాలలకే పంపాలనేది ఆ ఉత్తర్వు.

యు.పి.ప్రభుత్వమిచ్చిన ఆ జీ.ఓ.మీద ఉద్యోగులు దాదాపుగా తిరుగుబాటు చేశారు. తమ పిల్లలను ఏ స్కూల్లోచదివించాలో ప్రభుత్వం చెపుతుందా!అది మా వ్యక్తిగత స్వేచ్ఛకు భంగం కాదా అని ప్రశ్నించారు! ఈ విద్యాసంవత్సరం నుండి ఆ జి.ఓ.ను అమలు చేయగలిగిన ధైర్యం యు.పి.ప్రభుత్వం ప్రదర్శి స్తుందా! అనేది సందేహమే.

ప్రైవేట్ విద్యారంగం వేగంగా బలపడు తుంటే అంతే వేగంగా ప్రభుత్వవిద్యారంగం బక్కచిక్కిపోయింది. ప్రభుత్వరంగంలో ఉపా ధ్యాయుల కొరత తీవ్రంగావుంది.

ఐనా ప్రభుత్వం పోస్టుల భర్తీకి తగిన చర్యలు తీసుకోవటంలేదు.

ఎవరో ఒకరితో నడిపేద్దాం అనే ధోరణి ప్రభుత్వ పెద్దల దగ్గర కనిపిస్తోంది. ఫలితంగా ప్రభుత్వ పాఠశాలలు నేడు మధ్యాహ్న భోజనవేళలోనే నిండుగా కనిపిస్తున్నాయి.

మిగిలిన సమయంలో వెలతెలాపోతున్నాయి. ఈ పరిస్థితి నుండి వెనక్కి తీసుకువచ్చి గత వైభవం తమ విద్యాసంస్థలకు తీసుకురావాలన్నప్రయత్నం కొందరు హెడ్మాస్టర్లు చేస్తున్నారు.

ప్రభుత్వం నుండి తగినంత ప్రోత్సాహం లేకున్నా స్థానికులు,పూర్వవిద్యార్థులు కలిసికట్టుగా అందిస్తున్న సహకారంతో కొన్ని జిల్లాలలో ప్రభుత్వ పాఠశాలల రూపురేఖలు మారుతున్నాయి కాదనలేని విషయం.

అయితే ఆ దిద్దుబాటు ఉద్యమంలో ఉపాధ్యాయు లందరూ పాల్గొంటున్నారని అనలేం.

తమ జీతానికి, ఇతర సౌకర్యాలకు భరోసా వుంది కాబట్టి విద్యావ్యవస్థ, పాఠశాలలు ఎలా పోతే ఏమిటన్న నిర్లక్ష్యధోరణి ఉపాధ్యాయులలో, వారి సంఘాల నేత లలో కనిపిస్తోంది. ఉపాధ్యాయుల హక్కుల గురించి తప్ప బాధ్యతల గురించి గుర్తుచేయని,ఉద్య మించని ఉపాధ్యాయ సంఘాలు తమ పద్ధతిని మార్చుకోక పోతే పాఠశాలవిద్య మెరుగుపడదు.

పాఠశాలవిద్య అనేది విద్యావ్యవస్థకు పునాది.అది ఎంత బలంగా వుంటే, విద్యాసౌధం అంత దృఢంగా నిర్మాణమవుతుంది. అయితే పాఠశాల విద్య గత కొన్ని సంవత్సరాలుగా నిర్లక్ష్యానికి గురైంది.

- పుస్తకాలు, యూనిఫామ్‌ల కొరత
- ప్రభుత్వ పాఠశాలలకు ఆదరణ కరువు
- ప్రైవేట్ పాఠశాలలది వ్యాపారధోరణి
- ప్రభుత్వవిధానాలే అసలు సమస్య

ప్రైవేట్ పాఠశాలలవారిదే పైచేయి అయింది. ఇప్పుడు కార్పొరేట్ విద్య పెద్ద వ్యాపారం. యూనిఫాం వారి దగ్గరే కొనాలి, పుస్తకాలు, బూట్లు, బ్యాగ్‌లు అన్నీ భారీ కమీషన్లు దండుకునేందుకు వీలైన పద్ధ తిలో కొనిపిస్తున్నారు.

కార్పొరేట్ విద్యాసంస్థలు నేడు తమ ధనబలాన్ని రాజకీయబలంగా మార్చుకున్నారు. కార్పొరేట్ విద్యా సంస్థల అధిపతులే ప్రజా ప్రతినిధులు, మంత్రులు అయి పూర్తిగా విద్యావ్యవస్థనే శాసించగలిగిన స్థితిలో వున్నారు. అందుకే ఇటీవల కేంద్ర విద్యాశాఖ కార్య దర్శి "భారతదేశంలో అతిపెద్ద మాఫియా విద్యారంగం మాఫియా" అని ఒక ఇంటర్వ్యూలో ఏమాత్రం సంకోచం లేకుండా చెప్పారు.

కార్పొరేట్ విద్యాసంస్థలు రాజకీయపార్టీలకు నిధులు సమకూరుస్తున్నాయి. అందుకే నిబంధనలు ధిక్కరించి పాఠశాలలు నడిపినా కార్పొరేట్ స్కూళ్ళ మీద చర్యలు వుండటంలేదు.

జిల్లా విద్యాశాఖాధికారులు గాని, స్కూళ్ళ ఇన్ స్పెక్టర్లు కాని కార్పొరేట్ పాఠశాలలను ఎప్పుడైనా సందర్శించి, నిబంధనలకు అనుగుణంగా ఆ సంస్థలు నడుస్తున్నాయో! లేదో!! చూడటం లేదు. ఆదివారాలు, ఇతర సెలవులు కార్పొరేట్‌విద్యాసంస్థలకు వర్తించవు. పాఠశాలలకు నియమిత గంటలనేవి లేవు.

కోళ్ళఫారమ్‌లో కోడిపిల్లలు దాణా తిని గుడ్డు పెట్టినట్టే ఈ పాఠశాలల్లో విద్యార్థులు 'మెటీరియల్' చదివి పరీక్షల్లో కక్కి కార్పొరేట్ సంస్థల ప్రచారానికి అవసరమైన ర్యాంక్‌లు సంపాదించిపెడుతున్నారు.

ప్రభుత్వ పాఠశాలలకు విద్యార్థులు ఎందుకు రావటంలేదు అనే ప్రశ్న ప్రభుత్వం, ఉపా ధ్యాయులు వేసుకోవాలి. ఏదో ఒక రకమైన పరీక్ష, ఇంటర్వ్యూ పెట్టి అర్హతలువున్నవారిలో సరైనవారిని ఎంపికచేసుకునే వ్యవస్థ ద్వారా ఎన్నికైనవారు ప్రభుత్వ పాఠశాలలలో టీచర్స్‌గా వుంటారు.

అక్కడ విద్యార్థులు చేరరు. అసలు కనీస అర్హత వుందో లేదో తెలియని అతి తక్కువ జీతానికి పని చేసేవారిని టీచర్స్‌గా నడిపే కార్పొరేట్ పాఠశాలలకు విద్యార్థులు ఎగబడుతున్నారు.

ఏమిటి ఈ తేడా! 1980ల్లో, ఆ తర్వాత క్రమంగా విద్య మొత్తం కార్పొరేట్ రంగం చేతిలోకి వెళ్ళింది! వీటికి సమాధానాలు కావాలి.

ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక వసతులు కరువవు తున్నాయి. ఏటికేడు దిగజారుడే తప్పించి మెరు గవటం లేదు. టీచర్స్ తాము పనిచేసేచోట వుండటం లేదు. ఒకప్పుడు టీచర్ ఆ గ్రామంలో ఒకడు. మంచి చెడు గ్రామస్తులకు తెలియచెప్పే పెద్దమనిషి. ఆ టీచర్‌ని, అతని కుటుంబాన్ని ఆదరించేది గ్రామం. తాము పనిచేసిన గ్రామంతో అనుబంధం పెంచుకుని అక్కడ స్థిరపడిన టీచర్స్ వుండేవారు. కాని ఇప్పుడు టీచర్స్ గ్రామాలకు వస్తున్న సందర్శకులు.

మౌలిక వసతులు కల్పించని ప్రభుత్వాలు సాంకే తిక ప్రచారాలను మాత్రం బాగా తీసుకుంటాయి. విద్యారంగం మీద భారీ పెట్టుబడుల లెక్కలు, పాఠ శాల స్థాయిలోనే ఇంగ్లీషు మీడియం, కంప్యూటర్ పరిజ్ఞానం అంటూ ఏవేవో చెపుతాయి.

కాని తాము ఇస్తామని వాగ్దానం చేసిన యూని ఫామ్‌లు సమయానికి సిద్ధం చెయ్యలేవు. పుస్తకాలను విద్యాసంవత్సరం ప్రారంభానికి ముందుగా పంపిణీ చెయ్యవు. టీచర్స్ పోస్టులను భర్తీ చేసేందుకు అవసరమైన డిఎస్సీలను నిర్వహించవు. ఫలితంగా విద్యాసంవత్సరం మధ్యవరకు పాఠశాల లలో టీచర్స్ వుండటం లేదు.

ప్రహరీలు లేని పాఠశాలలు 40 శాతం పైనే. టాయిలెట్స్ నేటికీ ఏర్పడలేదు పాఠ శాలల్లో. మంచినీటి సరఫరా పరిస్థితి సరిగా లేదు. 50 శాతానికి పైగా పాఠశాలల్లో ఫర్నీచర్ లేదు. సరైన నల్లబల్లలు లేవు, చాక్‌పీస్‌ల సరఫరా లేదు. నామమాత్రంగా నడుస్తున్న పాఠశాలల నుండి నాణ్యమైన చదువులు ఆశించటం పొరపాటే.

పాఠశాలలకు సంబంధించి కొత్త ఆలోచనలు ప్రభుత్వం చెయ్యటంలేదు. పాఠశాలలను దత్తత తీసుకునే ఆలోచన కొన్ని సంస్థలకు ప్రతిపాదించవచ్చు. పరిశ్రమల సామాజిక బాధ్యత పథకం కింద పెట్టు బడులు పాఠశాలలమీద పెట్టించవచ్చు.

2014 తర్వాత పార్లమెంట్ సభ్యులు ప్రతిఒక్కరూ రెండు గ్రామాలను దత్తత తీసుకోవాలని ప్రధాని నరేంద్రమోడీ ప్రతిపాదించారు.

ఆర్భాటంగా ఎమ్.పి.లందరూ దత్తత గ్రామాలు ప్రకటించారు కూడా.సరిగా అటువంటి గ్రామదత్తత పథకం రాష్ట్రస్థాయిలో ప్రభుత్వాలు ప్రవేశపెట్టాయి. అవన్నీ కలిపితే కనీసం వెయ్యిగ్రామాలు ఈ నాలు గేళ్ళలో ఆదర్శగ్రామాలుగా రూపుదిద్దుకునివుండాలి. అందులో భాగంగా ఆ యా గ్రామాలలో పాఠశాలలు మెరుగైన స్థితిలో వుండాలి. కాని అటువంటి మార్పు అక్కడ కనిపించటంలేదు.

విజ్ఞాన సమాజ నిర్మాణం తమ లక్ష్యం అనిపత్రికా ప్రకటనలతో,ప్రచార ఆర్భాటంతో ఆశించిన నాలెడ్జ్ సొసైటీలు ఏర్పడవు. దానికి ప్రత్యేకంగా మంత్ర దండం ఏదీ లేదు. ప్రాథమిక విద్యమీద ప్రభుత్వం భారీగా పెట్టుబడులు పెట్టి, ప్రస్తుత లోపాలను చక్కదిద్దకపోతే విద్యాపునాదులు బీటలు వారతాయి. విజ్ఞాన సమాజ సౌధాలు నిలబడలేవు.

**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**



# ఒక చిన్నమాట

ఒక మాజీ రాష్ట్రపతిని దేశంలోని ఒక సంస్థ ఒక శిక్షణ కార్యక్రమం సమాప్తి సందర్భంలో పాల్గొన్నవారినుద్దేశించి ఒక ఉపన్యాసమిమ్మని ఆహ్వానిస్తే దేశవ్యాప్తంగా ఆ వార్త సంచలన వార్త ఎందుకయింది? అన్ని మాధ్యమాలూ దానినే రోజుల తరబడి ఎందుకు చర్చించాయి?

ఆ సందర్భానికి ముందు, ఆ తర్వాత కూడా దానిని విశ్లేషించి అంతరార్థాలు వెతికే ప్రయత్నాలు ఎందుకు జరిగాయి?

రాష్ట్రీయ స్వయంసేవక్‌సంఘ్ సర్‌సంఘ్‌చాలక్ (డైరెక్టరు అనుకోవచ్చు) అనబడే ఆర్‌ఎస్‌ఎస్ అధిపతి మోహన్ భగవత్ మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ శిక్షావర్గ్ ముగింపు సందర్భంగా రావటం ఒక పరిపాటి అని దాని గురించి ఇంత రాద్ధాంతం అనవసరమని అన్నారు.

ముఖ్య అతిథి ప్రణబ్ ముఖర్జీ ఉపన్యసించకముందే మోహన్ భగవత్ తన ఉపన్యాసం ప్రారంభంలో ఈవిధంగా అన్నారు. "ఆర్‌ఎస్‌ఎస్ ప్రారంభమైనప్పటి నుండి సంఘ్ శిక్షా వర్గ్ సందర్భంగా మేము ప్రముఖులను ఆహ్వానిస్తూ వచ్చాము.

వారు సంఘ్‌ను దర్శించి తమ అభిప్రాయాలు వెల్లడిస్తారు. ఈనాటి కార్యక్రమం కూడా అదే సంప్రదాయంలో సరళంగా జరుగుతోంది. కాని ఈసారి చాలా చర్చలు జరుగుతున్నాయి. ఇది సాధారణంగా జరిగే విషయం.

ఈ విషయం నాగపూర్ ప్రజలకు తెలుసు. ఇంత అనుభవం, జ్ఞానం గల వ్యక్తి మన మధ్య ఈనాడు ఉండటం మన అదృష్టమే. మనం ఆహ్వానించాము. ఆయన వచ్చారు. సాధారణ విషయం.

ఆయనను ఎందుకు ఆహ్వానించారు. ఆయన ఎందుకు వచ్చారని అందరూ అడుగుతున్నారు.

ఏమైనా సంఘ్ సంఘే. శ్రీముఖర్జీ శ్రీముఖర్జీనే. ఆ విధంగానే ఆయన ఉంటారు"



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

ఆర్‌ఎస్‌ఎస్ కార్యక్రమానికి మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీని ఆహ్వానించారని ఆయన దానికి అంగీకరించారని తెలియగానే రకరకాల ప్రతిస్పందనలు వచ్చాయి. సెక్యులర్ (లౌకిక) అనబడే పార్టీలు చాలా అభ్యంతరాలు వ్యక్తపరచాయి.

కేంద్రమాజీ మంత్రి, కాంగ్రెస్ నాయకుడు సి.కె. జాఫర్‌షరీఫ్ ప్రణబ్‌ముఖర్జీ లాంటివారు సంఘ్ కార్యాలయాన్ని లోక్‌సభ ఎన్నికల ముందు దర్శించటం సరికాదని తమ నిర్ణయం గురించి తిరిగి ఆలోచించుకోవలసిందని లేఖ రాశారు.

స్వయంసేవకులనుద్దేశించి ప్రసంగిస్తూ ప్రణబ్ ముఖర్జీ వారికి షాకిస్తారని మరికొందరు ఊహించారు. వారు నమ్మిన జాతీయవాదానికి భిన్నంగా ప్రత్యామ్నాయ జాతీయవాదంపై ప్రసంగించి ఆర్‌ఎస్‌ఎస్‌ను,బిజెపీని ఇరకాటంలో పెడతారనుకొన్నారు.

ఎవరెన్ని అభిప్రాయాలు వెలిబుచ్చినా,ఎన్ని విధాల అర్థించినా ప్రణబ్ తన మాట మీదే నిలబడ్డాడు (దటీజ్ ప్రణబ్ దా)

"నేనేమి చెప్పాలో అది నాగపూర్‌లోనే చెపుతాను. ఎందరో ఫోన్లద్వారా ఉత్తరాల ద్వారా నన్ను అభ్యర్థించారు. ఇంకా నేనెవరికీ జవాబు చెప్పలేదు" అన్నారు.

ఈ ఆహ్వానమే ఒక వివాదమైంది. కాంగ్రెస్‌వాళ్ళు విచారం వ్యక్తంచేశారు. సీనియర్ కాంగ్రెస్ లీడరు జయరామ్ రమేశ్ కూడా ఉత్తరం రాశారు. ఈ అవకాశంవినియోగించుకుని ఆర్‌ఎస్‌ఎస్ భావజాలం ఎంత వక్రంగా ఉందో తెలియజెప్పమని పి.చిదంబరం కోరారు. మరికొందరు ఎన్నో ఊహాగానాలు చేశారు.

ఆయన రాష్ట్రపతిగా ఇచ్చిన చివరి ఉపన్యాసంలోని హితోక్తులన్నీ నాగపూర్‌లో వినిపిస్తారనుకొన్నారు. లౌకికవాది అయిన ప్రణబ్ ఆర్‌ఎస్‌ఎస్‌కు చాలా ఇబ్బందికరంగా మారుతారా అనుకొన్నారు.

అసలు ఉత్సవం అక్కడ జరిగిన ప్రసంగాలు అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తాయి.

అంతకుముందు ఆర్‌ఎస్‌ఎస్ వ్యవస్థాపకుడు కేశవ్ బలిరామ్ హెడ్గేవార్ జన్మించిన గృహాన్ని దర్శించిన ప్రణబ్ ముఖర్జీ సందర్శకుల పుస్తకంలో "భారత మాత సుపుత్రునికి నివాళులు అర్పించేందుకు నేను ఇక్కడికి వచ్చాను" అని రాశారు.

మోహన్ భగవత్ ఉపన్యాసం తర్వాత ప్రణబ్ ముఖర్జీ ఉపన్యాసం విన్న శ్రోతలకు ఇద్దరూ దేశ హితం గురించే మాట్లాడారు, సమైక్యత గురించే మాట్లాడారు, అందరినీ కలుపుకొని ముందుకు సాగాలనే ప్రబోధించారు అనిపించక మానదు.

హిందీలో మాట్లాడిన భగవత్ తన ఉపన్యాసం ముగించి వెళ్తూ "ఆయన ఇంగ్లీషులో మాట్లాడుతారు. చెవులప్పజెప్పి వినండి. అర్థంచేసుకోండి" అని అన్నారు. ప్రణబ్ ముఖర్జీ విహంగవీక్షణంతో భారత దేశ చరిత్రనంతా కళ్ళముందు నిలిపారు.

భారతదేశపు గొప్పతనం బహుళత్వం,సహనంలో ఉంది. శతాబ్దాలుగా ప్రజలు సహజీవనం చేస్తున్నారు. వివిధ అంశాలపై వాదనలుండవచ్చు కాని భిన్నాభిప్రాయాలుంటాయి. వాటిని కాదనకూడదు.

మహాత్మాగాంధీ, జవహర్‌లాల్‌నెహ్రూలు పేర్కొన్నట్లు మన జాతీయవాదం ఎవరికీ పరిమితంకాదు. అందరినీ కలుపుకొనిపోతుంది.

ప్రణబ్ ముఖర్జీ ఉపన్యాసం వింటుంటే జవహర్‌లాల్ నెహ్రూ స్వాతంత్ర్యానికి ముందు రాసిన 'ది డిస్కవరీ ఆఫ్ ఇండియా' జ్ఞాపకం వచ్చింది.

వివిధ సంస్కృతులు వచ్చి భారతీయతలో ఎలా ఏకమయిందీ, భిన్నత్వంలో ఏకత్వమే మన జీవన విధానమయిందీ చక్కగా వర్ణించారు.

ఈ పుస్తకం ఇప్పటికీ సందర్భోచితంగాఉంటుంది. ఒకప్పుడు కళాశాలల్లో పాఠ్యపుస్తకంగా ఉండేది. పాఠశాలల్లో సరళీకృతరూపంలో (రిటోల్డ్) కళాశాలల్లో పూర్ణరూపంలో పాఠ్యపుస్తకంగా ఉంటే ఆలోచనాతీరు మెరుగుపడుతుంది. అందరినీ కలుపుకొనిపోవటం (ఆల్ ఇన్‌క్లూసివ్) ఏమిటో తెలిసివస్తుంది.

ఎంతగానో ఎదురుచూసిన ఉపన్యాసం విన్నాక వచ్చిన స్పందనలూ చిత్రంగా ఉన్నాయి

"ఆర్‌ఎస్‌ఎస్‌కు మంచిపాఠం' అని కాంగ్రెస్‌వాళ్ళు సంతోషించారు. "మహాత్మాగాంధీ హత్య, ఆర్‌ఎస్‌ఎస్ నిషేధం గురించి మాట్లాడలేదే" అని మరికొందరు చింతించారు. మహాత్మాగాంధీ హత్య ఆర్‌ఎస్‌ఎస్ చేయించిందని 2014లో ప్రకటించిన రాహుల్‌గాంధీ భివాండి కోర్టు కేసులో ఉన్నారు. జూన్ 12 తర్వాత ఆగష్టు 10కి కేసు విచారణకు వస్తుంది.

సహనం లేదు, ఇతరుల భావాలకు సముచిత స్థానమివ్వరు, మతాలకు స్వేచ్ఛనివ్వాలి అని అత్యాధునికంగా ఆలోచిస్తామనే వారి ఆలోచనాధోరణి ఈ సందర్భంలో తేటతెల్లమయింది. ఎవరికి సహనం లేదో తేలిపోయింది. చివరికి ప్రణబ్‌జీకి ప్రధానమంత్రి పదవిపట్ల వ్యామోహమున్నట్టు ప్రచారాలు చేశారు. వీరి ఆదర్శాలు ప్రజలకు మార్గదర్శకాలా?

సెన్సేషనల్ సీరియల్

# సాయిరాం ఆకుండి

"గెలుపు మన దగ్గరికి రాదు
దాన్ని వెంబడించాలి
దొరకబుచ్చుకోవాలి
ఈసారి నా కిక్ పవర్ చూడు"
అతడు తన దృష్టిని పూర్తిగా
బంతిపై ఉంచాడు
గాలిని చీల్చుకుంటూ విభిన్నంగా
పరిభ్రమిస్తూ వస్తోందా బంతి
మిస్సైల్‌లా.
పాతికేళ్ళ వయసు,
ఐదేళ్ళ మనసు కలిగిన
వీల్‌ఛైర్‌లోని యువకుడు
వెర్రిగా అరిచాడు.
ఆ యువకుడే ఫ్యూచర్‌లో తనని
ఓడించగల మగాడని
ఆమెకు తెలీదు
ఎవరా యువతి?
ఎవరా యువకుడు!



# నానితో నిత్య

చదవండి. త్వరలో ప్రారంభం!

# రసానుభూతి

ఎవర్ని ఆహారంగురించి కదిలించినా పండ్లరసాలపట్ల వారి క్రేజ్ కనపడుతుంటుంది. అందుకే వీటిపట్ల ఆసక్తి చూపేవారు కోకొల్లలు. తాజాగా తీసిన పండ్లరసాలు రుచిలో అమోఘం. సులువుగా జీర్ణం అవుతాయి.

ప్రతి పండ్లరసమూ సంపూర్ణ ఆరోగ్యదాయని అనుకోకూడదు. వాటిని ఎంచుకునేటప్పుడు కాస్త జాగ్రత్తఅవసరం. పండ్లగుజ్జును వదిలేసి తాగే రసాలకంటే గుజ్జును వీలైనంత ఎక్కువగా వుంచి తాగగల జ్యూస్‌లు మంచివి.

ఏవైనా తగు మోతాదులో తీసుకుంటుంటే కలిగే ప్రయోజనాలు ఎక్కువగా వుంటాయి. పండ్లరసాల్లో పీచుపాళ్ళు ఎక్కువ కాబట్టి, జీర్ణవ్యవస్థకు చక్కగా బ్రేక్ ఇచ్చి, శరీరం ఎక్కువ పోషకాల్ని గ్రహించడానికనువుగా వుంటాయి.

ఇంట్లో తాజాగా తయారుచేసుకున్న పండ్లరసాలు తాగడం అన్ని విధాలా శ్రేయస్కరం.

అలాగే ప్రిజర్వేటివ్‌లు, ఆర్టిఫీషియల్ కలర్స్, ఫ్లేవర్లు ఏవీ కలపకూడదు.

కొన్ని రకాల పండ్లరసాలు, వాటివల్ల కలిగేటువంటి ఆరోగ్య ప్రయోజనాల పట్ల అవగాహన వుండాలి.

Courtesy : FEMINA

## దానిమ్మరసం

ఎర్రగా నిగనిగలాడే దానిమ్మగింజల్లో అనేక అనుకూలవంతమైన ప్రయోజనాలు లభిస్తాయి. పాలిఫెనాల్ అధికంగా వుండే పండ్లరసం.

అత్యధిక యాంటీ ఆక్సిడెంట్ సామర్థ్యం కలిగివుంటుంది. యాంటీ ఎథిరోజెనిక్, యాంటీ ఆక్సిడెంట్, యాంటీ హైపర్‌జెనిక్, యాంటీ ఆక్సిడెంట్, యాంటీ హైపర్‌టెన్సివ్, యాంటీ ఇన్‌ఫ్లమేటరీ గుణాలు కూడా అత్యధికంగా కలిగివుంటుంది.

**ఎందుకు తీసుకోవాలి?** యాంటీ ఆక్సిడెంట్స్ అధికంగా వుంటాయి. కాబట్టి ఆర్టరీల బ్లాకేజీని తొలగిస్తుంది. అత్యధిక రక్తపోటు, గుండెజబ్బుల అవకాశాలను తగ్గించే గుణము వీటిలో ఉంటుంది. క్యాన్సర్‌తో పోరాడగలదు.

పండులోని పాలిఫెనాల్స్ క్యాన్సర్ కణాలు వ్యాప్తినడ్డుకోగలవు. దానిమ్మలోని ఫిటోకెమికల్స్ బ్రెస్ట్ క్యాన్సర్‌కు కారణం అయ్యే ఎరోమాటేజ్ అనే ఎంజైమ్ ఎదుగుదలని నియంత్రిస్తాయి. యాంటీ ఇన్‌ఫ్లమేటరీ గుణాలెక్కువ.

**ఎలా తాగాలి?** ఎటువంటి చక్కెరలూ కలపకుండా చల్లని, తాజా దానిమ్మ రసం రోజుకో గ్లాసయినా తాగాలి.

## అవకాడో జ్యూస్

అత్యంత పోషకభరితమైన పండుగా అవకాడో ప్రతిష్ఠాత్మక స్థానంలో ఉంది. వీటిలో ఉండే అత్యవసర ఫ్యాటీ యాసిడ్‌లు మిగతా పండ్లలో కనపడవు.

బరువు తగ్గాలనుకునేవారికి అవకాడో జ్యూస్ మంచిఛాయిస్. గుండెకు ప్రయోజనకారి.

**ఎందుకు తీసుకోవాలి?** విటమిన్ సి, ఇ పుష్కలంగా లభిస్తాయికాబట్టి రోగ నిరోధక వ్యవస్థను దృఢపరుస్తుంది. జ్యూస్‌లోని పొటాషియం రక్తపోటు స్థాయిల నిర్వహణలో ఉపకరిస్తుంది.

హార్ట్ఎటాక్స్ రిస్క్‌ను తగ్గించడంలో సాయపడుతుంది. స్ట్రోక్, కిడ్నీ వైఫల్యాల నుంచి కాపాడుతుంది.

బరువు తగ్గాలనుకునేవారికి మంచి ఆహారం. యాంటీ ఆక్సిడెంట్స్ అధికంగా వుంటాయి. లూటెన్, జియాంతిన్ వుంటాయి. ఈ పోషకాలు కంటి ఆరోగ్యానికి అవసరం. మాక్యులర్ డీజనరేషన్, కాటరాక్ట్‌లనుంచి కాపాడ్తాయి.

**ఎలా తాగాలి?** పండకముందు అవకాడోలను ఫ్రిజ్‌లో పెట్టకూడదు పండిన తరువాత వారంరోజుల వరకు ఫ్రిజ్‌లో ఉంచుకోవచ్చు.

### ఉత్తమ కాంబినేషన్లు

యాంటీ ఆక్సిడెంట్ : క్రాన్‌బెర్రీ, దానిమ్మ.

ఆరోగ్య పరిరక్షణ : కివి, యాపిల్.

పోషకాల గని : యాపిల్, పుచ్చ.

విటమిన్లు : ఆరెంజ్, ద్రాక్ష.

### రెసిప్స్

**కివి లెమనేడ్ :**

- కివి చెక్కు తీసి బ్లెండ్ చేయాలి.
- నిమ్మరసం పిండి, కలపాలి.
- బ్లెండ్‌చేసి గ్లాస్‌లో ఐస్‌క్యూబ్స్ వేసి నింపాలి.

**పుచ్చ :**

- పుచ్చకాయముక్కలు కోసి, వాటిని బ్లెండర్‌లో వేయాలి.
- జ్యూస్ పిండి, అందులో కొద్దిగా తులసి లేదా పుదీనా కలపాలి. ఐస్ క్యూబ్స్ వేసి గ్లాసుల్లో పోయాలి.

**క్రాన్‌బెర్రీ క్రష్ :**

- క్రాన్‌బెర్రీలు బాగా శుభ్రంగా కడిగి మరిగే నీటిలో వేయాలి. ఉడికిన క్రాన్‌బెర్రీలు, యాపిల్ ముక్కలు బ్లెండ్ చేయాలి. ఐస్‌క్యూబ్స్‌లను వేసి గ్లాసులలో పోయాలి.

## పుచ్చకాయ

పుచ్చపండులో నీరే 92 శాతం వుంటుంది. విటమిన్ ఎ, బి6, సి, లికోపెనె, యాంటీ ఆక్సిడెంట్స్, ఎమినో యాసిడ్స్ పుష్కలంగా లభిస్తాయి. ఇది అత్యుత్తమ హైడ్రేటింగ్ జ్యూస్.

**ఎందుకు తీసుకోవాలి?** పండులోని నీటిశాతం శరీరానికి డిటాక్స్ కావడానికి సహకరిస్తుంది. అసౌకర్యంగా వుండే కడుపుబ్బరం, వాపులను తగ్గిస్తుంది. పొటాషియం సర్క్యులేటరీ వ్యవస్థకు ఉపకరిస్తుంది. సహజ డైయూరెటిక్, కిడ్నీ రాళ్ళనుంచి కాపాడుతుంది. శారీరక వ్యర్థాలను వెలికి నెట్టేస్తుంది.

విటమిన్ సి కండరాల సోర్‌నెస్‌ను తగ్గిస్తుంది. టెండాన్‌లు, లిగమెంట్‌ల మరమ్మతులలో ఉపకరిస్తుంది.

**ఎలా తీసుకోవాలి?** వర్కవుట్‌లలో పుచ్చకాయ జ్యూస్ చాలా మంచిది. మజిల్ సోర్‌నెస్‌ను తగ్గిస్తుంది.

## కివి జ్యూస్

యాంటీ ఆక్సిడెంట్స్ పుష్కలంగా లభించే మరో పండు కివి. ఇది అనేక ఆరోగ్య ప్రయోజనాలను అందిస్తుంది. విటమిన్ సి, ఖనిజాలు, ఫిటో న్యూట్రియెంట్లు గల అద్భుతమయిన కాంబినేషన్. హ్యాపీ హార్మోన్ సెరటోనిన్‌ను సమృద్ధిగా సరఫరా చేస్తుంది.

**ఎందుకు తీసుకోవాలి?** ప్రతికూల ఎమోషన్‌లను కివి పండు 30 శాతం తగ్గిస్తుంది. కివిలోని సెరటోనిన్ శక్తి స్థాయిలను, మెదడులోని న్యూరోకెమికల్స్‌ను పెంచుతుంది. యాంగ్జయిటీ, డిప్రెషన్‌లతో ఇబ్బందిపడేవారికి చికిత్సగా పనిచేస్తుంది. పండ్లరసంలోని పాలిసాచ్చరైడ్స్ శరీరంలో కొలాజెన్ సింథసిస్‌ను రెండింతలు చేస్తాయి.

ఇది చర్మం, కండరాలు, ఎముకలు టెండాన్లను వార్ధక్యం నుంచి కాపాడుకునేందుకు అవసరం. చర్మ ఆరోగ్యానికి ప్రయోజనకరమైన లూటెన్ అనే యాంటీ ఆక్సిడెంట్‌ను, కెరోటినాయిడ్‌ను సరఫరా చేస్తుంది. సూర్యకిరణాల హానినుంచి ఇది పరిరక్షిస్తుంటుంది.

**ఎలా తీసుకోవాలి?** కివి శీఘ్రంగా పండేందుకుగాను పేపర్ బ్యాగ్‌లో నాలుగు రోజులు వుంచాలి.

## యాపిల్ జ్యూస్

రోజుకో యాపిల్ తింటే డాక్టర్ అవసరం ఉండదనేది ఎప్పటినుంచో వింటున్న సామెత. ఇది నిజంకూడా.

అత్యుత్తమ పీచు లభించే పండ్లలో ఒకటి యాపిల్. యాపిల్స్‌లోని అల్కలిటి లివర్‌లోని టాక్సిన్లను క్లెన్స్ చేయడంలో సహకరించి, శారీరక పిహెచ్ స్థాయిలను మెయిన్‌టెయిన్ చేస్తుంది. ఉదరానికి,గుండెకు మేలుచేసే పండు.

**ఎందుకు తీసుకోవాలి?** యాపిల్‌జ్యూస్‌లోని పీచు మలబద్ధక నివారణకు తోడ్పడుతుంది. యాపిల్స్‌లోని పెక్టిన్‌ను సహజ డైయూరెటిక్‌గా పరిగణిస్తారు. తేలికపాటి లాక్సాటివ్ ప్రభావం కలిగివుంటుంది. ఫిటో న్యూట్రియెంట్స్ వుండి, డయాబెటిస్‌ను ట్రీట్ చేయడంలో సహకరిస్తుంది.

యాపిల్ పండులోని పీచు ఆర్థ్రైటిస్, ఆస్త్మా, అల్జీమర్స్ వంటి దీర్ఘకాలిక వ్యాధుల రిస్క్‌ను తగ్గించడంలో ఉపకరిస్తుంది. వీటిలోని కెటచిన్, ఫ్లోరిడ్జిన్, క్లోరోజెనిక్ యాసిడ్ గుండెసంబంధిత రుగ్మతలతో, బ్రెస్ట్ క్యాన్సర్‌తో పోరాడేందుకు సాయపడతాయి.

**ఎలా తాగాలి?** బాగా శుభ్రంగా కడిగి, పైచర్మంతో యాపిల్స్ బ్లెండ్ చేయాలి. చర్మములో గుర్తించతగిన స్థాయిలో ఫ్యాటీ యాసిడ్లు, పెక్టిన్ లభిస్తాయి.

ఎమ్.సునీత

నిన్నరాత్రి స్వాతిని గౌతమీ ఎక్స్‌ప్రెస్ ఎక్కించి ఇంటికొచ్చినప్పట్నించి రమేష్‌కు ఏమీ తోచటంలేదు. ఇల్లంతా బోసిపోయినట్లుంది. గలగలా మాట్లాడుతూ, కిలకిల నవ్వుతూ, బిరబిరా ప్రవహించే గోదారిలా ఎప్పుడూ హుషారుగా ఉండే స్వాతి ఎడబాటు ఒక్కరోజులోనే భరించలేనిదిగా ఉంది.

పెళ్ళయిన ఏడాదిలో స్వాతి పుట్టింటికి వెళ్ళడం ఇది రెండోసారి. మొదటిసారి సంక్రాంతికి తనే తీసుకెళ్ళాడు. ఈసారి లీవ్ దొరక్క, స్వాతి ఫ్రెండ్ మ్యారేజికి వెళ్ళితీరాలంటే ఒక్కదాన్ని ట్రెయిన్ ఎక్కించాడు. ఉదయం లేచినప్పట్నించి ఇంట్లో ఉన్నంతసేపు స్వాతి చెంగుపట్టుకుని తిరిగే రమేష్‌కు పిచ్చెక్కినట్లుగా

# ముసుగులో ముద్దులాట



ఉంది. ఈ నాలుగైదు రోజులు ఎడబాటు గ్రహపాటులా ఉందనుకున్నాడు.

ఆఫీస్‌లో కూడా స్వాతి ధ్యాసే. పనిచేయబుద్ధి కావడంలేదు. మధ్యాహ్నం క్యాంటీన్‌లో లంచ్‌చేసి బయటకు వస్తూంటే సెల్ రింగయ్యింది. ఏదో తెలియని నెంబరు... ఆన్ చేసి "హలో!" అన్నాడు.

"హలో హ్యాండ్‌సమ్!" అవతల నుంచి ఓ కోకిల స్వరం. ఆ కంఠ మాధుర్యానికి ముగ్ధుడయ్యాడు.

"హలో! ఎవరు మీరు?" అన్నాడు గొంతు పెగుల్చుకుని.

"మీ అభిమానిని"

"నాకు అభిమానా? నేనేమైనా సెలబ్రిటీనా? మీరెవరు? సరిగా చెప్పండి"

"అపరిచిత"

"ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నారు?"

"ఇక్కడ్నించే"

"ఎవరు కావాలి మీకు?"

"మీరే మహానుభావా! వేరేవాళ్ళ కోసం ఎందుకు ఫోన్ చేస్తాను?" కిసుక్కున నవ్వింది అపరిచిత.

"ఏమిటి విషయం?"

"మీ డ్రెస్‌సెన్స్ చాలా బాగుంది మాష్టారూ! బిస్కట్ కలర్ ప్యాంటుపైన స్కై బ్లూ షర్ట్. డార్క్ టాన్ షూస్... అదిరింది" రమేష్ తన డ్రెస్‌కేసి చూసుకున్నాడు. ఆమె చెప్పింది కరెక్ట్.

"సో వాట్?" అన్నాడు ఏమనాలో తెలియక.

"ముద్దొస్తున్నారు"

"ప్లీజ్ షటప్" సెల్ డిస్‌కనెక్ట్ చేశాడు.

సెల్ మళ్ళీ రింగయ్యింది. ఆన్ చెయ్యలేదు.

ఆఫీస్ అయ్యాక రాత్రి హోటల్లో భోజనం చేసి



ఇంటికొచ్చాడు. డ్రెస్ మార్చుకుని హాల్లో టీ.వి.చూస్తూ కూర్చున్నాడు రమేష్. సెల్ రింగయ్యింది. "స్వాతి కాలింగ్" అని వచ్చింది.

"హల్లో!" అన్నాడు.

"ఒక్కరోజుకే 'స్వాతి డార్లింగ్' కాస్తా 'హలో' అయిపోయిందా?" అంది స్వాతి.

"అది కాదు స్వాతీ! అవతల ఎవరు మాట్లాడు తున్నారో తెలియకుండా ఎలా 'స్వాతి డార్లింగ్' అనమంటావ్ డియర్?" అన్నాడు రమేష్.

"ఎవరో తెలియడానికి ఎంతమందున్నారేమిటి?" అంది స్వాతి నిలదీస్తూ.

"అబ్బే! అదేంకాదు. నీ ఫోన్ నుంచి మీ అన్నో, అమ్మో, నాన్నో చేశారనుకో అలా అంటే బాగోదు కదా!" అన్నాడు సంజాయిషీగా.

"నా ఫోన్ నుంచి నేనే చేస్తాను. మీకే చేస్తాను. ఇంతకీ ఏం చేస్తున్నారు దొరగారు" అంది స్వాతి.

"నువ్వెళ్ళినప్పట్నుంచి ఏం తోచడంలేదు స్వాతీ! నేనొక్కణ్ణీపడుకోలేను. నిద్రపట్టదు. త్వరగావచ్చెయ్ స్వాతీ! ప్లీజ్" అన్నాడు రమేష్ బ్రతిమాలుతూ.

"రోజూ మీరు నిద్రపోరు, నన్ను నిద్రపోనివ్వరు. ఈ నాలుగురోజులు హాయిగా ముడుచుకుని పడు కోండి" అంది స్వాతి జోకొడుతున్నట్లు.

## విరించి

"నా వల్లకాదు. వెంటనే నువ్వు వస్తావా? నన్ను ఉద్యోగం వదిలేసి వచ్చేయమంటావా?" అన్నాడు రమేష్ అసహనంగా.

"ఏం మొగుడండి బాబూ! పెళ్ళాం ఊరెళితే హాయిగా ఎంజాయ్ చెయ్యక 'రా రా' అని పీకుతా రేంటి? శుద్ధబుద్ధావతారం" అంది స్వాతి గేలిచేస్తూ.

"నాకేం తెలియదు. నువ్వు రేపు వస్తున్నావ్ అంతే" అన్నాడతను.

"చూద్దాం. హాయిగా బజ్జోండి. గుడ్‌నైట్!"

"స్వాతీ! స్వాతీ!"

"గుడ్ నైట్"

"గుడ్‌నైట్" స్వాతి సెల్ డిస్‌కనెక్ట్ చేసింది.

విరహవేదనతో రమేష్‌కు ఆ రాత్రి నిద్ర కరువ య్యింది. మర్నాడు ఉదయం ఆఫీస్ దగ్గర మోటార్ సైకిల్ దిగుతుంటే సెల్ రింగయ్యింది. మళ్ళీ అపరి చిత నెంబర్... సెల్ ఆన్ చేశాడు.

"గుడ్‌మార్నింగ్ ప్రభాస్!" అంది అపరిచిత.

"సారీ! రాంగ్ నెంబర్" అన్నాడు విసుగ్గా.

"ఓహ్! సారీ మహేష్‌బాబు!" అంది అపరిచిత కిలకిలా నవ్వుతూ.

"మహేష్‌బాబా? నాపేరు రమేష్‌బాబు" అన్నాడు రమేష్ అయోమయంగా చూస్తూ.

"కానీ నా మహేష్‌బాబు ప్లస్ నా ప్రభాస్ మీరే కదా స్వామీ!" అంది అపరిచిత.

"ఇంతకీ మీకేం కావాలి తల్లీ!" అన్నాడు విసుగ్గా.

**"నావల్ల కాదు. వెంటనే నువ్వు వస్తావా? లేక నన్ను ఉద్యోగం వదిలేసి వచ్చేయమంటావా?" అన్నాడు అతడు అసహనంగా. "మీరు ఏం మొగుడండి బాబూ! పెళ్ళాం ఊరెళితే హాయిగా ఎంజాయ్ చెయ్యక 'రారా' అని అంటారేంటి? శుద్ధబుద్ధావతారం" అంది గేలిచేస్తూ. ఇంతకీ ఆమె ఉద్దేశం ఏమిటి?**

"మీ ప్యాంట్" అంది.

"నా ప్యాంటా?... ఏం మాట్లాడుతున్నారు?" అన్నాడు రమేష్ ఆశ్చర్యంగా.

"నిన్ననే కదా మీ డ్రెస్ సెన్స్ బాగుందన్నాను. ఈరోజేమిటి షర్ట్ ప్యాంటు రెండూ డార్క్ కలర్స్ వేశారు. మీ ప్యాంటు విప్పేసి, లైట్ కలర్ మ్యాచింగ్ ప్యాంటు వేసుకోండి. లేకపోతే నేను మీ అభిమానినని చెప్పుకోవడానికి సిగ్గుగా ఉంది"

"అసలు మీరెవరు ఎందుకు నా వెంట పడ్తున్నారు"

"నేనెవరో చూడాలనుందా? ఓకె! సాయంత్రం సరిగ్గా ఐదున్నరకు గాంధీనగరం పార్క్‌కు రండి... చూడా లనుంటేనే" అంది అపరిచిత.

"ఓకే! తప్పకుండా వస్తా!" అని సెల్ డిస్‌కనెక్ట్ చేశాడు రమేష్.

ఈమెవరో, ఎందుకు అభిమానినంటూ ఫోన్లో సతాయిస్తోందో ఈరోజు తేలిపోవాలనుకున్నాడు. సాయంత్రం ఐదున్నర అవగానే ఆఫీస్‌నుంచి సరా సరి గాంధీనగరం పార్క్‌కు వచ్చాడు.

టైమ్ ఆరున్నర అయిపోయింది. పార్క్‌లో లైట్లు వెలిగాయి. అపరిచిత రాలేదు. సెల్ తీసి ఆమెకు కాల్ చేద్దామనుకుంటూంటే సెల్ రింగయ్యింది. అపరిచిత... సెల్ ఆన్ చేశాడు.

"హలో!" అన్నాడు.

"సారీ! హృతిక్! ట్రాఫిక్ జామ్‌లో రాలేకపోయాను. నాకోసం పాపం ఎదురుచూస్తున్నట్లున్నారు. బాగా డిజప్పాయింట్ అయ్యారా? మరోసారి కలుద్దాం. గుడ్ నైట్ సర్" అని సెల్ డిస్‌కనెక్ట్ చేసింది రమేష్‌కు మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా.

ఉసూరుమంటూ పార్క్ బయటకు వచ్చి మోటార్ సైకిల్ స్టార్ట్ చేశాడు. దార్లో హోటల్‌లో డిన్నర్ కానిచ్చి ఇంటికి చేరుకున్నాడు రమేష్.

స్వాతి పుట్టింటికి వెళ్ళిందని విరహవేదన పడు తూంటే ఈ అపరిచిత అభిమానినని వెంటపడటం ఏమిటో రమేష్‌కు అర్థంకావడంలేదు.

ఆమె మాటతీరు, నవ్వు బట్టి బాగా చదువుకుందని, ఆత్మవిశ్వాసంగల తెలివైనపిల్ల అని అర్థమవుతోంది.



## పెళ్ళికి రెడీనా?

పెళ్ళీ, ఇల్లూ అంటూ వివాహానికి సిద్ధంగా వున్నవారు ఎవరైనా ప్లాన్ చేసుకుంటారు. దీపికా పడుకొనె కూడా ఇప్పుడు అదే పనిలో పడింది.

రణవీర్‌సింగ్‌తో ప్రేమలో పడిందని, ఈ ఏడాదిలోనే వారి వివాహం అంటూ అదేపనిగా కబుర్లు వినపడుతున్నాయి. ఇప్పటికే పెళ్ళిపనుల్లో మునిగిపోయినట్లున్నారు. ఇద్దరికీ ఖాళీ దొరికితే చాలు షాపింగ్ చేసేస్తున్నారు.

అంతేనా- పెళ్ళితర్వాత కలిసివుండబోయే ఇంటి కోసంకూడా దీపిక జోరుగా ఏర్పాట్లు చేసుకుంటున్నది.ప్రస్తుతం తానుండే ఇంటికి దగ్గరలోనే రెండు అంతస్తుల భవనం తీసుకుని, తన అభిరుచులకు తగినట్లు అలంకరణలు చేయించే పనిలో ఉందని ఆమెసన్నిహితులు చెప్తున్నారు.



ఇదే స్వాతితో పెళ్ళికాకముందైతే ఎగిరి గంతేసేవాడు. ఇప్పుడు స్వర్గసుఖాలన్నీ మూటకట్టి అందిస్తున్న అర్ధాంగినికాదని అడ్వెంచర్స్ చెయ్యడం రమేష్‌కు ఎంతమాత్రం ఇష్టంలేదు.

తనని రోజుకో పేరుతో మహేష్, ప్రభాష్, హృతిక్ అంటూ ముద్దుగా పిలవడం స్వాతి దృష్టిలో పడితే కొంపకొల్లేరైపోతుంది... సంసారం సాగరం అయిపోతుంది. రమేష్ స్వాతికి ఫోన్ చేశాడు.

"హాయ్!" అంది స్వాతి.

"హాయ్ డార్లింగ్! ఎప్పుడొస్తున్నావ్?" అన్నాడు రమేష్.

"ఏం? నేను రావట్లేదని బాధగా ఉందా? వచ్చేస్తున్నానని కంగారుగాఉందా?" అంది స్వాతి నవ్వుతూ.

"అదేంటి డియర్? నిన్ను విడిచి ఎలా ఉండగలననుకుంటున్నావ్? నువ్వెప్పుడు వస్తావా... ఎప్పుడు నిన్ను ముద్దుల్లో ముంచి కౌగిట్లో బంధిస్తానా అని ఎదురుచూస్తుంటే" అన్నాడు ప్రేమగా.

"ఓకే! బాస్!రేపుబయల్దేరి ఎల్లుండి ఉదయం గౌతమీకి దిగుతున్నాను. మీకు నామీద ఎంతప్రేముందో చూస్తానుగా? స్టేషన్‌కు వచ్చినన్ను రిసీవ్ చేసుకోండి" అంది స్వాతి.

"అప్పటిదాకా ఎందుకు? ఇప్పుడే వెళ్ళి నీకోసం స్టేషన్‌లో ఎదురుచూస్తూ కూర్చుంటా" అన్నాడు.

"మీరు అంతపనీ చేయగల సమర్థులేగానీ ఎల్లుండి పొద్దున్నే రండిచాలు. గుడ్‌నైట్..." అంది స్వాతి.

"హలో... హలో! బోగీ నెంబరు చెప్పు"

"యస్ నైన్... గుడ్‌నైట్"

"గుడ్‌నైట్" అవతల సెల్ డిస్‌కనెక్ట్ అయ్యింది.

బెడ్‌రూమ్‌లో కాసేపు టి.వి. చూసి, ల్యాప్‌టాప్‌లో మెయిల్స్, వాట్సాప్‌లో చాట్స్ చూసుకుని నడుము వాల్చాడు. ఇంతలో సెల్ రింగయ్యింది. మళ్ళీ అపరిచిత... ఈమెకేం పనిలేదనుకున్నాడు. సెల్ ఆన్‌చేయగానే "హలో! డ్రీమ్‌బాయ్!" అంది.

"చెప్పు" అన్నాడు.

"సారీ! మహేష్ బాబూ! ఐమీన్ రమేష్‌బాబు! ఈరోజు అర్జెంటు పనిమీద మా ఊరెళుతున్నా. రేపు రాత్రి గౌతమీకి బయల్దేరొస్తా. దయచేసి స్టేషన్‌కు రాగలరా? మీకో ముఖ్యమైన విషయం చెప్పాలి. ఆ తర్వాత మిమ్మల్ని విసిగించను. సరేనా?" అంది.

రమేష్ మాట్లాడలేదు.

"ఓకే! మౌనం అంగీకారసూచకం. మీరు వస్తున్నారు అంతే! కోచ్ యస్ ఎయిట్.బ్లూ శారీ కట్టుకుంటా మీరు ఈజీగా గుర్తుపట్టడానికి... ఓకేనా? బై! గుడ్ నైట్!" అంది అపరిచిత.

రమేష్ సెల్ డిస్‌కనెక్ట్ చేశాడు. ఈ అపరిచిత గోల ఏమిటో అర్థంకావడంలేదు. పోనీ రైల్వేస్టేషన్‌కు వెళ్దామా అంటే అదే ట్రయిన్‌కు స్వాతి వస్తానంది. కోచ్‌లు కూడా యస్ ఎయిట్... యస్ నైనే. పక్కన స్వాతి ఉండగా ఎలా మాట్లాడటం?పోనీ మానేద్దామంటే 'ఓ ముఖ్యమైన విషయం చెప్పాలి' అంటోంది. రమేష్ తలపట్టుకు కూర్చున్నాడు. మర్నాడు అంతా ఆలోచించాడు, 'ఇద్దర్నీ ఒకేసారి ఎలా రిసీవ్ చేసుకోవాలా' అని. మరి స్వాతి అడిగితే 'అపరిచిత తన క్లాస్‌మేట్' అని చెబుదాంలే అని డిసైడ్‌చేసుకుని రాత్రి పడుకున్నాడు.

మర్నాడు ఉదయమే లేచి హడావుడిగా రైల్వే స్టేషన్‌కు వచ్చాడు. అప్పుడే గౌతమీ వస్తోందని ఎనౌన్స్‌మెంట్ అవుతోంది. ప్లాట్‌ఫామ్‌మీద రిసీవ్ చేసుకోవడానికి వచ్చినవాళ్ళతో హడావుడిగా ఉంది. యస్ నైన్ ఆగేచోట నుంచున్నాడు.

ఎదురుచూసిన గౌతమీ రానేవచ్చి ప్లాట్‌ఫామ్ పై ఆగింది. ఒకేసారి రెండు బోగీల మీద చెరోకన్నువేసి మంచి టెన్షన్ మీద ఉన్నాడు రమేష్. జనం ఒక్కొక్కళ్ళు కంపార్ట్‌మెంట్స్‌లోంచి దిగుతున్నారు.

యస్ నైన్ దాదాపుగా ఖాళీ అయిపోయింది గానీ స్వాతి దిగలేదు. ఆ పక్క యస్ ఎయిట్‌లోంచి ఎవరో బ్లూ శారీతో దిగుతున్నారు. ఇటు స్వాతి కనపడలేదని టెన్షన్... అటు ఆ దిగేది అపరిచితేమోనని అనుమానంతో రమేష్‌సతమతమవుతున్నాడు.యస్ నైన్‌ఖాళీ అయిపోయింది.స్వాతిరాలేదు.గబగబా యస్‌ఎయిట్ వైపు నడిచాడు. బ్లూ శారీ ఆమె ఆ పక్కకు తిరిగి ఎవరితోనో మాట్లాడుతోంది. దగ్గరగా వెళ్ళాడు.

పలకరిద్దామనుకునే సమయానికి ఆమే వెనక్కి తిరిగింది. ఆమెను చూడగానే రమేష్ తలతిరిగింది. బ్లూశారీలో స్వాతి."నువ్వు... నువ్వు... యస్ నైన్‌లో" అన్నాడు తడబడుతూ రమేష్.

"నేను... నేనే...పదండి. ఇంటికెళ్దాం" అంది స్వాతి నవ్వుతూ. రమేష్‌కు ఏమీ అర్థం కావడంలేదు. అపరిచిత ఏమయ్యిందో తెలియదు. అపరిచిత వస్తానన్న కోచ్‌లో తను ధరిస్తానన్న బ్లూ శారీలో స్వాతి...

ఇంటికొచ్చి తలుపు తీసి ఇంట్లోకి రాగానే స్వాతిని గట్టిగా కౌగిలించుకుని గాల్లో గిర్రున తిప్పి ముద్దులతో ముంచెత్తాడు. "అపరిచితనైనా ఇలాగే తిప్పేవారా?" అంది స్వాతి నవ్వుతూ.

గతుక్కుమన్నాడు రమేష్. "అపరిచిత నీకెలా తెలుసు?" అన్నాడు ఏమనాలో తెలియక.

"ఆ అపరిచిత నేనే కనుక" అంది.

"ఎలా?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"ఎదురింటి శారదతో ఏరోజుకారోజు ఏ కలర్ డ్రెస్‌వేసుకున్నారో ఫోన్లోచెప్పమన్నాను.మా అన్నయ్య సెకండ్ సిమ్ తీసుకుని నేనే వాయిస్ మార్చి మీకు ఫోన్‌చేశాను. ఎలా ఉంది? పాపం! డిజప్పాయింటయ్యారా?" అంది స్వాతి గలగలా నవ్వుతూ.

"నువ్వు బ్రష్‌చేసుకుని, స్నానానికి బాత్‌రూమ్‌లోకి నడు. నేనేమయ్యానో చెబుతా. ఈరోజు నువ్వో నేనో తేలిపోవాలి" అన్నాడు రమేష్.

"కొత్త బిచ్చగాడు పొద్దెరగడులా ఉంది. ఇప్పుడు కుదరదు. రాత్రి చూద్దాం ఎవరు నెగ్గుతారో.." అంటూ స్వాతి బాత్‌రూమ్‌లోకి వెళ్ళి ... కావాలనే లోపల బోల్ట్ వేయడం మరిచిపోయింది స్వాతి.



ప్రస్తుత ఆర్థిక సంక్షోభానికి ప్రస్తుత ప్రభుత్వమే కాదు గత పదేళ్ళ యు.పి.ఎ. ప్రభుత్వమూ కారణమే.

-వై.వి.రెడ్డి, ఆర్.బి.ఐ. మాజీ గవర్నర్

గొర్లి శ్రీనివాసరావు

రొమాంటిక్ సీరియల్

# ఏరదేశీ ప్రేమకథ

"భయం!! భయం!!
ఎందుకు భయం!!! ఎంతకాలం
ఈ భయం?! భయపడుతూ
బతకడంకంటే చావడం మేలు
ఎవరైనా నీ జోలికొస్తే చెప్పు
నే చూస్తా!! మాది బెంగాల్.
కలకత్తా కాళి తెలుసుగా?!"

నవ్వింది యువతి
ఎవరా ఇద్దరు?!
ఏం జరుగుతోందక్కడ!!
ఎవరివల్ల వారికాపద?!
వీళ్ళు దెబ్బతీద్దామనుకుంటున్న
దెవరిని?!

**చదివితే తెలుస్తుంది!**

**13.7.2018 సంచికలో ప్రారంభం!**



# అంతా రాజకీయమే

## ఎటూ మొగ్గక

మాజీ రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ ఆర్.ఎస్.ఎస్. ప్రధాన కార్యాలయంలో జరిగే ఒక శిక్షణా శిబిర వీడ్కోలు సభకు అతిథిగా వెళ్ళాలన్న నిర్ణయం రాజకీయ సంచలనం. ప్రణబ్‌ముఖర్జీ ఆర్.ఎస్.ఎస్.కి అనవసరపు ప్రాముఖ్యత తెచ్చిపెడుతున్నాడని కాంగ్రెస్‌వారు విమర్శించారు.

ఆ ఆహ్వానాన్ని అంగీకరించిన నిర్ణయం పునఃపరిశీలించుకోవాలని కోరారు. అయితే మాజీ రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ నాగపూర్ వెళ్ళటమే కాక ప్రసంగం చేసి తానేమిటో అన్ని పార్టీలకు నిరూపించాడు.

తన ప్రసంగంలో ఎవ్వరినీ నొప్పించక, ఎటువైపూ మొగ్గక అందరికీ సంతృప్తిని పంచుతూ, ఎవరు ఎలా అర్థంచేసుకుంటే అలా తమవైపు ఉన్నాడని అనిపించేలా ప్రసంగించాడు.ఎవరికి లాభముందో! ఎవరికి నష్టం కలిగిందో! తెలియనివ్వనంత సుతిమెత్తని ప్రసంగం చెయ్యటం ద్వారా ప్రణబ్‌ముఖర్జీ తన రాజకీయ చతురతను ప్రదర్శించాడు. ఇలా ఎటూ మొగ్గకుండా నడిచే ఆయన రాష్ట్రపతి అయ్యాడు.

మరి ఆయన కాలేకపోయిన మరో పదవికి మార్గం నిర్మించుకుంటున్నాడా! అనేది సందేహం. ◆

## దిద్దుబాటు మొదలు

వరుస ఓటములకు అసలు కారణాలు బి.జె.పి. అర్థంచేసుకుంది. ప్రతిపక్షాలన్నీ ఏకమయితే ఏ అధికార పార్టీ అయినా ఓడిపోతుంది. అది లెక్క.

అయితే అలా ఏకమైన ఆ ప్రతిపక్ష పార్టీలకు మద్దతుగా నిలుస్తున్న వర్గాలు ఏవి అనేవి గుర్తించడం జరిగింది. ఒకటి వ్యవసాయదారుల అసంతృప్తి, రెండవది షెడ్యూల్డ్ కులాల, తెగలలో వచ్చిన వ్యతిరేకత పార్టీ ప్రయోజనాలను దెబ్బతీస్తున్నాయి.

ఆ రెండు అంశాలను చక్కదిద్దకపోతే 2019లో పార్టీకి ఇబ్బందులు తప్పవు. వాటిని చక్కదిద్దే పరిస్థితిలో రాష్ట్రాల స్థాయిలో నాయకులు సిద్ధంగా లేరు. అందువల్ల ఎప్పటిలాగానే బి.జె.పి. తిరిగి తమను గెలిపించమని ఆర్.ఎస్.ఎస్.ని కోరింది.

ఇటీవల కాలంలో ఆర్.ఎస్.ఎస్. అగ్రనాయకులు ఇద్దరిని ఢిల్లీకి పిలిపించి, కేంద్రమంత్రులు ముగ్గురు వారిముందు తమ ఓటమి కష్టాలను పంచుకున్నారు. పరిష్కార మార్గాల్ని కనుక్కుని స్వయంసేవకులను రంగంలోకి దింపటం సంఘం చెయ్యాల్సివుంటుంది. అదే బి.జె.పి. దిద్దుబాటు ఫార్ములా. ◆

## బి.జె.పి.కి బీహారు గోల

మూలిగే నక్కమీద తాటికాయ పడినట్లుగా ఉంది బీహార్‌లో బి.జె.పి. పరిస్థితి. అధికారానికి అనుకూలంగా తన మిత్రులను మార్చుకునే బీహార్ సి.ఎమ్. నితీష్‌కుమార్ బి.జె.పి.తో బంధం తెంచుకుంటారన్న వార్తలు వస్తున్న వేళ అతన్ని బుజ్జగించి నిలుపుకోవటం బి.జె.పి.కి ఇబ్బందిగా ఉంది.

అటువంటి వేళ ఎన్.డి.ఎ.లో భాగస్వామిగా ఉన్న ఆర్.ఎల్.ఎస్.పి. పార్టీ అధినేత ఉపేంద్ర కుషవా తనకు ఇచ్చిన కేంద్రమంత్రి పదవితో సంతృప్తి చెందటంలేదు. నాలుగేళ్ళ మంత్రిపదవితర్వాత ఇప్పుడు కుషవా దృష్టి బీహారు ముఖ్యమంత్రి పదవిమీద పడింది. వచ్చే ఎన్నికల్లో ఎన్.డి.ఎ. తరపున బీహార్ ముఖ్యమంత్రి అభ్యర్థిగా తన పేరు ప్రకటిస్తారా! లేదా! అని బెదిరిస్తున్నాడు.

బీహారు జనాభాలో 10 శాతం కుషవా కులస్తులున్నారు. వారి జనాభానే అధికశాతం. కాబట్టి ఆ పదవి తనకే దక్కాలంటాడు ఉపేంద్ర కుషవా. పైగా తనకు దళితులు, ముస్లిమ్‌ల మద్దతు ఉందని, నితీష్‌ని వదిలేయమని ఒత్తిడి తెస్తున్నాడు. ◆

## ఐక్యతకోసం పోతే

కేరళ రాష్ట్రంలో కాంగ్రెస్‌కి కొత్త సమస్య వచ్చి పడింది. కేరళలో యు.డి.ఎఫ్.కి సారథి కాంగ్రెస్. అందులో భాగస్వామి అయిన కేరళ కాంగ్రెస్ (మణి) పార్టీ యు.డి.ఎఫ్.కి దూరంగా ఉంటున్నది.

అలిగివున్న ఆ పార్టీని దగ్గరకు తీసుకుంటే యు.డి.ఎఫ్. బలపడుతుందని భావించి తాజాగా రాజ్యసభ సీటును ఆ పార్టీకి కేటాయించింది.

వచ్చిన కొద్ది రాజ్యసభ సీట్లను ఇతరులకోసం త్యాగం చేయించి కాంగ్రెస్ ప్రయోజనాలను దెబ్బతీస్తున్నారన్నది ఆరోపణ. కాంగ్రెస్ (మణి) పార్టీ క్రైస్తవుల పార్టీ. గతంలో అటువంటి అవకాశం వస్తే రాజ్యసభ టికెట్టు ముస్లిమ్‌లీగ్‌కి కేటాయించారు.

ఇలా మైనారిటీల ప్రయోజనాలకు పెద్దపీట వేసి, హిందూ వర్గాలకు వ్యతిరేకంగా వ్యవహరించే పార్టీ కాంగ్రెస్ అనే ముద్ర మూట కట్టుకుంటున్నామన్నది కాంగ్రెస్‌లోని ఒక వర్గంవారి ఆలోచన. కేరళలోకి అడుగుపెట్టి, బిజెపి బలపడటానికి మన కాంగ్రెస్ పార్టీ విధానాలే దోహదపడుతున్నాయని కాంగ్రెస్‌లోని సీనియర్లు కొందరు సణుగుతున్నారు. ◆

## పవర్ ఫార్ములా

కర్ణాటకలో జె.డి.(ఎస్), కాంగ్రెస్ సంకీర్ణం ఇంకా స్థిరపడలేదు. మంత్రివర్గం పూర్తిగా ఏర్పాటుకాలేదు. కాంగ్రెస్ పార్టీకి కేటాయించిన ఇరవైరెండు మంత్రి పదవుల్లో ఆరు ఇంకా ఖాళీగా ఉన్నాయి.

మంత్రిపదవులు దక్కనివారు వేరు కుంపటి బెదిరింపులు చేస్తున్నారు. అయితే కర్ణాటకలో అధికారం కాపాడుకోవటం చాలా అవసరం. అందుకే ఇప్పుడు తన ఎమ్.ఎల్.ఎ.లను జారిపోకుండా చూసుకునేందుకు హైకమాండ్ కొత్త ఫార్ములా, చాలా పవర్ ఫార్ములా రూపొందించారు.

ఐదేళ్ళ పదవీ కాలం ముగిసేలోగా పార్టీకి ఉన్న డెబ్బైఎనిమిదిమంది ఎమ్.ఎల్.ఎ.లకు మంత్రిపదవి వచ్చేలా చూస్తామని హామీ ఇచ్చింది. ప్రతి సంవత్సరంన్నర కాలం అవగానే మంత్రులను తొలగించి కొత్తవాళ్ళకు అవకాశం ఇప్పిస్తారట.

ఆ విధంగా అందరికీ మంత్రులమనిపించుకునే అవకాశం దక్కుతుంది. 'మా మాట నమ్మండి... హై కమాండ్‌మీద విశ్వాసం ఉంచండి' అంటూ ఢిల్లీనుండి ఒకరితరువాత మరొకరు బెంగళూర్‌కి రాయబారాలు మోసుకొస్తున్నారు. ◆

## ఇద్దరి దారీ ఒకటే

రాజకీయాలలో గురుశిష్యులు రాష్ట్రాలు విడిపోయినతర్వాత రెండు రాష్ట్రాలకు ముఖ్యమంత్రులయ్యారు. ఒకరి రాజకీయ పద్ధతులు, ఎత్తుగడలు రెండవవారికి బాగా ఎరుకే. అందుకే ఇద్దరూ ఒకే సమయంలో ఒకే దారిని ఎంచుకుంటున్నారు.

ఇద్దరు ముఖ్యమంత్రులు ఏకకాలంలో జాతీయ రాజకీయాలవైపు దృష్టి సారించారు. నాలుగేళ్ళు రాష్ట్రాన్ని ముఖ్యమంత్రిగా నడిపించినతర్వాత ఇక తమది జాతీయస్థాయి రాజకీయం అనుకున్నారు.

తద్వారా తమ రాష్ట్రాన్ని కొడుకులకు అప్పగించి, వారిని రాష్ట్రంలో స్థిరపడేలా చేస్తూ, తాము జాతీయ స్థాయిలో కీలకపాత్ర పోషించటం వారి ఉద్దేశ్యం.

అయితే దక్షిణాదివారికి అంత త్వరగా జాతీయ స్థాయిలో పదవులు ఇవ్వటానికి అంతగా ఇష్టపడని ఉత్తరాదివారు ఏకకాలంలో ఇద్దరు దక్షిణాది నేతలు జాతీయ స్థాయి రాజకీయాలు నడుపుతామంటే ఊరుకుంటారా! అందుకే ఆచితూచి అడుగులు వెయ్యాల్సివస్తోంది ఇద్దరు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులకు.కాని ఒకసారి జాతీయ ఆలోచన వచ్చిన తర్వాత అది అంతటితో ఆగటం కష్టమే మరి.

# సత్యాన్వేషణ



## శ్రీ మహావిష్ణు ప్రార్థన

**మేఘశ్యామం పీత కౌశేయవాసం**
**శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్**
**పుణ్యోపేతం పుండరీకాయతాక్షం**
**విష్ణుం వందే సర్వలోకైకనాథమ్॥**

మేఘమువలె నల్లనివాడు,
పసుపుబట్టను ధరించినవాడు,
శ్రీవత్సమను పుట్టుమచ్చ
రొమ్ముపై కలవాడు, కౌత్సుభమణిచే
ప్రకాశించు శరీరము కలవాడు,
పవిత్రుడు, తెల్లతామరపువ్వులవలె
విశాలమైన కన్నులు కలవాడు,
లోకాలన్నిటికీ ప్రభువు అయిన
శ్రీ విష్ణుమూర్తిని
నమస్కరించుచున్నాను. ❐

## దశపాపహర దశమి

**(తేది : 22.6.2018)**

'దశ-పది అయిన, పాప-పాపాలని, హర-పూర్తిగా తొలగించగల, దశమి-దశమీ తిథి' అని 'దశపాపహర దశమి' అనే మాటకర్థం.

ఇంతకీ ఏవి ఆ పాపాలు? అనేది సందేహం కదా! 1. ఇతరుల సొమ్ముని నమ్మకంగా తీసుకుని ఎగగొట్టడం లేదా దొంగిలించడం, 2. ఎదుటివ్యక్తిని భౌతికంగా హింసించడం, 3. ఇతరుల భార్యని గురించి అసభ్యంగా మాట్లాడడం.

4. నోటికొచ్చినట్లు మాట్లాడడం, 5. అబద్ధాలు చెప్పడం, 6. తెలిసీ తెలియని సమాచారాన్ని నిజమనుకునేటట్లుగా ఎదుటివారికి నమ్మకంగా చెప్పడం, 7. ఇతరులకి చెడు జరగాలనుకోవడం, 8. అర్థంలేని పట్టుదల, 9. కావాలని ఖర్చుచేయించడం, 10. చాడీలు చెప్పడమనే ఈ 10 దోషాలే దశ పాపాలు.

ఈ రోజున నువ్వులూ బెల్లమూ కలిపిన ముద్దల్ని పదింటిని మీ అభీష్టదైవం-అదే ఇంటి వేలుపు-లేదా-

{ ధర్మం ఉన్నచోట విజయం తథ్యం. }

కులదైవానికి నైవేద్యంగా పెట్టాలి. పారే నది ఎక్కడ ఉందో అక్కడికెళ్ళి స్నానం చేస్తూ పదిమార్లు మునగాలి ఆ దశపాపాలూ తొలగడంకోసం.

త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకి సంబంధించిన ఒక్కొక్క శ్లోకాన్ని చదవడం, అలాగే ఈ దశపాపాలనీ పది మునకలతో తొలగించిన గంగానదికి సంబంధించిన శ్లోకాన్నీ చదవాలి.

మునకలు వేసేటప్పుడు నమశ్శివాయై నారాయణ్యై దశపాపహారాయై నమో నమః అనే మంత్రాన్ని ఉచ్చరిస్తూ ఉండాలి.

ఆరోగ్యపరంగా నువ్వులూ బెల్లపు మిశ్రమం మంచి దనే లోరహస్యాన్ని గమనించుకోవాలి. ❐

## నిర్జల ఏకాదశి

**(తేది : 23.6.2018)**

నిర్-ఏ మాత్రమూ లేకుండా, జల-నీటిని గురించి చేసే, ఏకాదశి- ఏకాదశీ తిథి ఏదో దాన్ని 'నిర్జల ఏకాదశి' అన్నారు.

అంటే ఆ ఏకాదశీ తిథి ప్రవేశించిన సమయం నుండి మళ్ళీ ద్వాదశీ తిథి వచ్చేవరకూ నీటిని తాగకుండా ఉండాల్సిన ఏకాదశి అన్నమాట.

ఈ సంవత్సర పంచాంగం ప్రకారం జూన్ 22వ తేదీ రాత్రి 3.21 నిమిషాలనుండి జూన్ 23వ తేదీ రా. 3.52 వరకూ ఏకాదశి ఉంది.

శరీరం నీరు లేకుండా ఎంతకాలం ఉండగలదో దాన్నిబట్టి శరీరారోగ్యాన్ని పరీక్షించుకునే ప్రక్రియ ఇది. ఏ తీరు వ్యాధి తమకి ఉన్నా ఈ నిర్జల ఏకాదశిని చేయకూడదు. ఏకాదశినాడు ఏ పండ్లో తీసుకున్నా నీటిని తాగకుండా ఉండడమంటే గట్టి ఆరోగ్యపరీక్షే మరి! ❐

## జ్యేష్ఠాభిషేకం తిరుమలలో

**(తేది : 24.6.2018 నుండి 26.6.2018)**

తిరుమల శ్రీహరికి ప్రతి సంవత్సరంలోనూ అందునా జ్యేష్ఠమాసంలో వచ్చే జ్యేష్ఠానక్షత్రం ముగిసే సమయానికి ముగిసేలా చేసే మూడు రోజుల అభిషేకం జ్యేష్ఠాభిషేకం.

సాధారణంగా ఉత్సవమూర్తులకే అభిషేకాలని చే(యి)స్తారు ప్రతినిత్యం. మూలవిరాట్టుకే రోజూ ఇలా చేస్తే అరిగిపోవడం, ఎక్కడైనా భిన్నం కావడం వంటివి జరగచ్చు. పంచామృతాలతో రోజూ అభిషేకాన్ని చేయడంవల్ల మూలవిరాట్టుకి ఏదైనా లోపంరావచ్చు.

కాబట్టి మూడురోజులపాటు ఈ తీరు అభిషేకాన్ని జరిపించే మాసం జ్యేష్ఠం. నక్షత్రం జ్యేష్ఠం. 24 జూన్‌న అలాగే 25న అదే తీరుగా 26న జరుపబడి జ్యేష్ఠాభిషేకం ముగుస్తుంది.

# స్టోరీ బుక్స్ పవర్


Courtesy : CHILD

పుస్తకాలు చదవడంవల్ల పిల్లలకు ఎంతటి ప్రయోజనం కలుగుతుందనే సంగతి అంద రికీ తెలిసిన విషయం. ఎందుకు పుస్తకాలు చదవాలి? అని ప్రశ్నించుకుంటే కారణాల జాబితా చెంతాడంత వుంటుంది. వారికి పుస్తకాలు చదివి వినిపించే సమ యంలో పెద్దవాళ్ళతో బాండింగ్ బావుంటుంది.

పిల్లల్లో భాషా నైపుణ్యాలు మెరుగవుతాయి. వారిలో ఊహాశక్తి పెరుగుతుంది. పుస్తకాలు చదవడం వల్ల కలిగే ప్రయోజనాల్లో ఇవి కొన్ని. మరో ముఖ్యమైన అంశాన్ని అనేకమంది గుర్తించారు.

పిల్లలకు ఫిక్షన్ చదివి వినిపించినప్పుడు, ఇతర వ్యక్తులను చదవగల నైపుణ్యాన్ని అలవరచుకోవడంలో వారికి సహకరిస్తున్నట్లు లెక్క. తల్లిదండ్రులు పుస్త కాలు చదివి వినిపించడంవల్లపిల్లల్లో భావోద్రేకపరమైన ఇంటెలిజెన్స్ మెరుగవుతుంది.

మనస్సులోని భావాలను, చుట్టుపక్కలగలవారి అభిప్రాయాలను స్పృజించగల సామర్థ్యం పెరుగు తుందని పిల్లల మానసికశాస్త్రవేత్తలు చెప్తుంటారు.

కోపం, భయం, బాధ, ఆత్రుతవంటి క్లిష్టమైన ఎమోషన్లను ఎదుర్కోగల వ్యూహాల గురించి పిల్లలు కథలనుంచి గుర్తించే విధంగా, వాటిని చదువుతూ వివరిస్తుండాలి. దీనివల్ల వారిలోని ఎమోషనల్ ఇంటెలి జెన్స్ పెరుగుతుంది.

తమలోని భావోద్రేకాలను నిర్వహించుకోగల సామర్థ్యాన్ని పెంచుకోవడంలోనూ కథలు సహకరి స్తాయని అనేక అధ్యయనాలు పేర్కొంటున్నాయి.

ఫలితంగా స్కూల్‌లో వారి ఎటెన్షన్ ఉత్తమంగా వుంటుంది. జీవితంలో అనుకూల బాంధవ్యాలు ఏర్పరచుకునే అవగాహన ఏర్పడుతుంది. ఫిక్షన్ పిల్లలపై అనేక విధాలుగా అనుసంధానం కాగలవని గుర్తించారు. కథ చదువుతున్నప్పుడు కొనసాగే ఆలో చనలు వారిపై మంచి ప్రభావాన్ని చూపుతాయి.

## ఏ వయస్సులో ఏ పుస్తకాలు

అమ్మ గర్భంనుంచి బయటకు వచ్చినప్పటి నుంచి ఎదుగుదలప్రక్రియలో ప్రతిరోజుకూలెక్క వుంటుంది. పిల్లల మానసిక, శారీరక తీరు రోజు రోజుకూ మారుతూ కొనసాగుతుంది.

కాబట్టి పుస్తకాలఎంపిక వారివయస్సుకు తగి నట్లు వుండాలి.రెండేళ్ళ వయస్సువరకు ఎంచుకునే పుస్తకాలు బోల్డ్ లైన్స్‌తో, పెద్దపెద్ద బొమ్మలతో వుండాలి. ఈ వయస్సు పిల్లల దృష్టి అంతగా ఎదగదు. కనుక బొమ్మల్ని గుర్తుపట్టగల మాదిరి పెద్దపెద్దగా వుండాలి.

జంతువుల బొమ్మలు, రైమ్స్ వంటివి కూడా ఈ వయస్సువారికి సూటయ్యే పుస్తకాలు. ■

## పెద్దల మాదిరే ప్రభావం

పుస్తకాలు చదువుతున్నప్పుడు పెద్దలకు అవి ఏ విధంగా స్వీయ అనుభవాలను గుర్తుచేస్తుంటాయో పిల్లలకూ అంతే. ఇంట్లోని పెద్దలు పెద్దగా చదివి వినిపిస్తుంటే పిల్లలు పూర్తి ఏకాగ్రతతో నిమగ్నం అవుతారు.భయం కలిగించే కథలకు వాళ్ళు దృఢంగా స్పందిస్తారు. కథ సుఖాంతాన్ని వాళ్ళు ఇష్టపడతారు. విలన్ పాత్రలు అస్సలు నచ్చవు.

ఇవన్నీ వారిలో పరోక్షంగా అనుకూల దృక్పథాన్ని పెంచుతాయన్నమాట. కల్పితకథలు ఏ విధంగా పిల్లల మెదడు మేధావితనాన్ని ప్రభావితంచేస్తాయన్న విషయంలో విస్తృత పరిశోధనలు నిర్వహించారు. ఏ హారీపాటర్ సిరీస్‌లో పుస్తకమో చదువుతున్నారను కుందాం. దానిలోని పాత్రలు పాఠకుడి మెదడులోకి చొచ్చుకుపోతున్నట్లుగా చురుగ్గా వుంటారు.

పిల్లల మెదళ్ళు విభిన్నంగా పనిచేస్తాయనడానికి ఇక్కడ కారణాలు ఏం కనపడవు. పాత్రల ప్రభావం స్పష్టంగా వారిని ఆవరిస్తుంది.

అంటే చదవడంవల్ల పిల్లల ఎమోషనల్ ఇంటెలి జెన్స్‌ను నేరుగా ప్రభావితం చేస్తుందన్నమాట.

అంతేకాదు కథల్లోని నీతి, విలువలు వారిలో సానుభూతి ధోరణిని సైతం పెంచుతాయి.కథా నాయకుడిలోని మంచి పిల్లలపై అనుకూల ప్రభావం చూపుతుంది.పిల్లల ఎదుగుదల క్రమంలో ఇటువంటి అనుకూల దృక్పథం ఎంతగానో వారికి ఉపకరిస్తుంది. వాళ్ళు సక్సెస్ బాటలో పయనించడానికి ఈ ధోరణి అవసరం చాలా వుంటుంది.

చాలా కథలు ఇతరుల ఆలోచనలను అర్థంచేసు కోవడానికి ఉపకరించేవిగా వుంటాయి.

## టెలివిజన్‌లో కుదరదు

పిల్లల్ని కూర్చోబెట్టి లేదా నిద్రకు ఉపక్రమించే ముందు పెద్దవాళ్ళు కథలు చదువుతూ, దానిలోని మంచి చెడ్డలను పిల్లలకు విశ్లేషిస్తుంటారు. దీనివల్ల వారిలో అవగాహనా సామర్థ్యం పెరుగుతుంది.

తమకు కలిగే సందేహాలను పెద్దల్ని అడిగి నివృత్తి చేసుకుంటుంటారు. ఫలితంగా వారిలోని ఆలోచనా శక్తి, అవగాహనా సామర్థ్యం పెరుగుతాయి. అయితే టెలివిజన్ ముందు ఇదంతా సాధ్యం కాదు.

వాస్తవానికి పిల్లలు ఎక్కువ భాగం టెలివిజన్‌ను స్వంతంగా, తమ ఇష్టం వచ్చినరీతిలో చూస్తుంటారు. సదరు కార్యక్రమాలగురించి పెద్దవాళ్ళు పక్కనే కూర్చుని చర్చించరు, వివరించరు. పైగా టీవీ కార్య క్రమాల నడుమ తరచూ వచ్చే వాణిజ్య ప్రకటనలు వారిని గందరగోళపరుస్తుంటాయి.

దీంతో టీవీలో సాగే కథ, కథనాల ప్రభావం బలహీనపడుతుంటుంది. కథలు, వాటిలోని సవాళ్ళు పిల్లలకూ అనేకక్లూలు అందిస్తూ, భావోద్రేకాలను తెలియజెప్తుంటాయి. కథలో క్యారెక్టర్‌ను మరీ విషాదంగా చిత్రించరు.

పిల్లల కథల్లో ఇటువంటి విషాదాల హోరు వుండదు. భావాలను చక్కగా వ్యక్తీకరించగల శారీరక భాష లేదా చర్య వారికి అలవడతాయి.

కథల్లోని పాత్రలతో భావోద్రేక పరంగా అనుసంధానపరిచే విషయంలో మరే ఇతర మాద్యమమూ కూడా కథల పుస్తకానికి సరిజోడి కాలేదు.

## 2-3 సంవత్సరాలు

బొమ్మలు చూపించి వారిని ప్రశ్నలడిగే విధంగా వుండాలి. పుస్తకాల్లోని పాత్రల్ని అంటే బొమ్మల్లోని భావాలను వారికి వివరిస్తూ, చిన్నచిన్న ప్రశ్నలు అడుగుతుంటే పిల్లలకు కొన్ని పాత్రలు, భావాలు అర్థమై, చురుగ్గా వుంటారు.

వాస్తవిక స్నేహాల విలువ, సానుభూతి ధోరణులకు ఇక్కడే బీజం పడాలి. అందుకు అనువైన పుస్తకాలు ఎంచుకోవాలి. సరదా సన్నివేశాల్ని వర్ణిస్తూనే, వాటి లోని విలువల్ని బోధించేందుకు పుస్తకాలు అనువుగా వుండాలి. ఎదుటివారు కష్టపడ్డారన్న భావం వారి బుర్రలోకి వెళ్తే చాలు. ఈ వయస్సు పిల్లలు చిన్నగా, కొద్దికొద్దిగా స్వంతంగా చదువుకోగలరు.

అయినప్పటికీ తనకు పుస్తకాలు చదివి వినిపిస్తూనే వుండాలి. లేనట్లయితే, వాళ్ళు చదవడంపైనే యాంత్రికంగా దృష్టిని కేంద్రీకరిస్తారు. కథ అర్థాన్ని గ్రహించలేకపోతారు.

## 5-6 సంవత్సరాలు

ఈ వయస్సు పిల్లలకు పాత్రల గొప్పదనం, కథల్లోని నీతి వారిలోని సానుభూతిధోరణికి సాన పెడుతుంది. ఏదో ఒక అసాధారణ ప్రతిభ దాగి వుంటుందన్న వాస్తవిక ధోరణిలో వుంటారు. పాత్రలు ఎదుర్కొనే సవాళ్ళు, సాధించే విజయాల తాలూకు ప్రభావం చిన్నిబుర్రలపై సమగ్రంగా పడుతుంది.

ఈ వయస్సువరకు పుస్తకాలు చదివి వినిపిస్తుంటే, ఇక చదవడం అనేది వారి దినచర్యలో భాగంఅయిపోతుంది.నెమ్మదిగా తమకు ఇష్టమైన పుస్తకాలను తామే ఎంచుకోగల పరిణతి ఏర్పడుతుంది.

చదువుల పోటీనడుమ కథలు చదవడమన్నది సమయం వృధాగా భావించే వాళ్ళు ఎంతోమంది తారసపడుతుంటారు. ఈ ధోరణి చాలా తప్పు.

కేవలం ఎకడమిక్ అభివృద్ధికే పిల్లల్ని పరిమితం చేస్తే, మానసిక పరిపక్వత, ఇతరుల్ని అంచనా వేయ గల, అవగాహన చేసుకోగల సామర్థ్యం వారికి లోపిస్తాయి. భావోద్రేకాల నియంత్రణ, భావవ్యక్తీకరణ కొరవడతాయి. భాషా నైపుణ్యాలూ అంతంతమాత్రమే అవుతాయి.

కథలు చదివే తీరిక తమకు లేదని సర్దిచెప్పుకుంటూ వారిని టెలివిజన్ ముందు కూర్చోబెట్టినా, కంప్యూటర్ గేమ్‌లకు పరిమితం చేయడమో, చేతికి స్మార్ట్‌ఫోన్ ఇచ్చేయడమో చేస్తుంటే- దాని తాలూకు దుష్ప్రభావాలు అనంతం. అందుకే ఎంచక్కా వారికి కథలు చదివి వినిపిస్తూ ఉత్తమంగా తీర్చిదిద్దడానికి పునాదులు వేయాలి. ఇది వారి మానసిక, శారీరక సంక్షేమానికి అత్యంత అవసరం.

కె.మనస్విని

"గుడీవినింగ్ ఫ్రెండ్స్..." అన్నాడు రిటైర్డ్ జనరల్ ధర్మేంద్ర గుప్పున పొగవదులుతూ. "ఇంత తక్కువ సమయంలో పిలవగానే మీరందరూ ఇలా నా దగ్గరకు వచ్చినందుకు థ్యాంక్స్. ఒక ముఖ్యమయిన పనిగురించి మీతోచర్చించటానికే మిమ్మల్ని ఇలా పిలిపించాను" అన్నాడు.

"మీరు పిలిచారంటే ఏదో ముఖ్యమయిన పని ఉండే ఉంటుందని మాకు తెలుసు..." అన్నాడు సి.బి.ఐ. డైరెక్టర్.

"అవును. ముఖ్యమయిన పనే. మీకందరికీ తెలుసు... నేను నేషనల్ సెక్యూరిటీ విషయంలో మన ప్రధానమంత్రిగారికి అడ్వైజర్‌గా ఉన్నాను. అయితే ఇప్పుడు నా ముందు ఉన్న సమస్య నేషనల్ సెక్యూరిటీ కాదు, ప్రధానమంత్రి సెక్యూరిటీ"

"అంటే ప్రధాన మంత్రికి ఏదైనా హాని జరగవచ్చని మీరు భావిస్తున్నారా?" అడిగాడు ఇంటెలిజెన్స్ బ్యూరో చీఫ్.

"అవును. భావించటం కాదు. రుజువులతో సహా ఆధారాలు లభించాయి. అందుకే మిమ్మల్ని ఇక్కడికి పిలిపించాను" అన్నాడు ధర్మేంద్ర.

"ఆధారాలు ఉన్నాయా? వెంటనే చెప్పండి. లెటజ్

సహకారాలున్నాయో నాకు తెలియదు. కానీ నాకు తెలిసి దీని మూలాలు ఇక్కడే ఉన్నాయి. అదికూడా ఇదంతా చేస్తోంది ఒక వ్యక్తి.

అంతా అనుకున్నట్లు జరిగితే అతను ఎంతవరకు సక్సెస్ సాధించేవాడో నాకు తెలియదు. కానీ అతని దురదృష్టం కొద్దీ ఈ కుట్ర గురించి కొంతమందికి ముందే తెలిసింది"

"ఇన్ని విషయాలు తెలిసిన మీరు ఈ విషయం ఇప్పటివరకు మాకు ఎందుకు చెప్పలేదు?" అడిగాడు మిలటరీ ఇంటెలిజెన్స్ చీఫ్.

"నాకు తెలిసిన విషయం ఎంతవరకు నిజమో తెలుసుకోకుండా మీకు ఎలా చెప్తాను? ఆ విషయం తెలిసినవారిని సంప్రదించే ప్రయత్నంలో కొన్ని షాకింగ్ విషయాలు తెలిశాయి. అవి చెప్దామనే మిమ్మల్ని పిలిపించాను" అన్నాడు ధర్మేంద్ర.



# వేట

## పుట్టగంటి గోపీకృష్ణ



ఎలిమినేట్ ది థ్రెట్..." అన్నాడు RAW డైరెక్టర్.

అతని మాట పూర్తవకముందే గదిలో లైట్లు డిమ్ అయ్యాయి. ఒక మూల ఉన్న తెరమీద ప్రొజెక్టర్‌లో నుండి వెలుతురు పడింది. అందరూ అదేమిటో చూడటానికి అటు వైపు తిరిగారు.

"మన ప్రధానమంత్రి అవలంబిస్తున్న విధానాల మీద కొంతమంది కోపంగా ఉన్నారని అందరికీ తెలుసు. అయితే అది ఆయనమీద హత్యకి ప్లాన్‌చేసే వరకు వెళ్తుందని ఎవరూ అనుకోలేదు..." అంటూ ఉపోద్ఘాతం చెప్పాడు రిటైర్డ్ జనరల్ ధర్మేంద్ర.

అతను ఎంతగా దీర్ఘాలోచనలో నిమగ్నమయ్యాడంటే కాసేపటి నుండి సైపు పీల్చటం కూడా మరచిపోయాడు. చీమ చిటుక్కుమంటే వినిపించే నిశ్శబ్దం ఆ గదిలో ఏర్పడింది.

కొన్ని క్షణాల తరువాత తేరుకున్న ఇంటెలిజెన్స్ చీఫ్, "ఏమిటి మీరు మాట్లాడుతోంది?" అన్నాడు నమ్మలేనట్లు. "ఇంతమంది ఇంటెలిజెన్స్ వర్గాలకు తెలియకుండా ప్రధానమంత్రి హత్యకు జరిగిన కుట్ర మీకు ఎలా తెలిసింది?"

"ఎలా తెలిసింది అన్నది పక్కన పెడితే, ఏం జరిగిందో మీకు చూపిస్తాను" అన్నాడు ధర్మేంద్ర.

"ఈ కుట్రకివిదేశాల నుండి ఎంతవరకు సహాయ

"అయితే త్వరగా చెప్పండి..." ఆలస్యం తట్టుకోలేనట్లు అన్నాడు RAW డైరెక్టర్.

"మేము ముందుగా ఈ విషయం తెలిసిన వినోద్ నాయక్‌ని కలుసుకోబోయాము. ఈఫోటో చూడండి. మనాలీవ్యాలీలో జరిగిన కారు యాక్సిడెంట్ దృశ్యం. సరిగ్గా మేము అతన్ని చేరుకునేటప్పటికి అతను ఈ కారు యాక్సిడెంట్లో చనిపోయాడు.

### జరిగిన కథ 14

అవినాష్ సుమిత్‌బోస్‌ను మట్టుపెడతాడు. లిమ్బెన్‌ని కూడా చంపాలనుకుంటాడు గానీ ఎవరో తలమీద దొంగదెబ్బ కొడతారు.

స్పృహ తప్పిపోతాడు అనుకున్న ప్రత్యర్థులు అవినాష్ వారిఎదుటే ఉండేసరికి ఆశ్చర్యపోతారు. అవినాష్ తనను శత్రువులు చుట్టుముట్టారు అన్న సంగతి బయటివారికి తెలియజేయటానికి తన దగ్గర వున్న వైర్‌లెస్ సెట్‌ని ఓపెన్ చేస్తాడు.

లక్ష్మికి వైర్‌లెస్‌లో అవినాష్‌తో ఆటవికుల నాయకుడు సుజో అంటున్నమాటలు వినబడుతుంటాయి. అవినాష్ సుజోతో మాట్లాడే మాటల్లో తనకు సందేశం ఉందని గ్రహించి అక్కడ వదిలివెళ్ళిన అవినాష్ బ్యాగ్‌లోని మెటల్‌బాల్స్ బాంబుల్ని వారిమధ్యకు విసురుతుంది లక్ష్మి.

ఈ గందరగోళంలో తప్పించుకున్న అవినాష్ లిమ్బెన్‌ని అక్కడున్న కత్తితో చంపేస్తాడు. తనకు అప్పగించిన ఆపరేషన్ పూర్తయిన తర్వాత ఎన్ఎస్ఎ అడ్వయిజర్ అయిన ధర్మేంద్రకి ఫోన్ చేస్తాడు.

ఫోన్‌రింగవుతున్నా ధర్మేంద్ర లిఫ్ట్ చేయడు. ధర్మేంద్ర మీటింగ్‌లో ఉన్నాడని అతని అసిస్టెంట్ అవినాష్‌కి చెబుతాడు. అత్యవసర మీటింగ్ ధర్మేంద్ర ఏర్పాటు చేస్తాడు. ఆ తర్వాత జరగబోయేది చదవండి.



తరువాత ఈ దృశ్యం చూడండి. హైదరాబాద్ బిల్డర్ వెంకటేష్ కాంక్రీట్ బ్యాచ్ మిక్సర్లో పడి చనిపోయాడు. మధుర హోటల్లో జరిగిన లిఫ్ట్ యాక్సిడెంట్లో చనిపోయిన లోకల్ ఎమ్మెల్యే పూరన్‌సింగ్ శవం ఇది. వీళ్ళు కూడా మన ఇన్ఫార్మర్లే.

అలానే కేరళలో నారాయణ కుట్టి కోల్డ్ స్టోరేజ్‌లో లాక్ అయి చనిపోయిన దృశ్యం ఇది.

తరువాత కలకత్తాకి చెందిన సుమిత్ బోస్, నాగాలాండ్‌కి చెందిన లిమ్బెన్ కూడా చనిపోయారని ఇప్పుడే తెలిసింది. ఇలా మనకి ఇన్ఫర్మేషన్ ఇవ్వగల ఇన్ఫార్మర్లందరూ చనిపోయారు"

"ఇన్ని మరణాలు కాకతాళీయం అవటానికి ఆస్కారం లేదే?" అన్నాడు ఐ.బి.చీఫ్.

"అవును. అందుకే ఈ మరణాల వెనుక బ్యాగ్రౌండ్ చెక్ చేయించాను..." అంటూ మరికొన్ని వీడియోలు చూపించసాగాడు.

"మనాలీలో వినోద్ నాయక్ చనిపోయిన రోజు అదే హోటల్లో ఉన్న ఒక వ్యక్తి ఫోటో ఇది.

ఇతనే వినోద్ నాయక్‌ని చంపాడనటానికిపూర్తి సాక్ష్యాలు మన దగ్గర ఉన్నాయి.

అలానే మిగిలిన అయిదుగురు చనిపోయేటపుడు ఇతను ఆ పరిసరాల్లోనే ఉన్నాడు"

"ఎవరతను?"

"ఆ విషయం నాకంటే RAW డైరెక్టర్ బాగా చెప్పగలుగుతారు"అన్నాడుధర్మేంద్ర.

RAW డైరెక్టర్ మొహం తెల్లగా పాలిపోయింది. టేబుల్ మీద ఉన్న గ్లాసులోని నీరు గటగటా తాగి, "ఇతను మా సీనియర్ ఎనలిస్ట్ అవినాష్" అన్నాడు.

"ఒక RAW ఏజెంట్ ఇలా దేశంలో ఇష్టం వచ్చినట్లు హత్యలు చేయటం ఏమిటి? అది మీ దృష్టికి ఇప్పటివరకు రాకపోవటం ఏమిటి?" అన్నాడు నావల్ ఇంటెలిజెన్స్ చీఫ్.

"అతను కొన్ని రోజులుగా డ్యూటీకి రావటంలేదు. కానీ అతను ఇలాంటి పనులు చేస్తాడని మేముమాత్రం ఎలా ఊహిస్తాం?" అన్నాడు RAW డైరెక్టర్.

"పైగా అతను మొదటి నుండి RAW ఎంప్లాయ్ కూడా కాదు. కమాండో యూనిట్ నుండి మాకు ట్రాన్స్‌ఫరై వచ్చాడు"

"అవునా...?" ఈసారి తను ఆశ్చర్యపోతూ అన్నాడు మిలటరీ ఇంటెలిజెన్స్ చీఫ్.

"ఒక్క నిమిషం..." అందరి దృష్టినీ తనవైపు ఆకర్షిస్తూ అన్నాడు ధర్మేంద్ర.

"అసలతను ఆర్మీ నుండి RAW కి ఎందుకు ట్రాన్స్‌ఫరయ్యాడో కూడా ఎంక్వయిరీ చేయించాను. అప్పుడు కూడా అతను తనకిచ్చిన ఆర్డర్లకు విరుద్ధంగా ఒక ఎమ్మెల్యేని చంపాడు.

అప్పుడే అతనికి ఏ యావజ్జీవిత ఖైదో వేస్తే ఇప్పుడు ఈ మరణాలు తప్పేవి.

అలా కాకుండా అతని నిజాయితీ మీద నమ్మకంతో అతన్ని సిస్టమ్‌లోనే ఉంచుకోవటంతో ఈ బాధలు వచ్చాయి. ఇందులో ఎవరి తప్పిదమూలేదు.





ఇది మన ఉమ్మడి వైఫల్యం. అదృష్టం. ఏమిటంటే సమయం మించిపోకముందే ఇది బయటపడటం. అందుకే నేను ముందే చెప్పాను. ఇది ఎలా జరిగిందో పక్కనపెట్టండి. దీన్ని ఎలా ఆపాలో ఆలోచించండి"

"ఇప్పుడతను ఎక్కడ ఉన్నాడు?"

"నాకు తెలిసిన సమాచారాన్నిబట్టి అతను ఇప్పుడు దీమాపూర్‌లో ఉన్నాడు" ఆరిపోయిన పైపు వెలిగించుకుంటూ అన్నాడు ధర్మేంద్ర.

"వెంటనే అతన్ని అరెస్ట్ చేసి తీసుకువద్దాం"

"ఏదైనా ఒక నిర్ణయం తీసుకునే ముందు అన్ని వైపుల నుండి ఆలోచించాలి. అతని మీద నేరం మోపాలంటే మీ అందరి వైఫల్యం ఒప్పుకోవాలి. దానికి మీరు రెడీనేనా?" అన్నాడు ధర్మేంద్ర.

అందరూ ఒకరిమొహాలు ఒకరు చూసుకున్నారు. ఆఖరికి అందరూ కలిసి, "అనుభవజ్ఞులు, ఏం చెయ్యాలో మీరేచెప్పండి..."అని ఆ బాధ్యత రిటైర్డ్ జనరల్ ధర్మేంద్ర మీదే పెట్టారు.

"ఆ అవినాష్‌కి ప్రధాన మంత్రితో శత్రుత్వం ఏంటో నాకు తెలియదు. అతను ఒక పిచ్చి వాడిలా కనిపిస్తున్నాడు.

అతన్నిఆపటం కష్టం. అతన్ని ప్రాణాలతో పట్టుకుంటే మీ వైఫల్యాలు బయటపడతాయి.కాబట్టి మీరందరూ కలిసి అతన్ని లేకుండా చేస్తే, ప్రధాన మంత్రి క్షేమంగా ఉంటారు. మీ వైఫల్యాలూ బయటపడకుండా ఉంటాయి.

## కన్నీరు ఆగలేదు

'మహానటి' సినిమా కీర్తిసురేష్‌కు ఎంతటి గుర్తింపు, పేరుతెచ్చి పెట్టాయో ప్రత్యేకంగాచెప్పుకో నవసరంలేదు. ఈ సినిమా షూటింగ్ చివరిరోజును కీర్తి మరోమారు గుర్తుతెచ్చుకున్నది.

"చెయ్యగలనా?లేదా?అన్న సందేహాలతో మొదలు పెట్టిన నేను ఈ పాత్రకోసం శారీరకంగా, మానసికంగా ఎంతో కష్టపడ్డాను.

సినిమా అయిపోయాక ఇక రేపటినుంచి షూటింగ్‌కు రావాల్సిన పనిలేదు అని తెలియగానే గొంతు, మనస్సు మూగబోయాయి. కష్టం కొలిక్కి వచ్చిందనే ఆనందం, సావిత్రిని విడిచి వెళ్ళాలన్న ఉద్వేగం నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. కన్నీరు ఆగలేదు" అని చెప్పింది కీర్తి సురేష్.

ఏం చేస్తారు...?" ఎదురు ప్రశ్నించాడు ధర్మేంద్ర.

ఆఖరికి అందరూ కలిసి అవినాష్ అనేవాడిని ఎలిమినేట్ చేయాలని నిర్ణయించారు.

"సో... అతను మనకు ప్రాణాలతో అవసరం లేదు. అతని ప్రాణాలు మనకి కావాలి. అవునా?" అన్నాడు రిటైర్ట్ జనరల్ ధర్మేంద్ర.

"అవును"

"నిర్ణయం బాధాకరమయినా తప్పదు. అతని ఫోటో మీకు పంపుతున్నాను. ఆఖరి వార్తలు అందే టప్పటికి అతను దీమాపూర్‌లో ఉన్నాడని తెలిసింది. పని పూర్తిచేయటానికి మీకు ఎంతసమయంకావాలి?" అడిగాడు ధర్మేంద్ర అందరినీ ఉద్దేశించి.

"మాగ్జిమమ్ ఒక గంట" చెప్పారు అందరూ కలిసి. గుండెలనిండా పొగ పీల్చి వదులుతూ, "డూ ఇట్ ఫాస్ట్. పని పూర్తయ్యాక ప్రధానమంత్రికి చెప్తాను. అప్పటివరకు ఆయన్ని డిస్టర్బ్ చేయటంలో అర్థం లేదు..." అంటూ లేచాడు ధర్మేంద్ర.

RAW డైరెక్టర్ పరుగెత్తుతున్నట్లు తన ఆఫీసుకు తిరిగి వచ్చాడు. మిగిలినవారందరికంటే తన డిపార్ట్‌మెంట్‌కు చెందిన ఒక వ్యక్తి ఇలా దేశద్రోహిగా మారాడన్న వార్త అతనికి అవమానంగా ఉంది.

ఇంతలో అతని సెక్రటరీ గదిలోకి వచ్చాడు.

"మన ఏజెంట్లందరినీ అర్జెంటు మీటింగు ఉందని పిలువు" చెప్పాడు డైరెక్టర్.

"ఎన్ని గంటలకు సార్?" "నో!... ఇప్పుడే!!... దిస్ ఈజ్ యాన్ ఎమర్జెన్సీ"పెద్దగా అరిచాడు డైరెక్టర్.

ఆయన్ని ఆ రూపంలో ఎప్పుడూ చూడని సెక్రటరీ తను చెప్పదలచుకున్న విషయం చెప్పవచ్చో లేదో అర్థంకాక నిలబడిపోయాడు.

"ఏమిటి?" అతని సందేహం ఏమిటో అర్థంకాక మరోసారి అరిచాడు డైరెక్టర్.

"అవినాష్ ఫోన్‌చేశాడు సార్. మీరు రాగానే ఫోన్ చేసిన విషయం చెప్పమన్నాడు"

ఒక్కక్షణంసెక్రటరీ చెప్తోంది ఏమిటో అర్థంకాలేదు డైరెక్టర్‌కి. "ఎప్పుడు?" అని అడిగాడు, ఆ విషయం నమ్మలేనట్లు.

"మీరు మీటింగ్‌కి వెళ్ళగానే..."

"ఇన్నాళ్ళూ ఏమయ్యాడంట?"

"రిటైర్డ్ జనరల్ ధర్మేంద్రగారుఏదోస్పెషల్ ఎసైన్‌మెంట్ మీద పంపారంట సార్. ఆయనే ఆ విషయం మీకు చెప్తానన్నారంట. అందుకని అప్పుడు అతను చెప్పలేదంట..." అన్నాడు అతని సెక్రటరీ.

"ముందు నువ్వు నేను చెప్పినట్లు ఏజెంట్లను సమావేశపరుచు..." అని వారు వచ్చేలోపు ఆలోచనలో మునిగిపోయాడు డైరెక్టర్.

అవినాష్ తనకు ఫోన్ చెయ్యటంలో అతని ప్లాన్ ఏమయిఉంటుందా అని ఆలోచించసాగాడు.

ఇంతలో అతని ఏజెంట్లందరూ గదిలోకి వచ్చారు. క్లుప్తంగా వారికి జరిగింది చెప్పాడు. "మీ అందరికీ ఒకటే ఆర్డర్. ఎలిమినేట్ అవినాష్. అదికూడా వీలయినంత త్వరగా..."

"ఆర్యూ ష్యూర్ సర్?" అడిగాడు కుమార్.

"ఏం? నీకేమైనా అనుమానమా?"

"యస్సర్. అవినాష్ ఒక్కొక్కసారి తనకు తోచిన దారిలో నడిచే రకమే తప్ప, దేశానికి ద్రోహం చేసే రకం కాదు సార్"

"అలాంటపుడుహఠాత్తుగాడిపార్ట్‌మెంట్లో మాయమయి ఆరుగురిని ఎందుకు హత్య చేశాడు?"

"ఆ విషయం ఖచ్చితంగా నిజమేనా సార్?"

"అన్ని ఆధారాలూ ఉన్నాయి" అయితే తను ఏమీ చెప్పలేనట్లు పెదవివిరిచాడు కుమార్.

"అంతే కాదు, కాసేపటి క్రితం అతను నా సెక్రటరీకి ఫోన్ చేశాడు. నేను లేనని చెప్తే వచ్చాక ఫోన్ చేయమన్నాడట"

"అతను మిమ్మల్ని మాటల్లో పెట్టి మన ఇన్ఫర్మేషన్ లాగటానికి వేసిన ఎత్తుగడ అది. మీరు కాల్ చేయవద్దు" సలహా ఇచ్చాడు ఒక ఏజెంట్.

"అతను సామాన్యుడుకాదు. కమాండో యూనిట్ అతనికి శారీరక శిక్షణ ఇచ్చింది. మన డిపార్ట్‌మెంట్ సాంకేతిక శిక్షణ ఇచ్చింది.

అన్ని నిపుణతలూ పొంది ఇప్పుడు మనకే శత్రువయ్యాడు. కాబట్టి అతన్ని పట్టుకోవటం అంత తేలికని అనుకోను. వెంటనే బయలుదేరండి..." చెప్పాడు డైరెక్టర్.

"అతను ఎంత ప్రతిభావంతుడైనా, మనతోపోరాడటం అంత తేలికకాదు. అతను ఎంతోసేపు నిలవలేడు... మేము ఇప్పుడే రంగంలోకి దిగుతు



నేను రాష్ట్రముఖ్యమంత్రినే... కాని కాంగ్రెస్‌ని సంప్రదించకుండా ఏ నిర్ణయం తీసుకోలేను.

-కుమారస్వామి, కర్ణాటక సి.ఎమ్.



సంగీతమే నా ప్రాణం... ప్రతిక్షణం ఏదో ఒక రాగం నా నోటివెంట పలుకుతూనే వుంటుంది. -ఆశాభోస్లే, గాయని

న్నాము" పరుగెత్తుతున్నట్లు బయటకు నడిచారు వారు.

అలాంటి సన్నివేశమే అన్ని ఇంటెలిజెన్స్ డిపార్ట్‌మెంట్లలో జరుగుతోంది. మరికొంతసేపట్లో వారందరూ, అవినాష్‌ని మట్టుపెట్టటమే ఏకైక ధ్యేయంతో బయటకు నడిచారు.

RAW డైరెక్టర్ నుండి ఫోన్ వస్తుందేమో అని చాలాసేపు ఎదురు చూశాడు అవినాష్.

ఈలోపు అనేకసార్లు ధర్మేంద్రకి ఫోన్ చేశాడు. ఎవరూ ఫోన్ ఎత్తలేదు.

అక్కడ ఏం జరుగుతోందో అవినాష్‌కి అర్థం కాలేదు. తనను ఈ పనిమీద పంపిన ధర్మేంద్ర ఇప్పుడు ఎందుకు మొహం చాటేస్తున్నాడు?

తను ఫోన్ చేసినా RAW డైరెక్టర్ ఎందుకు రెస్పాన్స్ ఇవ్వటంలేదు? పైగా ధర్మేంద్ర, RAW డైరెక్టర్ కలుసుకున్నారని కూడా తెలిసింది. ఆ తరువాత కూడా ఎవరూ తనను కాంటాక్ట్ చేయటం లేదంటే ఏమిటి అర్థం?

తను ధర్మేంద్ర అడగటమే ఆలస్యం అతను చెప్పిన పనికి ఒప్పుకుని తప్పు చేశాడా? పనంతా అయ్యాక తనను కూరలో కరివేపాకులా పక్కన పెట్టెయ్యబోతున్నారా? లేదూ... ఇంకా ఏదో లోతైన కుట్ర దీంట్లో దాగివుందా?

ఆ ఆలోచనకి అతని మనసు ఒప్పుకోలేదు. ధర్మేంద్ర చెప్పాడనే కాదు, తనంతట తనకు ఆ ఆరుగురు చేసిన పని గురించి తెలిసినా వారికి ఇదే శిక్ష విధించి ఉండేవాడు.

అయినా ఇప్పుడు తను ఆలోచించవలసింది జరగబోయే దాని గురించి.

జరిగిపోయిన దాని గురించి కాదు. తనకు ఢిల్లీలో మిగిలిన ఒకే ఒక్క ఆధారం కుమార్. ఆ ఆలోచన రాగానే అతనికి ఫోన్ చేశాడు అవినాష్.

"ఎక్కడ ఉన్నావ్?" ఫోన్ ఎత్తుతూనే అడిగాడు కుమార్.

"దీమాపూర్‌లో"

"అయితే నేను విన్నది నిజమే అన్న మాట"

"ఏం విన్నావ్?"

"నువ్వు ఆరుగురు మనుషుల్ని చంపిన విషయం" అన్నాడు కుమార్.

"ఆ విషయం అప్పుడే నీ దాకా వచ్చిందా..."

"అంటే, ఆ మాట నిజమేనా?"

"అన్ని విషయాలూ నీకు నేను పర్సనల్‌గా కలిసినపుడు చెప్తాను. ఇప్పుడు నువ్వు చేయాల్సింది ఒకటి ఉంది..." అన్నాడు.

"సారీబాస్. నీ గురించి అందరూ చెప్తున్న మాటలు ఎంత నిజమో నాకు తెలియదు. కానీ... నేను నీకు చేయగలిగిన సాయం అంటూ ఏమీ లేదు. ఇక మనం పర్సనల్‌గా కలుసుకోవటమంటావా అది జరగదు. నీమీద ఎలిమినేషన్ నోటీస్ జారీ అయింది.

నువ్వు ఢిల్లీకి కాదు కదా, దీమాపూర్ ఊరి బయటకు కూడా చేరుకోలేవు. ఇక ఎప్పుడూ నన్ను కాంటాక్ట్ చేయటానికి ప్రయత్నించకు. గుడ్ బై..." అంటూ ఫోన్ పెట్టేశాడు కుమార్.

కుమార్ మాటలకు స్థాణువులా ఉండిపోయాడు అవినాష్. ఇంతలో తన గది నుండి బయటకువచ్చింది లక్ష్మి. చేతిలో ఫోన్ పట్టుకుని రాయిలా నిలబడి ఉన్న అవినాష్‌ని చూసి "ఎవరితో మాట్లాడుతున్నావ్?" అని అడిగింది.

"లక్ష్మీ... నువ్వు వీలయినంత త్వరగా ఇక్కడ నుండి వెళ్ళిపో..." అన్నాడు అవినాష్ ఆమె మాటలకు లోకంలోకి వస్తూ.

"ఏమయింది?" అతనిలో మార్పును పసిగట్టిన ఆమె ఆదుర్దాగా అంది.

"నామీద ఎలిమినేషన్ నోటీస్ జారీ అయింది"

"అంటే?"

"అంటే నన్ను చూస్తూనే కాల్చి వేయమని ప్రభుత్వం ఆర్డర్ ఇచ్చిందన్నమాట"

ఈసారి అతని మాటలకు లక్ష్మి షాక్ తిన్నట్లయింది. "అదేమిటి? నువ్వు పనిచేస్తోంది ప్రభుత్వం తరుపున కదా..."

"అనే అనుకున్నాను. అసలు ఏం జరిగిందో తెలియాలంటే ఢిల్లీ వెళ్ళాలి" అని జరిగిన సంగతులు వివరించాడు.

"అయితే ఆ పని చెయ్యి. ఇలా ఇక్కడ కూర్చుని సమయం వృథా చెయ్యటం ఎందుకు?"

"అవును. నేను ఇప్పుడే బయలుదేరతాను. నువ్వు నీ దారిన వెళ్ళిపో. నాతో ఉండటం నీకు కూడా ప్రమాదకరం" అన్నాడు అవినాష్.

"నిన్ను పట్టుకోవటానికి నేను వచ్చిన మాట నిజమే! కానీ ఇప్పుడు నువ్వు లేకుండా నేను ఉండలేను. నువ్వు ప్రమాదంలో ఉంటే నిన్ను వదిలి నేను ఎలా వెళ్తాను. కష్టమయినా, నష్టమయినా ఇద్దరం కలిసే అనుభవిద్దాం..." అన్నాడు.

"వద్దు. నేను చెప్పే మాట విను..." అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న అతని పెదవులను తన పెదవులతో అడ్డుకుంది లక్ష్మి.

జీవితంలో మొదటి ముద్దు అలా అనుకోని సమయంలో, అనుకోని పరిస్థితుల్లో దొరుకుతుందని అనుకోని అతను, ఆమె దూరం జరిగాక కూడా షాక్ తిన్నట్లు ఉండిపోయాడు.

అప్పుడే స్నానం చేసి వచ్చిన ఆమె నుండి వస్తున్న పరిమళంతో పాటు ఆమె పెదవుల తీపితనం అతని మూడ్ మార్చేసింది.

"ఇంకోసారి నన్ను వెళ్ళిపొమ్మంటే మళ్ళీ ఇదే శిక్ష పడుతుంది..." అంది లక్ష్మి.

ఈసారి అవినాష్ ఆమెను దగ్గరకు లాక్కుని, "ఎవరికీ ఋణపడటం నాకు ఇష్టం ఉండదు..." అంటూ ఆమె చేసిన పనినే రిపీట్ చేశాడు.

"ఈ ముద్దే మన ఆఖరిముద్దు కాకుండా ఉండాలంటే మనం ఢిల్లీవెళ్ళాలి.అసలేంజరిగిందో తెలుసు

## భలే అవకాశం

నెమ్మది నెమ్మదిగా ఇషారెబ్బా తనకంటూ ఓ స్థానాన్ని ఏర్పరచుకునే ప్రయత్నాల్లో ముందుకు సాగుతున్నట్లే వుంది. జూనియర్ ఎన్టీఆర్ సినిమాలో ఓ హీరోయిన్‌గా అవకాశాన్ని అందిపుచ్చుకున్నది. "ఇదో రెబల్లియన్ రోల్. నన్నీ పాత్రకు ఎంచుకున్న త్రివిక్రమ్‌గారికి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. విభిన్నకోణంలో నన్ను చూస్తారు. జూనియర్ ఎన్టీఆర్‌తో నటించడం ఎగ్జయిటింగ్‌గా వుంది. సెట్స్‌లో సరదాగా వుంటారు. ఎనర్జీ లెవెల్స్ చాలా ఎక్కువ. మేం భలే జోకులు వేసుకుంటుంటాం" అని చెప్పింది ఇషారెబ్బా.



# సాహస కథల పోటీ

## ఒక్కో కథకి ₹ 10 వేలు బహుమతి

## అలా పది కథలకు లక్ష రూపాయల బహుమతులు



కత్తి పట్టి కదనరంగంలోకి దూకడమే కాదు, ఎక్కుపెట్టిన విల్లంబులతో మట్టుపెట్టడమే కాదు, శత్రులక్ష్యంవైపు టార్గెట్‌ను ఎయిమ్ చేయడమే కాదు... సాహసమంటే! అటువంటి సాహసంతోపాటు ఇంటా, బయటా, సమాజంలో, చేసే వృత్తిలో తీసుకునే నిర్ణయాలు సాహసంతో కూడినవై ఎందరికో మేలు జరిగితే అవిగో అవీ అసలుసిసలైన సాహస కథలు. మీరు రాసే కథ ఎందరికో ఇన్‌స్పైర్ కావచ్చు.వారి జీవితాలను ప్రభావితంచేయొచ్చు. 'ధైర్యే సాహసే లక్ష్మి'అనుకుని మాంచి ఓ సాహసకథ రాసి పంపండి. విజేతలు మీరే!

## సాధారణ ప్రచురణకు తీసుకున్న ప్రతి కథకు ₹ 2,000

: నిబంధనలు :

మీ సాహస కథ, స్వాతి సపరివార పత్రికలో బొమ్మతో సహా, ప్రచురణలో రెండు పేజీలు మాత్రమే రావాలి. అనగా మీ వ్రాతప్రతి **ఆరు అరఠావులకు** మించకుండా ఉండాలి. కాగితానికి ఒకవైపున మాత్రమే రాయాలి. ప్రతి అర ఠావుకు సుమారుగా ఇరవై ఐదు లైన్లు ఉండాలి.

1. సాహస కథల ఎంపికలో స్వాతి సంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ఈ పోటీ గడువుతేదీని పొడిగించేందుకు గానీ, పోటీని రద్దుచేసేందుకుగానీ, స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి. 2. అనువాదాలూ, అనుకరణలు, ఇతర పత్రికలకి పంపబడి పరిశీలనలో ఉన్న రచనలను పంపవద్దు. 3. సాహస కథలు తమ స్వంతమే అని, అముద్రితమని, తమ స్వదస్తూరితో రాసిన హామీపత్రాన్ని విధిగా జత పరచాలి. 4. బహుమతియోగ్యం కానివాటిని సాధారణ ప్రచురణకు తీసుకునే హక్కు మాకు ఉంది. 5. ప్రచురణార్హం కాని కథలను తిప్పి పంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జతపరచాలి. 'సాహస కథల పోటీ'కి అని కవరుమీద స్పష్టంగా రాయాలి.

కథలను పంపవలసిన చిరునామా : ఎడిటర్, స్వాతి సపరివార పత్రిక, అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట, పోస్ట్ బాక్స్ 339, విజయవాడ 520 002

## సాహస కథలు మాకు చేరవలసిన ఆఖరు తేది : 30.6.2018

కోవాలి. కాబట్టి, లే...! డోంట్ స్టాప్. లెటజ్ రన్ టుగెదర్..." అంది లక్ష్మి కొత్తగా వచ్చిన ఉత్సాహంతో లేచి నిలబడ్డాడు అవినాష్.

దీ మాపూర్ ఎయిర్‌పోర్ట్ డిపార్చర్ లాంజ్ ముందు ఆగిన ట్యాక్సీ నుండి అవినాష్, లక్ష్మి దిగారు. హోటల్ వెకేట్ చేయటం, లగేజ్ తీసుకోవటంలాంటి పనులేమీ చెయ్యలేదు కాబట్టి వారి దగ్గర సామానేమీ లేదు.

"నీతో బయట తిరగటం భలే బాగుంటుంది. ప్రతి రెండు రోజులకూ కొత్త సామాను కొనుక్కోవచ్చు" అంది లక్ష్మి.

"హోటల్ వెకేట్ చేయటం వలన టైమ్ వేస్ట్ అవటమే కాదు, మనం ఎక్కడికో వెళ్ళిపోతున్నామని మనల్ని వెతుకుతున్న వారికి తెలిసిపోతుంది.

ఇప్పుడు మనకోసం హోటల్ దగ్గర ఎవరైనా కాపు కాశారనుకో, హోటల్ వాళ్ళు మనం వెకేట్ చేయలేదు అని చెప్తారు.

దాంతో మనకోసం వాళ్ళు అక్కడే ఉంటారు. సో... మన శత్రువుల్లో ఒకరిద్దరన్నా తగ్గుతారన్నమాట" ఎయిర్‌పోర్ట్ గేటు దగ్గర ఉన్న సెక్యూరిటీగార్డు దగ్గరకునడుస్తూఅన్నాడు అవినాష్.

ముందు తన ఐడీకార్డ్, టికెట్ చూపించి లోపలకు నడిచింది లక్ష్మి.

వెనుక నడుస్తున్న అవినాష్ తన ఐడీ, టికెట్ చూపించాడు. ఐడీ మీద ఫోటో చూసి, తలెత్తి అవినాష్ మొహం మరోసారి చూశాడుగార్డ్. ఒక్కక్షణం అతని కనుబొమలు ముడుచుకుని మళ్ళీ మామూలుగా అయ్యాయి. అతని మొహాన్నే పరీక్షగా చూస్తున్న అవినాష్ ఆ చిన్న మార్పును గమనించాడు.

లక్ష్మి వెనుక లోపలకు నడుస్తూ అవినాష్ "ఒక్కసారి వెనక్కి తిరిగి ఆ గార్డ్ ఏం చేస్తున్నాడో చూడు" అన్నాడు తను వెనక్కి తిరగకుండా.

వెనక్కి తిరిగి చూసిన లక్ష్మి "ఏదో ఫోన్ మాట్లాడుతున్నాడు..." అంది.

"నేను అనుకున్నట్లే అయింది..." అన్నాడు అవినాష్ లక్ష్మితో.

"ఏమయింది...?"

"ఆ గార్డు నన్నుగుర్తుపట్టాడు.అదే తన అధికారులకు ఇన్ఫార్మ్ చేస్తున్నాడు"

"మరి ఏం చేద్దాం? వెనక్కి పోదామా?" అంది లక్ష్మి.

"ఎలా వెళ్తావు. అతనిచూపు మనమీదే ఉండి ఉంటుంది. అది కాదు పద్ధతి. చెప్తాను ఇలా రా.." అంటూ చకచక ఎయిర్‌లైన్స్ కౌంటర్ దగ్గరకు వెళ్ళి బోర్డింగ్ పాస్ తీసుకున్నాడు.

ఆ తరువాత సెక్యూరిటీ చెక్‌కూడా అయిదు నిమిషాల్లో పూర్తిచేసుకుని లోపలకు వెళ్ళిపోయారు.

ఇప్పుడు ఆ గార్డ్ చూపుకి అందనంత దూరం వెళ్ళారు కాబట్టి ఇక అతను వీళ్ళని గమనించటం మానుకున్నాడు.

పైగా ఒకసారి బోర్డింగ్ పాస్ తీసుకున్నవారిని ఎట్టిపరిస్థితుల్లో బయటకు వెళ్ళనివ్వరు.

డిపార్చర్ లాంజ్, ఎరైవల్ లాంజ్ ఒకదానికొకటి సంబంధంలేకుండా విడిగా ఉంటాయి.

వెళ్ళే ప్రయాణికులను, వచ్చే ప్రయాణికులను ఒకరితో ఒకరిని కలవనివ్వరు.

"మనం ఇంకా ఇంకా లోపలకు వెళ్ళి మరింత ఇరుక్కుపోతున్నాం..." అంది లక్ష్మి.

ఆమె మాటలు పట్టించుకోకుండా, "ఇటు రా" అన్నాడు అవినాష్.

ఇద్దరూ టాయిలెట్ దగ్గరకు వెళ్తున్నట్లు నడిచి దానిపక్కన ఉన్న మెయిన్‌టెనెన్స్ రూములోకి వెళ్ళారు. ఆ రూము లోపల ఉన్న మరోతలుపు అరైవల్ లాంజ్‌లోకి తెరచుకుంటోంది.

**ఇంకా ఉంది**



'సంఘ్' ప్రధాన కార్యాలయ దర్శనం, అక్కడి ప్రణబ్‌ముఖర్జీ ప్రసంగం రెండూ చారిత్రాత్మకమే.

*-ఎల్.కె.అద్వానీ, బి.జె.పి. నేత*

# లిసా హెడెన్

పర్సనల్ ఎజెండా

సూపర్ మోడల్, మల్టీ మిలియనీర్ భార్య, ఓ బిడ్డకు తల్లి- లిసా హెడెన్. ప్లాటినం మాదిరి మెరుపులీనే శిరోజాలతో ముంబయి ఫ్యాషన్ ప్రపంచంలో ఆమె ఓ సంచలనంలా కదిలిపోతుంటుంది. ఆమె వ్యక్తిగత విశేషాలు, అభిప్రాయాలు.

▸ **మా ఇల్లు :** లండన్‌లో వున్నా నా భర్త వ్యాపారం కోసం హాంగ్‌కాంగ్, ముంబయి, ఫుకెట్, ఆస్ట్రేలియా, యూరప్‌లో అనేక ప్రదేశాలు తిరుగుతుంటాం

▸ **నా పనికోసం :** ముంబయికి నెలకు ఒకసారి తప్పనిసరిగా విజిట్ చేస్తుంటా

▸ **అమ్మఅయ్యాక:** అందంగురించి నా అభిప్రాయం మారిపోయింది. గ్లామర్ పరిశ్రమలో ఉన్నప్పుడు, నిరంతరం అందంగా కనపడాల్సి వుంటుంది. ఈ విషయంలో ప్రెజర్ తప్పదు. ఐతే తల్లిని అయిన తర్వాత రూపం గురించిన నా ఆలోచనల్లో పరిణతి వచ్చింది. అనవసర ఒత్తిడుల భారాన్ని వేసుకోను

▸ **నేను అర్థంచేసుకున్నవిషయం:** నిజమైన,ఆరోగ్యవంతమైన జీవితానికి షార్ట్‌కట్స్‌వుండవన్నది.ఆరోగ్యమే ఉత్తమం అని అర్థమైంది

▸ **స్వతంత్రభావాలు:** నాలోఎక్కువగా ఉంటాయి. దీనివల్ల హార్డ్‌వర్క్ చేస్తాను. ఆర్థిక స్వాతంత్ర్యం మహిళల వ్యక్తిగతానికి అవసరం. అది హార్డ్‌వర్క్, బాధ్యతల నుంచి వస్తుందన్నది నా విశ్వాసం

▸ **నేను వచ్చిన కుటుంబం :** పెద్దదీ, ప్రేమపూరితమైనదీను. ఇదే సంప్రదాయాన్ని ముందుకు తీసుకువెళ్ళాలనుకుంటున్నాను

▸ **నా స్టైల్ సలహా :** పర్సనాలిటీకి, శరీరానికి సూటయ్యేవి మాత్రమే ధరించాలి కూడా

▸ **నా లక్ష్యాలు :** నా కలలు నా హృదయానికి సన్నిహితంగా వుంటాయి. అలాగే నేను పనిచేసే ప్రాజెక్టంటే నాకు పేషన్

▸ **నేను నమ్మే సూత్రం:** దేనికోసం అయినా మనం గట్టిగా నిలబడకపోతే ఏదో ఒకదానికోసం పడిపోవాల్సివస్తుంది

▸ **నా దృష్టిలో సామాజిక మాధ్యమం :** అభిమానులతో కమ్యూనికేట్ చేయడానికి గొప్ప మార్గం

▸ **నా ఫేవరెట్ వ్యక్తి :** మా అమ్మమ్మ. మా కుటుంబ సంస్కృతిపైన ఆమె ముద్ర ఎంతగానో ఉంది

▸ **నా రోల్ మోడల్స్ :** మా పేరెంట్స్. నాకు ఉత్తమ సలహాదారులు. రోల్ మోడల్స్

▸ **నేను వెళ్ళే ప్రదేశాలు :** బీచ్‌లు, మ్యూజిక్ కోసం తులుం, స్కైయింగ్‌కోసం జిస్తాద్, స్పాలకోసం ఫుకెట్, యోగాకోసం హాంగ్‌కాంగ్ వెళ్తుంటా. కాని, నా ఆల్‌టైమ్ ఫేవరెట్ ముంబయి

Courtesy : HELLO



## వెసులుబాటు ఇవ్వాలి

పిల్లలకు స్కూళ్ళు మొదలవడంతోనే వారికీ, పెద్దలకూ ఒత్తిళ్ళు ఆరంభమైపోతాయి.ఇలా చదువు, అది చెయ్యి, ఇది చెయ్యవద్దు అంటూ వారిపైన ఒత్తిడి మొదలుపెట్టనేకూడదు. అనుక్షణం చదువు చదువు అంటూ వెంటపడితే వారికి చదువంటే భయం మొదలవుతుంది.

ఆసక్తిగా చదివేవిధంగా ప్రోత్సహిస్తే ఫలితాలు బావుంటాయి. రోజంతా స్కూల్లో గడిపివచ్చాక మళ్ళీ హోమ్ వర్కులూ, ట్యూషన్లు అంటూ వారిని సతమతం చెయ్యనే కూడదు.

చదువుతోపాటు వారికి నచ్చే, ఇష్టపడే కార్యకలాపాల్లో భాగంచేస్తుంటే వారి మానసిక, శారీరక ఆనందాలు బావుంటాయి. స్కూలు నుంచి వచ్చాక కొద్దిసేపు రిలాక్సవ్వనివ్వాలి.

# అనిల్

Nice is different than good

## స్టడీరూమ్

సెలవులయిపోయాయ్. మళ్ళీ స్కూల్స్ షరా మామూలే.

తరగతి మారిన పిల్లలకు చదువుల భారం తప్పదు. వాళ్ళు ఇంట్లో చదువుకోవడానికి సౌకర్యవంతమైన ప్రశాంతమైన ప్రదేశం అవసరం.

స్కూల్లో చెప్పిన పాఠాలు సరిగ్గా, శ్రద్ధగా అభ్యసించేందుకు ఇంట్లో తగిన వాతావరణం వుండాలి.

చదువుకునే గదిలో లైటింగ్ సక్రమంగా వుండాలి.వెలుపలి వెలుతురు కూడా బాగా ప్రసరిస్తుండాలి.

చదువుకునే గదిలో ఎలక్ట్రానిక్ పరికరాలు ఉంచవద్దు. అవి అందుబాటులో వుంటే, వారి ధ్యాస అటు మళ్ళుతుంది. కాబట్టి వాటిని పరిసరాల్లో ఉంచకూడదు.

బాగా వేడిగానో, మరీ చల్లగానో కాకుండా గదిలోని ఉష్ణోగ్రత వారికి అనుకూలంగావుండాలి.ఆహ్లాదంగా, చక్కగా,సౌకర్యంగా కూర్చుని చదువుకోవడానికి వీలుగా వుండాలి.

## అగరబత్తీలు ఎలా తయారుచేస్తారు?

ఒక అగరబత్తి వెలిగిస్తే ఇల్లంతా సువాసనలతో నిండిపోతుంది. వీటికి ఇంత సువాసన ఎలా వస్తుంది? పైగా ఒక్కోరకానికి ఒక్కో రకమయిన పరిమళం ఎలా సాధ్యపడుతుంది?

అగరబత్తీలను కొన్ని ప్రాంతాల్లో మిషన్లతో తయారుచేస్తే, కొన్ని ప్రాంతాల్లో చేతులతోనే తయారుచేస్తుంటారు. ఎలా తయారుచేసినా వాడే వస్తువులు ఇంచుమించు ఒక్కటే.

రంపపుపొట్టు, కర్రను కాల్చి తయారుచేసిన బొగ్గుపొడి, గంధపు చెక్కపొడి,జిగటపొడి కలుపుతారు.

ఇవన్నీ విడివిడిగా మార్కెట్‌లో లభిస్తాయి.గంధపుచెక్కపొడి బదులు సువాసనలు వచ్చేనూనెలు వాడుతుంటారు. వెదురుకర్రల్ని యంత్రాల ద్వారా చీపురుపుల్లల కంటే సన్నగా తయారుచేసి, పొడుల మిశ్రమాన్ని యంత్రంలో వేసి-

పుల్లలకి మిశ్రమం చుట్టుకునే విధంగా ఏర్పాటైన ప్రత్యేకమైన పద్ధతి ద్వారా వాటిని లోపలకు పంపుతారు. ఆరబెట్టి ప్యాకింగ్ చేస్తారు.

వాడే సువాసన ద్రవ్యాలనుబట్టి పరిమళం మారుతుంటుంది.

## ఎక్కిళ్ళు ఎందుకు వస్తాయి?

భోజనం చేస్తున్నప్పుడు కాని, తర్వాత కాని ఏ కారణం లేకుండానే ప్రతి ఒక్కరికీ ఎక్కిళ్ళు వస్తుంటాయి. ఇలా ఎందుకు వస్తాయి?

మనం గాలి తీసుకుంటున్నప్పుడు శరీరంలో గాలితిత్తిలా పనిచేసే ఒక డయాఫ్రమ్ ఉంటుంది.

గుండెను, పొత్తికడుపును వేరుచేసే సన్నని పొరను నియంత్రించే నరాలు స్పందించినప్పుడు ఈ డయాఫ్రమ్ సంకోచిస్తుంది. ఈ విధంగా సంకోచించినప్పుడు, గాలి లోపలకు పీల్చుకునేటప్పుడు కంఠంలోని నాళాలు (వీటినే 'వోకల్ కార్డ్'లు అంటాం) మూసుకుపోయి 'హిక్' అనే శబ్దం వస్తుంది. అందుకే ఎక్కిళ్ళను ఇంగ్లీషులో 'హైకప్స్' అంటారు.

ఎక్కిళ్ళు వచ్చినప్పుడు నీరు తాగితే, శ్వాస తీసుకునే వేగంలో మార్పులు వచ్చి ఎక్కిళ్ళు ఆగిపోతాయి.

అందుకే పెద్దలు ఎక్కిళ్ళు మొదలవగానే నీళ్ళు అందిస్తారు.

## బొమ్మల పజిల్

పదాలలోగల మిగతా అక్షరాలతో పూరించండి.

SWI _ _ ING

_YCLIN_

_ADMINTO_

C_ _KING

FOO_BAL_

_EA_ING

RU_ _ING

Y_G_

## పంచుకోవాలి

చాలా ఇళ్ళల్లో ఒక్కరే సంతానం ఉండడం పరిపాటి అయింది. ఇలా ఒక్కరుగా పెరిగిన పిల్లల్లో షేరింగ్ మెంటాలిటీ లోపిస్తుంటుంది. ఐతే పంచుకునే ధోరణి వుండడం చాలా అవసరమన్నది పరిశోధకుల అభిప్రాయం.

ఇటువంటి దృక్పథం సంతోషాన్ని ఇస్తుంది. అనుబంధాల విలువను తెలియజెప్తుంది.

చిన్నపిల్లలు తమ దగ్గర ఉన్న బొమ్మలు,పుస్తకాలు,చాక్లెట్లు వంటి వాటిని దాచిపెట్టుకోకుండా తోటి వాళ్ళకు ఇస్తుంటే ఆప్యాయతల విలువలు అర్థమవుతాయి.

ఇలా షేర్ చేయడంలో దక్కే ఆనందం గురించి చిన్నతనంనుంచీ వివరిస్తూ,అలవాటు చేయాలి. ఇటువంటి తత్వాన్ని అలవర్చుకోవడం వల్ల, పెరిగేకొద్దీ సామాజికంగా బాధ్యతగా వ్యవహరిస్తారు.

## చందమామ రావే



# లంచం కథ

మహీపాలుడు ఏలే న్యాయపుర దేశంలో ధర్మం నాలుగు పాదాలా నడుస్తుందని చెప్పుకునేవారు. ఇలాంటి సందర్భంలో ఆ దేశంలో ఒక విచిత్రసంఘటన జరిగింది. చంద్రముఖుడు అనే న్యాయాధికారి లంపటుడి వద్ద డబ్బు తీసుకుని, ఒక విచారణలో అతనికి అనుకూలంగా తీర్పు చెప్పాడు.దాన్నిగురించి రమణుడుఅనేవాడురాజుగారివద్దఫిర్యాదుతెచ్చాడు.



ఈ ఫిర్యాదుగురించి విన్న రాజుగారికి అంతులేనిఆశ్చర్యం కలిగింది.

అసలు జరిగినది ఏమంటే, లంపటుడుఅనే ఒకపెద్ద వ్యాపారి తన గిడ్డంగుల కోసం న్యాయపురంలో ఒక విశాలమైన ఖాళీ ప్రదేశాన్ని కొని, అక్కడ భవనాల నిర్మాణం ప్రారంభించాడు. అయితే ఆ ప్రదేశం మధ్యలో కొద్ది మేర రమణుడు అనేవాడిది.

రమణుడు పేదవాడు. అయినా వాడు తన ఆవరణను అమ్మ నిరాకరించాడు. అది అనాదిగా రమణుడి పూర్వీకుల స్థలం. తమ వంశంలోని పిత్రుదేవతలందరూ అక్కడే ఉంటున్నారనివాడి పిచ్చినమ్మకం.

రమణుడు సకుటుంబంగా తీర్థయాత్రకు వెళ్ళిన సమయంలో లంపటుడు రమణుడి స్థలం ఆక్రమించి, గిడ్డంగుల నిర్మాణం మొదలు పెట్టాడు. రమణుడు తిరిగివచ్చి పేచీ పెట్టాడు. లంపటుడు రమణుడికి డబ్బుకోరినంత ఇస్తానన్నాడు.

"నీ డబ్బుకోసం నా పిత్రుదేవతలకు నిలవనీడలేకుండా చేస్తానా?" అన్నాడు రమణుడు.

"నీకు డబ్బు అక్కర్లేకపోతే అది నీ కర్మ! నేనుమాత్రం కట్టడంపని ఆపించను. ఏం చేస్తావో చేసుకో!" అన్నాడు లంపటుడు.దీంతో రమణుడు న్యాయాధికారి వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేశాడు.

న్యాయాధికారి విచారణజరుపుతాననీ, ముందుగా కట్టడం పని ఆపమని లంపటుడితో అన్నాడు. తీర్పు తనకు విరుద్ధంగాజరిగితే చాలా నష్టం వస్తుంది. అతను చంద్రముఖుణ్ణి ఏకాంతంగా కలుసుకుని, తన పరిస్థితి చెప్పుకున్నాడు.

"రమణుడి పత్రాలు సక్రమంగా ఉన్నాయి. అతను తన భూమిని అమ్మదలచలేదు. అలాంటప్పుడు నేనుచెయ్యగలది ఏమున్నది?" అన్నాడు న్యాయాధికారి. తరువాత ఏమి జరిగినదీ ఎవరికీ తెలియదు.

కాని తీరా విచారణ జరిగినప్పుడు రమణుడిపత్రాలలో ఎలాఉన్నదంటే, రమణుడి పూర్వీకులు లంపటుడి పూర్వీకుల నుంచి ఆ భూమిని ఉచితంగా పుచ్చుకున్నారనీ, లంపటుడి వంశంవారు ఏ పరిస్థితులలోనైనా ఆ భూమిని తగిన పరిహారం ఇచ్చి తిరిగి పుచ్చుకోవచ్చుననీ ఉన్నది.

తన పత్రాలలో అలా ఉన్నదని విని రమణుడు ఆశ్చర్యపోయి, ఇతరులచేత చదివించుకుంటే, నిజంగా అలాగేరాసి ఉన్నది.

రమణుడు లంపటుడితో "ఆ భూమి మీదైనప్పుడు, మా పిత్రుదేవతలు అక్కడెందుకుంటారు?" అని అతను ఇచ్చిన డబ్బు తీసుకుని, తృప్తిపడి ఇంటికి వెళ్ళిపోయాడు.

అయితే, తనకు అన్యాయం జరిగిందని రమణుడికి మర్నాడే తెలిసింది. న్యాయాధికారి దగ్గర ఉండే నౌకరు ఒకడు, తన యజమాని లంపటుడి నుంచి బోలెడంత డబ్బు పుచ్చుకోవటం కళ్ళారా చూసి, ఆ సంగతి రమణుడికి చెప్పాడు.

తన పిత్రుదేవతలకు ద్రోహం జరిగిందనుకుని, అతను ఈసారి తిన్నగా రాజుకే ఫిర్యాదు చేశాడు.

రాజు రహస్యంగా దర్యాప్తు జరిపించి, న్యాయాధికారి ఇంట పదివేల వరహాల రొక్కం ఉన్నదని తెలుసుకున్నాడు. రాజు న్యాయాధికారిని పిలిపించి, నిలదీసి అడిగితే,

తాను డబ్బుతీసుకుని అన్యాయంగా తీర్పు చెప్పినట్టు న్యాయాధికారి ఒప్పేసుకున్నాడు.

మహీపాలుడు మండిపడి, ఈ అవినీతి చర్యకు చంద్రముఖుణ్ణి సంజాయిషీ అడిగాడు. చంద్రముఖుడు ఇలా చెప్పాడు.

"మహారాజా, నా కూతురికి మంచి సంబంధం వచ్చింది.

అయితే వరకట్నం కింద పదివేల వరాలు ఇచ్చుకోవలసి ఉన్నది.

నా ఆదాయంతో అంత డబ్బు నా జన్మలో నిలవచెయ్యలేను.

సరిగ్గా ఆ సమయంలో లంపటుడి వ్యవహారంవచ్చింది. తీర్పుతనకు అనుకూలంగా ఉండేమాటైతే పదివేల వరహాలు ఇస్తానన్నాడు. రమణుడిది మూర్ఖపు పట్టు. అందరికీ లాభం కలిగేలాగా నేను తీర్పుచెప్పాను.

రమణుడికి డబ్బు రావడమేగాక, నా కూతురి పెళ్ళి సమస్యా, లంపటుడి వ్యాపార సమస్యా తీరిపోయాయి"

మహీపాలుడు లంపటుణ్ణి పిలిపించి, "మానవులలో కొన్ని బలహీనతలు ఉంటాయి. చంద్రముఖుడు ఎంతో మంచివాడు. అటువంటివాడిలోని బలహీనతలు రెచ్చగొట్టి, అతని చేత అక్రమమైనపని చేయించావు. ఇది సహించరానిది. దీనికి నీ సంజాయిషీ ఏమిటి?" అని అడిగాడు.

"నేను ఎవరి బలహీనతనూ రెచ్చగొట్టలేదు చంద్రముఖుడు నన్నుడబ్బు అడిగాడు. డబ్బుఇస్తే సమస్య పరిష్కారమవుతుందని అన్నాడు.

ఇవ్వకపోవడంవల్ల నాకు ఎక్కువ నష్టం కలుగుతుంది గనక, ఒప్పేసుకున్నాను" అన్నాడు లంపటుడు.

మహీపాలుడికి ఎటూ పాలుపోలేదు. ఒక కొత్తరకం నేరం తనదేశంలో జరిగింది. దీనికి శిక్ష విధించే ముందు ఈ నేరానికి మొదటి కారకుడు ఎవరో నిర్ణయించటం అవసరమని ఆయనకు తోచింది.

అయితే అది సులువుగా తేలే సమస్య కాదు. ఈ నేరంలో మొదటి తప్పు లంచం ఇచ్చినవాడిదా! పుచ్చుకున్నవాడిదా! దీనికి సమాధానం సూటిగా ఎవరూ చెప్పలేరు.

పరిస్థితులనుబట్టి సమాధానాలు మారుతూంటాయి. అయితే దీనికి శిక్ష లేకుండా ఉన్నది. కారణం ఏమిటంటే, మిగిలిన నేరాలకు లేని శక్తి ఒకటి దీనికి ఉన్నది. ఇది న్యాయాన్నికూడా మార్చగలదు!

**వసుంధర**



# ఏ రాశికి ఏ ఆసనం



యోగాసనాలు వేయడంవల్ల మానసిక, శారీరక ఆరోగ్యాలు బావుంటాయన్న విషయం అందరికీ తెలిసిందే. హీలింగ్ పవర్ యోగాసనాలకిఎంతగానోవుంటుంది.

తమలోని చక్రాలతో అనుసంధానం చేసుకోవడానికి, శారీరక ఆకృతిని మెరుగుపరుచుకోవడానికి, పూర్తి స్థాయి సంక్షేమం మెరుగుదలకుయోగాసనాలు ఎంతగానో ఉపకరిస్తాయి.

పర్సనాలిటీకి తగినట్లు యోగా చేయడంవల్ల సత్ఫలితాలు శీఘ్రంగా కనపడతాయి. అలాగే ఒక్కో రాశి వారికి ఒక్కోరకం యోగాసనాలు మరింత పర్‌ఫెక్ట్‌గా సూటవుతాయి.

## మేషరాశి

ఆసనం : వజ్రాసన.

- మోకాళ్ళు రెండూ వెనక్కుమడిచి నేలపై కూర్చోవాలి.





- మడమలు దూరంగా ఉంచుతూ, కుడికాలి బొటనవేలిని ఎడమకాలి బొటనవేలిపై ఉంచాలి.
- చేతులను మోకాళ్ళపై వుంచాలి. అరచేతులు కిందివైపునకు ఉంచాలి.
- వెన్ను, తల, మెడ పైకి తిన్నగా ఏ విధమైన స్ట్రెయిన్ కాకుండా ఉంచాలి. వెన్ను అస్సలు వంచకూడదు.
- పూర్తి పోశ్చర్‌ను పరిశీలించుకుని అవసరమైన సర్దుబాట్లు చేసుకుంటేసరైనఎలైన్‌మెంట్‌కుదురుతుంది. బ్యాలెన్స్ చేసుకోవాలి.

## మిథునరాశి

ఆసనం : అధోముఖ శవాసన.

- టేబుల్‌టాప్ పొజిషన్





నుంచి పాదాలు స్ట్రెయిట్‌గా వుంచి, కాళ్ళనూ నిలువుగా పెట్టి పిరుదులను సీలింగ్‌వైపునకు ఉంచాలి.

- నెమ్మదిగా ఒంగి, అరచేతుల్ని నేలపై ఆనించాలి.
- వేళ్ళను పరిచినట్లుగాపెట్టాలి.
- వెన్ను ఒంచకుండా, తల, మెడ ఓ లైన్‌లో వుంచాలి.
- ఒక్క నిమిషం ఈ ఆసనం చేస్తే చాలు.

## కర్కాటకరాశి

ఆసనం : మర్జారి ఆసన.

- చేతులు, కాళ్ళపై కూర్చోవాలి.అరచేతులు భుజాల కిందుగా ఉంచాలి. మోకాళ్ళు పెల్విస్ లైన్‌లో అరచేతులకు సమంగా వుండాలి.
- పాదాలు వెలుపలికి వుండాలి. తల కొద్దిగా పైకి లేపాలి. గాలి పీల్చి, నడుమును ఒంపుగా వుంచాలి.
- అదే పొజిషన్ గాలి వదులుతూ కిందకు చూడాలి.

ఆసనాన్ని మూడు, నాలుగుసార్లు రిపీట్ చేయాలి.





## వృషభరాశి

ఆసనం : బద్ధకోనాసన.

- సౌకర్యంగా కూర్చుని వెన్ను, తల తిన్నగా ఉంచాలి.





- కాళ్ళు ముందువైపునకు మడిచి, రెండు పాదాలు, మడమలను మధ్యలోకి ఆనించాలి.
- మోకాళ్ళను నేలవైపునకు పుష్ చేస్తూ తొడలు, ముంజేతులను కలపాలి.
- వేళ్ళను కలుపుతూ,పాదాల కింద ఉంచాలి. వెన్ను పైకి స్ట్రెచ్ చేయాలి. ఛాతిని పుష్‌చేస్తూ, ఉదరాన్ని పట్టివుంచాలి.
- పైకి స్ట్రెచ్‌చేస్తూ గాలి పీల్చి,పాదాలను ఛాతివైపునకు తెస్తూ గాలి వదిలేయాలి.
- కాళ్ళచుట్టూ ముంజేతులను లాక్ చేయడానికి మోచేతులు వాడాలి.
- తిన్నగా వుండి ముందుకు సూటిగా చూస్తుండాలి.
- బ్యాలెన్స్‌చేస్తూ వీలయినంతసేపు పట్టి వుంచాలి.
- గాలి వదులుతూ, కండరాలను రిలాక్స్ చేయాలి. తొడలనుంచి ప్రెజర్‌ను విడుదలచేయడానికి కాళ్ళు స్ట్రెచ్ చేయాలి.
- మూడు, నాలుగుసార్లు రిపీట్‌చేస్తూ, పాదాలను ఛాతి వద్దకు లాగిన ప్రతి సారీ గాలి వదిలేస్తుండాలి.

## సింహరాశి

ఆసనం : భుజంగాసన.

• ఉదరంపై బోర్లాపడుకుని తల పైకి ఎత్తడంలో వెనుక కండరాలను వాడాలి.
• చేతుల్ని సపోర్ట్ చేసుకోవాలి.
• ఛాతిని పుష్‌చేస్తూ, భుజాల్ని రిలాక్స్‌చేయాలి. తిన్నగా చూస్తూ, ఓ నిమిషం హోల్డ్ చేయాలి.





## కన్యారాశి

ఆసనం : కుంభకాసన.

• టేబుల్ టాప్ పోజ్ నుంచి, కాలివేళ్ళపై లేచి, చేతులపై బరువు ఆపుకోవాలి.
• భుజాలు, చెవులకు దూరంగా, శరీరం స్ట్రెయిట్‌గా వుండాలి. ఆసనాన్ని ఓ నిమిషం హోల్డ్ చేయాలి.









## తులారాశి

ఆసనం : తడాసన.

• పాదాలను పిరుదులకు సమంగా వుంచి కాలివేళ్ళను అదిమివుంచాలి. రెండు చేతులూ పైకిలేపి వేళ్ళకుజతచేయాలి. బాగాతిన్నగా లేపాలి.
• భుజాలు విశాలంగా వుంచి రిలాక్స్‌వ్వాలి.
• చుబుకం నేలకు సమాంతరంగా వుండాలి. తల పెల్విస్‌పైన స్ట్రెయిట్‌గా పెట్టాలి.
• తలపైన చేతులుంచుకుని, పాదాల మడమలు పైకి లేపాలి. ఓ నిమిషం హోల్డ్ చేయాలి.



## వృశ్చికరాశి

ఆసనం : వృక్షాసన.

• తిన్నగా నిలబడి, కుడిపాదంపై బరువు ఆపాలి.
• ఎడమపాదాన్నికుడి మోకాలిపైన కుదిరితే తొడ లోపలిభాగం పైన ఆన్చాలి.
• బ్యాలెన్స్ అయ్యాక, రెండు చేతులూ పైకి ఎత్తి, దండంపెడుతున్నట్లు ఆనించాలి.
• భుజాలు రిలాక్సింగ్‌గా ఉంచాలి. తడాసన మాదిరే తల పొజిషన్ వుండాలి.
• కళ్ళను ఓ పాయింట్‌పైన కేంద్రీకరించాలి.



Courtesy : THE MAN

## ధనూరాశి

ఆసనం: పర్వతాసనం.

• తిన్నగా కూర్చుని, ముంజేతులు ఆకాశంవైపునకు స్ట్రెచ్ చేయాలి.
• కొంచెం ముందుకు ఒంగి, నెమ్మదిగా కుడికాలిని స్ట్రెచ్ చేస్తూ, కుడిపాదాన్ని ఎడమపాదాన్ని ఒకదానికొకటి మెలికి వేసుకోవాలి.
• మడమలు పైకి లేపి, కాలివేళ్ళపై బరువు ఆపుకోవాలి.
• ముందుకు చూస్తూ గాలి తీసుకుని, కిందకు చూస్తూ వదిలేయాలి.





## మకరరాశి

ఆసనం : సర్వాంగాసన.

• కాళ్ళదగ్గరగాపెట్టి కార్పెట్‌పైపడుకోవాలి. 90°ల యాంగిల్‌లో కాళ్ళను పైకి లేపాలి. ఆ తర్వాత అరచేతులతో నేలపై ప్రెస్ చేస్తూ, నడుము పైకిలేపి, కాళ్ళను తిన్నగా ఉంచాలి.
• చేతుల్ని నేలపై ఆనించి అరచేతుల్ని నడుముకు జార్చాలి.
• పూర్తి శరీరం బరువు భుజాలపై వుంటుంది. మోచేతులు, అరచేతులు శరీరానికి సపోర్ట్‌నిస్తాయి. ఈ పోజ్‌ను 50 నుంచి 100 అంకెలు లెక్కించే దాకా వుంచాలి. కాలివేళ్ళపై ఫోకస్ చేయాలి.
• నెమ్మదిగా కాళ్ళను, వెన్నును, చేతుల్ని కిందకు దించాలి.





## కుంభరాశి

ఆసనం : పాదహస్తాసన.

• చేతుల్ని ఆకాశం వైపునకు స్ట్రెచ్‌చేస్తూ స్ట్రెయిట్‌గానిలబడాలి.
• నడుము దగ్గర బాగా కిందకు వంగి, అరచేతుల్ని ఫ్లాట్‌గా నేలపై ఆనించాలి. చేతుల్ని మోకాలిపైన పెనవేసి, ముక్కు మోకాళ్ళ నడుమ ఉండేలా చూసుకోవాలి. ముందుకు వంగినప్పుడు గాలి వదిలేయాలి.
• మునివేళ్ళతో నేల తాకుతూ, ఫ్లెక్సిబిలిటీ పెంచుకోవాలి.









## మీనరాశి

ఆసనం : హలాసన.

• నేలపై పడుకుని ముంజేతులను శరీరం పక్కగా ఉంచాలి. కాళ్ళు స్ట్రెచ్ చేయాలి.
• పిరుదులను పైకి లేపుతూ, కాళ్ళను తల వెనక్కు తీసుకువెళ్ళి, కాలివేళ్ళతో నేలను తాకాలి. అరచేతులతో వెనుకవైపు బ్యాలెన్స్ చేసుకోవాలి.
• తల వెనక్కు కాళ్ళు జరుపుతూ గాలి వదిలేయాలి.

టి.సుదీప్తి

# భలే మంచి రోజు

కామెడీ కథ

స్నాటి తీగలాంటి ఆమె శరీరం, అద్భుతమైన అందాన్ని మోస్తోంది. చిరుగాలికే మోహం పుట్టి అణువణువునీ తడిమేస్తోంది, ఒంపుసొంపుల్ని తడిమి తడిమి ఆనందిస్తోంది.

"అబ్బా", అప్రయత్నంగా పైకే అన్నాడు ధూర్జటి. ముందు నడిచే ఆమె వయసు ఇరవై నాలుగయితే ధూర్జటి వయసు ఇరవై ఆరు.

ఆమె పేరు స్నేహలత. 'ఉహూ... అసలు 'మోహ లత' అని పెట్టివుండాల్సింది' ఆమె పేరు వినగానే తనలో తాను అనుకున్నాడు ధూర్జటి.

"పాలకొండ నీడల్లోన భగ్గుమన్న ఆరాటం...
దాపునున్న తీగలకోసం రావిచెట్టు పోరాటం"

పిచ్చిపిచ్చిగా పాటకట్టి, పరిచయమైన మరుక్షణమే మనసులో పాడుకున్నాడు ధూర్జటి. "మీరు పాటలు పాడతారా?" ఆమె గొంతు గాలి మీటిన సెలయేటి అలలా మెత్తగా, మృదువుగా, మధురంగా వుంది.

"అబ్బే...అదేంలేదు" తత్తరపడుతూ అన్నాడు.

"కూనిరాగం తీస్తున్నారుగా, అందుకడిగా!" చిన్నగా నవ్వి వెళ్ళిపోయింది.



భువనచంద్ర

ఆ చిన్న చిరునవ్వు... ఈ పెదవి అంచు నించి, అవతలి అంచువరకూ తటిల్లతలా పాకి, హృదయంలో కమ్మని తుఫాన్ని రేపింది.

ఆమెకి పెళ్ళికాలేదు. చేసుకోదట. ఈ 'ట' కారాన్ని వినిపించింది సీనియర్ కొలీగ్ కామేశ్వరశర్మ. ధూర్జటికీ పెళ్ళికాలేదు. అసలు చేసుకోదలుచుకోలేదు. కానీ, స్నేహలతని చూడగానే ధూర్జటి నిర్ణయం మొదలంటా 'ఇగిరి' పోయింది.

చూసిన మరుక్షణంనించే కోటానుకోట్ల కలలు అతని కనుపాపల్లో ఒదిగిపోతున్నాయి.

"అవునోయ్ ధూర్జటీ... నువ్వేమిటోయ్... చిక్కి సగమైపోతున్నావూ ఏ ముళ్ళకంచెలోనో చిక్కుకోలేదు కదా?" ఆరాతీశాడు కా॥ శ. "ముళ్ళకంచె ఏమిటీ?" అయోమయంగా అన్నాడు ధూర్జటి.

"అదేనోయ్. ప్రేమ. ప్రేమ అంటేనే ఓ ముళ్ళ కంచె. ఒక్కసారి అందులో చిక్కితే ఒళ్ళంతా ముళ్ళే" "అంటే?" సందేహిస్తూ అడిగాడు ధూర్జటి.

"ఆహా... అందుకే అనుభవంతో చెబుతున్నాను. ఛస్తే ప్రేమించకు... ప్రేమించినా పర్లేదు... పెళ్ళి మాత్రం ఛస్తే చేసుకోకు. ప్రేమగా వుండే ప్రేయసే పెళ్ళయ్యాక పిశాచాల్ని పెంచుతుంది. నోట్లోనూ, చూపుల్లోనూ దాచి!" మైలున్నర పొడుగు నిట్టూర్చాడు కా॥శ...అంతేకాదు రుమాలు తీసి కళ్ళు తుడుచుకుని మరీ తన సీట్లోకి పోయాడు. "ఆయనంతేనోయ్... తోక తెగిన నక్క అనుకో! అసలు మేమిద్దరం ఒకేసారి ఉద్యోగంలో చేరాం. అప్పటికీ నేను నచ్చచెప్పాను-

తెలిసిన 'నాలాంటి' వాళ్ళని ప్రేమిస్తే సుఖపడతావూ, ముక్కూమొహం తెలీనిదాన్ని ప్రేమిస్తే సోదిలోకి కూడా రాకుండాపోతావూ అని.

వింటేగా? ఎర్రగా బుర్రగా వుంది కదా అని పక్క బ్యాంకులో పనిచేసే పదేళ్ళ చిన్నదాన్ని ప్రేమించాడు. ఏమవుతుందీ? ఆ పిల్లేమో మాంఛి నాన్‌వెజ్ తినే పిల్లాయే. ఈయనేమో తినేది శాకాహారమేగా! రెండేళ్ళకల్లా గొడవలు. రోజూ యుద్ధాలే.

పిల్లలు పెద్దవాళ్ళైపోయారుగానీ, లేకపోతే బతుకు బస్టాండు కాదూ!" సీనియర్ ఉద్యోగిని సరోజిని కళ్ళల్లో అసూయా, గొంతులో హేళన. ధూర్జటి ఏమీ మాట్లాడలేదు. సరోజినికి ఇంకా పెళ్ళి కాలేదు. పెళ్ళయిన ఆడవాళ్ళని చూస్తే ఆవిడకి చచ్చేంత అసూయ. కొత్తగా పెళ్ళయిన ఆడవాళ్ళని మాటలతోనే చిత్రవధ చేస్తుంది.

క్షణం విశ్రాంతినివ్వకుండా పనిమీద పని పురమాయిస్తూవుంటుంది. బ్రహ్మచారుల్ని మాత్రం కష్టపెట్టదు. అంతేకాదు... గొంతులో తేనె పంచదారుల్ని పోసుకుని మరీ మాట్లాడుతుంది.

"అవునూ... ఇంతకీ నువ్వెవర్నీ ప్రేమించలేదు గదా! ప్రేమించడం అంటే చాలా గొప్ప విషయం. ప్రేమ ఎంత గొప్పదీ... ప్రేమకి కులమతాలుండవు. బీదా గొప్పా తేడాలుండవు.

చదువుందా? లేదా! అనే ప్రశ్నే వుండదు. అంతెం

దుకూ తనకంటే పెద్దదైన రాధని కృష్ణుడు ప్రేమించాడని అంటారుగా! అంటే, వయసుకి సంబంధించిన భేదాలక్కూడా ప్రేమ అతీతమన్నమాట!" చివరి మాటని గుసగుసగా అని, అర్థవంతంగానవ్వి, ఆఫీసులోకి నిష్క్రమించింది సరోజిని.

గుడ్లు తేలేశాడు ధూర్జటి. పిల్లని పడెయ్యడానికి 'పదహారుసూత్రాలు'రచన కుమారికోమలం LTBF గారు రాసిన పవిత్ర గ్రంథాన్ని పన్నెండోసారి పూర్తిచేశాడు ధూర్జటి.

మొదటిసూత్రం : స్మైల్‌తో పడగొట్టడం. కుమారి కోమలంగారు విపులంగా రాసింది. మగవాడు మనోహరంగా నవ్వితే కన్నెపిల్ల 'ఇట్టే' పడిపోతుందనీ. ఓ బ్రహ్మాండమైన అద్దం కొనేసి రకరకాలుగా నవ్వడం ప్రాక్టీసు చెయ్యమన్నదావిడ.

తూ।చా॥ తప్పకుండా ఫాలో అయ్యాడు. రకరకాలుగా ఓ గంట ప్రాక్టీసు చేసేటప్పటికి బుగ్గలన్నీ వాచాయి. పెదాలు పిచ్చిగా తీపులు పెట్టసాగాయి.

ఇవాళ్టికి ఇదిచాలూ అని బయటికొచ్చాడుధూర్జటి. పక్కంటి 'ఆంటీ' బట్టలు ఆరేస్తూ కనిపించింది. 'స్మైల్ టెస్ట్' చేద్దామనుకుని "ఆంటీ బాగున్నారా?" అని ఓ స్మైలిచ్చాడు. ఆంటీ అతనివైపు చూసి ఆశ్చర్యంగా కనుబొమలు పైకెత్తి "ఏమయింది ధూర్జీ... ఎవరితోనన్నా గొడవపడ్డావా?" అని అడిగింది.

"లేదే!" అన్నాడు.

"మరి బుగ్గలేమిటీ అప్పుడే గోడక్కొట్టిన పిడకల్లా అడ్డంగా ఉబ్బాయి" కనుబొమలు ముడివేసి అన్నది. ధూర్జీ గబగబా అద్దం చూసుకున్నాడు గదా, ఆవిడ చెప్పిన పోలిక కరెక్టుగానే అనిపించింది. ఈ కోమలం ఐడియామండ! అర్జంటుగా సెలవుపెట్టేశాడు.

ఆ మొహంతో స్నేహలతని చూడటం ఆత్మహత్యాసదృశమే కదామరి! ఖాళీగా కూర్చోవడం బోరుకొట్టి మళ్ళీ కుమారి కోమలంగారి పదహారు సూత్రాల పుస్తకం ఓపెన్ చేశాడు ధూర్జటి.

పవిత్రసూత్రం No.2 "అమ్మాయిలు కలివిడిగా వుంటూ హాస్య / చతుర సంభాషణ చేసే మగవాళ్ళ ప్రేమలో 'ఢమాల్న' పడిపోతారు. ఇది సత్యాతిసత్యం" అని వున్నది.తెల్లార్లూ జోక్స్ బుక్కులో వుండే జోకుల్ని ఫుల్‌గా బట్టీపట్టేశాడు.

పొద్దున్నే లేచి బుగ్గల్ని అబ్జర్వ్ చేస్తే పెర్‌ఫెక్ట్‌గా వున్నాయనిపించింది 'స్మైల్'కూడా బ్రహ్మాండంగా వుందనిపించింది. టిప్‌టాప్‌గా తయారయ్యాడు.

స్నేహలత పూలరథంలా ఆఫీసులోకి అడుగుపెట్టగానే ధూర్జటి,

"స్నేహాజీ... ఈ జోక్ విన్నారా... ఒకాయన మరోకాయన్ని 'ఏవండీ ఏ.సుబ్బారావు వుండేది మీ వీధిలోనేనా' అని అడుగుతాడు.

అప్పుడా మరో ఆయన ఏ సుబ్బారావు! అని మొదటాయన్ని అడుగుతాడు. హి... హి... భలేవుంది కదండీ"

## విభిన్న పాత్ర

మైసావనూల్ పిల్ల మస్కన్‌సేథీ తన తదుపరి చిత్రంలో పూర్తిగా డీ-గ్లామరస్‌గా కనపడుతుంది. నిర్మల్ పట్టణ సంప్రదాయాలు, సంస్కృతి గురించిన వాస్తవిక కథ స్ఫూర్తిగా తీస్తున్న మహిళా ప్రాధాన్య చిత్రమిది.

"నిర్మల్ గ్రామ సంక్షేమంకోసం పాటుపడే పాత్ర నాది. అక్కడి హస్తకళల సంప్రదాయ గుర్తింపునకు మరింత బలం చేకూర్చడానికి ప్రయత్నిస్తాను. నా గత సినిమా రూపానికి పూర్తిగా విభిన్నంగా కనిపిస్తా. లంగాఓణిలో అతితక్కువ మేకప్‌తో నటిస్తున్నాను. నిర్మల్ చుట్టుపక్కల ప్రదేశాల్లో షూటింగ్ అద్భుతంగా వుంది. నిర్మల్‌లో ఇరవై రోజులకు పైగా గడిపాను" అంటూ ఎగ్జయిట్ అయింది మస్కన్‌సేథీ.



అని బ్రాడ్ స్మైలిచ్చాడు.

స్నేహలత వాంతొచ్చిన హీరోయిన్‌లా మొహం పెట్టి "ఇంతకీ మీరు నవ్వుతున్నారా లేక...?" అంటూ లోపలికెళ్ళిపోయింది. ధూర్జటి మొహం మద్రాసు ఎండలకి మల్లెపూలు వాడినట్టు వాడిపోయింది.

"బాధపడకండి ధూర్జటిగారూ. మీరు చెప్పిన జోకు ఎంత బాగుందంటే, నేను నవ్వాపుకోలేక బాత్‌రూమ్‌కి పరిగెత్తి మనసారా నవ్వినవ్వి ఇప్పుడే బైటికొచ్చాను.

కావాలంటే చూసుకోండి, నా బుగ్గలు నవ్వీ నవ్వీ ఎంత వాచిపోయాయో" నవ్వుకీ ఏడుపుకీ మధ్యస్థంగా మొహంపెట్టి ధూర్జటితో అన్నది సరోజిని.

"నిజంగానా?" సంభ్రమంగా అన్నాడుధూర్జటి.

"మీమీదొట్టు" ధూర్జటిచేతిని తన రెండుచేతుల మధ్యా గట్టిగా ఇరికించుకుని ప్రామిస్ చేసింది సరోజిని.

"ఏమిటీ పాణిగ్రహణాలు... అదీ ఆఫీసులో" లోపలికొస్తూనే చికాగ్గా అరిచాడు బాస్.

ఠక్కున చేతులు విదిలించుకుని తన క్యాబికల్‌లోకి పరిగెత్తింది సరోజిని... వెళ్ళేముందు ధూర్జటివైపు ఓ 'అర్థవంతమైన లుక్'ని విసరడం మాత్రం మర్చిపోలేదు.

ధూర్జటికి బుర్ర తిరిగిపోయింది.

వారంరోజుల్లో కుమారి కోమలం LTBF గారి అన్ని సూత్రాలూ ఘోరంగా ఫెయిలవడమే కాక స్నేహలత ముందు తలవొంపులకికూడా గురిచేశాయి. అన్నిటికంటే ఎనిమిదో సూత్రం అద్భుతంగా వికటించింది.

"మీరు ప్రేమించిన అమ్మాయి తలలో పూలదండగానీ, విరిగిన గాజు పెంకులు (ముక్కలు) గానీ-

కిందపడి మరచిన రుమాలుగానీ, మీకు దొరికితే, వాటిని మీరు ప్రాణప్రదంగా చూసుకోవడమేగాక, అలా చూసుకుంటున్న సంగతి ఆమెకి తెలియజెయ్యాలి. లేదా ఆమెకి తెలిసేట్టు ప్రదర్శించాలి' ఇదీ ఆ ఎనిమిదవ సూత్రపు సారాంశం.

లక్కీగా ఆ సూత్రం బట్టీపట్టిన రోజునే లంచ్‌బ్రేక్‌లో స్నేహలత 'రెస్ట్ రూమ్'కి వెళ్ళగానే ఆ సీటుదగ్గర ధూర్జటి గాలించాడు.

ఏమైనా అలా పారేసుకున్న, లేక పడివున్న వస్తువులు దొరుకుతాయేమోనని.

లక్కీగా మల్లెలూ, కనకాంబరాలూ దవనం, మరువం కలిపి కట్టిన కదంబమాల క్యాబికల్ ఎంట్రన్స్‌కి ఇవతల పడివుంది. ఠక్కున ఆ మాల తీసి జేబులో వేసుకున్నాడు ధూర్జటి.

భోజనం కూడా చెయ్యకుండా ఆనందంతో అత్యుత్సాహంతో స్నేహలత రాకకోసం ఎదురుచూస్తూ తన సీట్లోనే అసహనంగా కూర్చున్నాడు ధూర్జటి.

ఆమె 'సైట్' కాగానే, ఆ మాలని గుండెమీద వేసుకుని సువాసనని ఆఘ్రాణిస్తున్నట్టు పోజుపెట్టాడు.

అది చూడగానే స్నేహలత కనుబొమలు ముడిబడ్డాయి. చరచరా అతని దగ్గరికొచ్చి 'ఛీ... ఇంత ఘోరమా'... అని అసహ్యం నిండిన



మావోయిస్టుల సహాయంతో మోడీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేయాలనుకుంటున్నాయి కొన్ని పార్టీలు. -అరుణ్ జైట్లీ, కేంద్రమంత్రి

చూపాకటి విసిరి తన సీట్లోకి దడాదడా వెళ్ళిపోయింది.

తెల్లమొహంవేశాడు ధూర్జటి.

ఆ అయోమయంలో గుండెమీద కదంబాన్ని తియ్యడం మర్చిపోయాడు.

"నేనంటే అంతఇష్టమా మీకూ"దగ్గరగావచ్చి నవ్వుతూ అడిగింది రంగమ్మ. రంగమ్మ ఆఫీసులో స్వీపర్ కమ్ హెల్పర్. ఆవిడ వయస్సు యాభై అరు. భర్త కాలంచేసి పదేళ్ళయింది.

ఎలక్ట్రిక్ షాక్ తిన్న కాకిలా ఎగిరిపడ్డాడు ధూర్జటి. "వాట్ నాన్సెన్స్' అని కూడా అప్రయత్నంగా అరిచాడు.

"ఓసోస్... మీ కుర్రాళ్ళ టేస్టు నాకు తెల్సులెండి. నోటితో చెప్పకుండా నా మాల మీ గుండె మీదెట్టు కన్నారంటే, అర్థం ఏంటో నేనర్థం చేసుకోలేనా?" చిలిపిగా నవ్వి కన్ను కొట్టి అవతలికెళ్ళింది రంగమ్మ. ఖర్మకాలి ఆ దండ వెళ్ళి సరోజిని క్యూబికల్‌లో పడింది.

"ఎవరీ పూలదండ విసిరిందీ? సీరియస్‌గా లేచి నిలబడి చుట్టూ చూస్తూ అన్నది సరోజిని. స్వరం పెరిగిందే తప్ప ఆమె గొంతులో ఉండాల్సినంత కాఠిన్యం లేదు.

"ఆ దండ రంగమ్మది. విసిరింది శ్రీయుతధూర్జటి"చికాగ్గా జవాబిచ్చింది స్నేహలత.

"ఓహ్... వై ధూర్జటీ... వైడిడ్ యూడూ?"తన సీట్లోంచి లేచి ధూర్జటి సీటువైపుకొస్తూ అన్నది సరోజిని.

కంగారుతో బిక్కమొహం వేశాడు ధూర్జటి. "మేమ్... అసలెందుకు విసిరానంటే" ఎదురుగా నిలబడ్డ సరోజినికి ఎక్స్‌ప్లనేషన్ ఇవ్వబోయాడు.

"యూ... నాటీ... ఎందుకు విసిరావని, నేనడిగానా? అందరి ముందూ విసరడం ఎందుకని!అయినా ఓకే! నీవి సూపర్ గట్స్" అని మెల్లగా అని, "ఫస్ట్ టైమ్‌వదిలిపెడుతున్నా మిస్టర్ ధూర్జటీ, మరోసారి ఇలా విసిరితే చాలా సీరియస్‌గా తీసుకోవాల్సివుంటుంది"

అందరికీ వినిపించేలా అని,

"థాంక్యూ డియర్, ఈసారి విసరొద్దు...చక్కగా నా వాలుజడలో స్వహస్తాలతో అలంకరిస్తే కాదంటానా" ధూర్జటి ఒక్కడికే వినిపించేట్టుగా అని వెనక్కి తిరిగింది సరోజిని.

"ఏటీ... మీరొత్తారా నన్నే రమ్మంటారా? ఇల్లు తెలుసులెండి" చిరునవ్వుతో అంది రంగమ్మ. ఊడుస్తున్న చీపుర్ని అందంగా పట్టుకుని. ఆఫీసుకి ఇంకా ఎవరూ రాలేదు.

రాత్రంతా కష్టపడి తనసలు ఆ దండని ఎందుకు పట్టుకున్నాడో, తను స్నేహలత అనే దేవతని ఎంత ప్రేమిస్తున్నాడో మొత్తం ఉత్తరంగా రాసి తెచ్చాడు ధూర్జటి. స్నేహలత రాగానే ఆ ఉత్తరాన్ని ఆమె చేతికి అందిద్దామని. తీరా చూస్తే తగిలింది రంగమ్మ.

"రంగమ్మా... నన్ను క్షమించి నేను చెప్పేది విను. నువ్వంటే నాకు గుండె నిండా గౌరవం వుంది. ఈ ఆఫీసులో ఎవరికీ లేని మెత్తని హృదయం నీది... ఒక్కక్షణం నా మాట విను" అని తన మనసులోని మాట చెప్పి, "స్నేహలతని తప్ప లోకంలో ఎవరినీ పెళ్ళిచేసుకోను... ఆమె చేసుకోకపోతే ఆజన్మాంతం బ్రహ్మచారిగానే వుండిపోతాను.

అంతేగానీ, నా ప్రాణాలు తీసుకుని ఆమెకి చెడ్డపేరు రానివ్వను. రంగమ్మా. అమ్మలగన్న అమ్మా... నిజంగా చెబుతున్నా... స్నేహలత నా ఊపిరి... నా ప్రాణం... నా శ్వాస... ఇంకా..."

"మై ఫుట్" అరిచింది స్నేహలత వెనకనించి.

"ఏంటోయ్ విశ్వావసూ ప్రేమలో ఏమన్నాపడ్డావా? పడకునాయనా పడకు. అనుభవంతో చెబుతున్నా..." ఉత్సాహంగా 'మిస్‌కోమలం LTBF' గారి పుస్తకాన్ని కొనుక్కుంటున్న విశ్వావసుతో అన్నాడు ధూర్జటి.

"అంటే?" అడిగాడు విశ్వావసు.

"ఒకప్పుడు నేనూ అదేపుస్తకం కొని ఎనిమిదో సూత్రం వికటించగా ఒకఘోరమైన పరిస్థితిలో ఇరుక్కున్నాను. కానీ, ఆ తర్వాత నెలరోజుల్లోనే మైఫుట్ అని అరిచిన ప్రేయసి, నా పెళ్ళామై నా ఇంట్లో రైట్‌ఫుట్‌తో అడుగెట్టింది.

మొదటి రెండేళ్ళు దివ్యంగానూ, ఆ తర్వాత మూడేళ్ళు ఉత్సాహంగానూ, ఆ తర్వాత మరోమూడేళ్ళు అటూ ఇటూగానూ గడిచాయి.

ఇహ ఇప్పటి సంగతా...! ఇదిగో ఈ పుస్తకం చదివీ చదివీ చిరిగిపోతే మళ్ళీ కొనుక్కుంటున్నాను" అని -

చేతిలో భగవద్గీతని చూపించాడు ధూర్జటి. పాపం, ముగ్గురు మహాజాదూ గాళ్ళలాంటి కుర్రాళ్ళకి తండ్రి ఆయే! ఏం చేస్తాడు!

# ఫర్ U






## చపాతీలతో ఆరోగ్యం

చపాతీలు తింటే వేడిచేస్తుందన్న అపోహ చాలామందిలో వుంటుంది. కాని, చపాతీలలో అనేక ప్రయోజనాలుంటాయి. గోధుమపిండిలో అనేక విటమిన్లు, మినరల్స్ వుంటాయి.

బరువు తగ్గించుకోవాలనుకునేవారికి చపాతీలు మంచి ఆహారం. వీటిలో పీచు ఎక్కువ, క్యాలరీలు తక్కువ వుంటాయి. గోధుమపిండితో చేసిన చపాతీలు తినడంవల్ల పొటాషియం,ఫాస్పరస్, క్యాల్షియం, ఐరన్ లభిస్తాయి.

ఫైబర్, జింకు, ఇతర ఖనిజాలు ఎక్కువగా వుండడంవల్ల చర్మానికి మేలుచేస్తుంది.

రోటీలు సులువుగా జీర్ణం అవుతాయి.ఐరన్ అధికంగా లభిస్తుంది. ఎటువంటి నూనె లేకుండా చపాతీలు కాల్చుకుంటే క్యాలరీలు తక్కువగా ఉంటాయి.మలబద్ధకాన్ని నివారించడంలో బాగా పని చేస్తుంది. వీటిలోని కార్బోహైడ్రేట్లు శరీరానికి అవసరమయ్యే శక్తిని అందిస్తాయి. ◆

## జీవక్రియల చురుకుదనం

ఎప్పుడూ హుషారుగా, ఉత్సాహంగా, ఉల్లాసంగా వుండేవాళ్ళు నిస్సత్తువగా, నిస్తేజంగా అనిపిస్తే కారణం ఏమిటీ? అంటే శరీరంలో జీవక్రియ తగ్గిపోయిందని అర్థంచేసుకోవాలి.

జీవక్రియ వేగాన్ని పెంచుకోవడానికి కొన్ని చర్యలు అవసరం ఉంది. సమయం లేదనో,బరువు తగ్గాలనో ఆహారాన్ని ఎక్కువసేపు తీసుకోకపోతే జీవక్రియ రేటు తగ్గిపోతుంది. సమయం ప్రకారం ఆహారం తీసుకుంటుండాలి.

పోషకాహారంవల్ల బరువు పెరగరు. సులువుగా జీర్ణమయ్యే, అధికశక్తిని ఇవ్వగల ఆహారాన్ని ఎంపికచేసుకోవాలి. అలాగే, నిద్ర సరిగ్గా పోకపోయినా జీవక్రియలు మందగిస్తాయి.

ప్రతిరోజూ తప్పనిసరిగా ఏడెనిమిది గంటలు నిద్రపోతుండాలి. మంచినీళ్ళు, మజ్జిగ, పండ్ల రసాలు వంటివి తాగుతుండడం వలన జీవక్రియలు బావుంటాయి. ◆

## కృతజ్ఞతతో సంతృప్తి

జీవితంలో ఎవరు, ఏ మేలుచేసినా అది మర్చిపోకుండా,జీవితాంతం కృతజ్ఞతాభావంతో మెలిగే తత్వంగల వ్యక్తులకు జీవితం సంతృప్తిగా సాగుతుందనేది అధ్యయనాల సారాంశం.

మిగతావారితో పోల్చితే వీళ్ళకు ఆందోళనలు, ఆత్రుతలు తక్కువగా ఉంటాయి.

అత్యంత ఆశావహ దృక్పథంతో, క్షమాగుణంతో, వాస్తవిక దృక్పథంతో, జాలి, దయలతో వుంటారు కాబట్టి వీరిలో మిగతావారిలో మాదిరి ఆందోళన, ఆత్రుతలు వుండవు.

ఎవరో ఒకరికి కృతజ్ఞతలు తెలియజెపుతూ ఇ-మెయిల్ చేయడం లేదా ఉత్తరం రాయడం చేస్తే వాటిని పంపకపోయినాసరే సంతృప్తిగా వుంటుంది. అలాగే, ప్రతిరోజూ జీవితంలో దక్కిన సంతోషాలు, ఆనందాలకు కృతజ్ఞతలు చెపుతూ ఓ జాబితా రాసుకుంటూ వున్నా ఎంతో సంతృప్తి చేకూరుతుంది.

# sex &  సైకాలజీ

## Age couple grow old intimacy through sex becomes important

డా॥ జి.సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

జె.కె. నంద్యాల

నాకు సెక్స్‌మీద అంతగా ఆసక్తి లేదుగాని మా వారికి సెక్స్ అంటే మహాపిచ్చి. ఆయన రోజుకి 4-5 సార్లు సెక్స్ కావాలంటారు.

నాకు ఇష్టం ఉన్నా లేకపోయినప్పటికీ వారితో సెక్స్‌లో పాల్గొంటాను. ప్రతిసారీ నాకు ఎటువంటి అనుభూతీ కలగదు గాని మావారికి మాత్రం ప్రతిసారీ చక్కని అనుభూతి కలుగుతుందట. ఆయన అన్ని సార్లు సెక్స్‌లోపాల్గొనడంవల్ల ఆయన ఆరోగ్యం దెబ్బ తింటుందేమోనని నాకు భయం వేస్తుంది.

అంతేకాదు వారికి సెక్స్ త్వరగా లేకుండా అయిపోతుందని భయం కలుగుతుంది. సెక్స్‌లో ఎక్కువ సార్లు పాల్గొనడం వల్ల మగవాడు వీక్ అవడా?

సెక్స్‌లో ఎన్నిసార్లు పాల్గొన్నప్పటికీ మగవాళ్ళకిగాని, ఆడవాళ్ళకిగాని ఏమీ అవదు. ఆరోగ్యం చెడదు. నరాల బలహీనత రాదు. సెక్స్ వీక్ అవడం ఉండదు. కోరిక, సామర్థ్యం ఉంటే రోజులో ఎన్నిసార్లు అయినా సెక్స్‌లో పాల్గొనవచ్చు. సెక్స్‌లో ఎక్కువసార్లు పాల్గొనడంవల్ల సెక్స్‌లో డౌన్ అవడం ఉండదు.

పి.ఎస్. నెల్లూరు

కొంతకాలంనుంచి నాకు మా ఆయనతో సెక్స్‌లో పాల్గొంటే నొప్పి అనిపిస్తోంది.డాక్టర్‌తో సెక్స్ విషయం చెప్పాలంటే సిగ్గువేసి చెప్పకుండా ఉన్నాను. ఈ విషయం డాక్టర్‌తో ఎలా చెప్పగలను? మీరైనా సెక్స్‌లో నాకు ఎందుకని నొప్పి అనిపిస్తుందో, దానికి పరిష్కారం ఏమిటో చెప్పవలసిందిగా కోరుతున్నాను.

స్త్రీలకి సంభోగంలో పాల్గొన్నప్పుడు నొప్పి రావడానికి రకరకాల కారణాలు ఉంటాయి. యోనిలో తగినంత ద్రవాలు ఊరకపోయినప్పటికీ సంభోగంలో మంట, నొప్పి అనిపిస్తుంది.

కొంతమంది స్త్రీలలో సెక్స్‌పరమైన కోరిక కలగదు. అటువంటప్పుడు తగినంత స్పందించకపోవడంతో ద్రవాలు కూడా ఊరవు. ద్రవాలు ఊరకపోతే సంభోగంకూడా బాధాకరం అనిపిస్తుంది.

ఇంకొంతమంది స్త్రీలల్లో కాన్పు సమయంలో యోనిమార్గంలో చీరుకుపోవడంవల్ల కూడా నొప్పి ఉంటుంది.యోనిలోగాని,గర్భాశయంలో గాని,పక్కనే ఉండే ట్యూబులో, ఓవరీస్‌లో ఇన్‌ఫెక్షన్ కలిగితే సంభోగంలో నొప్పి అనిపిస్తుంది.

# అందులో అసాధారణం అసలే వుండదు

దంపతులమధ్య వచ్చే పలురకాల గొడవలకు, విభేదాలకు మూలం పడకగదిలో వుంటుంది. పడకగదిలో సమస్యను పరిష్కరించుకునే పద్ధతులు తెలియక వాటిని మిగిలిన సమయంలోకి పొడిగించుకుని చీటికిమాటికి గొడవ పడుతుంటారు. వారి అసలు సమస్య అనుభవాలున్న పెద్దలకు అర్థమవుతుంది.

అటువంటి సమయంలో ఆ దంపతులకు ఏకాంతం కల్పించే యత్నం చేస్తారు.అయినా వారి సమస్య పరిష్కారం కావటంలేదంటే ఆ దంపతులలో సెక్స్‌లో పాల్గొనే తీరుమీద విభేదాలు వున్నాయని అర్థం. సెక్స్ ఎందుకు, ఎలా, ఎన్ని రోజులకు ఒకసారి అనే విషయంమీద ఆడ, మగలిద్దరిలో సందేహాలు ఉంటాయి,

ఆడవారిలో కొంచెం ఎక్కువగా వుంటాయి. కేవలం సంతానంకోసమే సెక్స్ అని, నెలకో, రెండు నెలలకో ఒకసారి పాల్గొంటే చాలని అనుకునేవారు లేకపోలేదు.సెక్స్ అనేది పాపకార్యంగా భావిస్తారు. ఎంత త్వరగా ముగించి దుస్తులు వేసుకుని దూరంగా జరిగిపోవాలనుకుంటారు.

అదే సహజమైన సెక్స్ అనే అభిప్రాయం ఆడ, మగలిద్దరిలో వున్నాయి. అటువంటి ఆలోచన దంపతులిద్దరిలో వుంటే సమస్య వుండదు.

కాని ఒకరికి భిన్నమైన సెక్స్ కోర్కెలుండి, మరొకరికి 'సహజంగా సెక్స్'సాగాలన్న ఆలోచన వుంటే ఆ జంటల దాంపత్యజీవితంలోనే కాదు ఇతరత్రా కూడా సమస్యలు తప్పవు.

సెక్స్ గురించి సరైన అవగాహన లేనివారే సెక్స్‌ని సహజం, అసహజం అంటూ రెండు రకాలుగా విభజించి సహజానికి రాజీ, అసహజానికి దూరం అంటారు. కాని వాస్తవంలో సెక్స్‌లో సహజం, అసహజం అనేది లేనేలేదు. ఫలానా భంగిమ సహజమైనది, మిగిలిన భంగిమలన్నీ అర్థంలేనివి, అసహజమైనవి అనుకోవటం చాలా పొరపాటు.

జంటగా అనుభవించి, ఆనందం, తృప్తి పొందగలిగినది సెక్స్. సెక్స్ శారీరకపరమయినది మాత్రమే కాదు మానసికపరమైనది.కాబట్టి మానసికంగా సహజ అసహజ అనే రెండుగా విడగొట్టిన సెక్స్ ఆలోచనలను పక్కకు నెట్టివేయాలి.

ఇద్దరికీ ఎలా నచ్చితే అలా సెక్స్‌లో పాల్గొనవచ్చు. ఆ పాల్గొనేదానిలో అసహ్యించుకోదగినవి ఏవీ వుండవు. ఒకవేళ ఒకరికి కొన్ని అంశాలలో వ్యతిరేకభావం వున్నా రెండవవారికోసం వాటిని వదిలించుకుని సహకరించటం అవసరం. 'సాధారణం' అనేది ఎప్పుడు ఎవరో ఏర్పరిచిన అర్థంలేని ఆలోచన.అటువంటి ఆలోచనలు అనేకం గతంలో వున్న వాటిని ధిక్కరించింది ఈ సమాజం.

రజస్వలకాకుండానే పెళ్ళిచేయటం ఒక సాంప్రదాయం. ఆ తర్వాత టీనేజ్ పెళ్ళిళ్ళు వచ్చాయి. ఒకప్పుడు భార్యాభర్తల కబుర్లమీద ఆంక్షలుండేవి. కుటుంబ నియంత్రణను వ్యతిరేకించారు. నేటి అమ్మాయిలు, అబ్బాయిలు వాటినన్నింటినీ కాదని ముందుకు వచ్చారు.

పెళ్ళిపైవున్న పాత ఆంక్షలన్నింటినీ నేటిసమాజం తోసిపుచ్చింది. అంతమాత్రంచేత నేటి పాతికేళ్ళ తర్వాత పెళ్ళి 'అసహజం' కిందికి రాదుకదా! అదే సెక్స్‌కి వర్తిస్తుంది. ఇందులో అసహజ సెక్స్ అనేది లేదు. సహజం, అసహజం అనేవి సెక్సీ అంశాలకు అంటనటువంటిది.ఎలా చేస్తే రెండవవారికి ఇష్టమో అలా చెయ్యటమే సహజత్వం.

ఒక రాత్రి ఒకరి పద్ధతిలో జరిగితే మరొకరాత్రి రెండవవారి ఇష్టం ప్రకారం సాగితీరాలి.

అప్పుడే ఇద్దరికీ సంతృప్తి కల్గుతుంది. సెక్స్‌లో పాల్గొన్న వారిద్దరూ సమఉజ్జీలుగా 'పోరాటం' చేసి ఫలితాన్ని ఇద్దరికీ తృప్తి కలిగించేలా పంచుకోవటమే అసలు సిసలు సెక్స్ సహజత్వం. ◆





## డా॥జి. సమరం

గర్భాశయంలో ఫైబ్రాయిడ్స్, ఎండోమెట్రియోసిస్ వంటి పరిస్థితులు ఉన్నప్పుడు కూడా సంభోగంలో పాల్గొన్నప్పుడు నొప్పి అనిపిస్తుంది.యాంగ్జైటి,టెన్షన్, స్ట్రెస్, ఫోర్స్‌బుల్ సెక్స్ వంటి మానసిక పరిస్థితుల్లో కూడా సంభోగంలో నొప్పి అనిపించవచ్చు.

మీ విషయంలో ఇన్‌ఫెక్షన్ కారణం కావచ్చు. స్త్రీలల్లో మర్మావయాలకి సంబంధించిన ఇన్‌ఫెక్షన్లు చాలా సహజం. డాక్టర్‌కి చూపించుకోవడానికి సిగ్గు పడనవసరంలేదు. డాక్టర్‌కి చూపించి మందులు వాడండి. మీ బాధలు తేలికగా తగ్గిపోతాయి.

జె.కె. నంద్యాల

*నా వయస్సు 45 సంవత్సరాలు. అప్పుడే తొంటి కీలు నొప్పి, మోకాలు కీళ్ళనొప్పి వచ్చేశాయి. కీళ్ళ నొప్పులు వచ్చినాసెక్స్ కోరికలు తగ్గలేదు. కాని కీళ్ళ నొప్పులవల్ల సెక్స్‌లో పాల్గొనడం కష్టమవుతోంది.*

*నొప్పి అనిపించగానే ఇక సెక్స్ కొనసాగించలేక మధ్యలో విరమించుకోవలసివస్తోంది. దానివల్ల చాలా అసంతృప్తి కలుగుతోంది. కీళ్ళ నొప్పులు ఉన్నవాళ్ళు సెక్స్‌కి దూరం కావలసిందేనా?*

కీళ్ళనొప్పులు ఉన్నవాళ్ళు సెక్స్‌కి దూరం కానవసరంలేదు. కీళ్ళనొప్పులకి మందులు వాడటం ద్వారా, ఫిజియోథెరపీ ద్వారా చాలావరకు ఉపశాంతి పొందవచ్చు మందులు వాడకపోయినప్పటికీ, ఫిజియోథెరపీ చేయించుకోనప్పటికీ కొన్ని ప్రత్యేక రతిభంగిమల ద్వారా సెక్స్‌ని చక్కగాఎంజాయ్ చేయవచ్చు.

కీళ్ళనొప్పులు పురుషునికి ఉన్నప్పటికీ లేదా స్త్రీలకి ఉన్నప్పటికీ ఎవరూ సెక్స్‌కి దూరం కానవసరంలేదు. దాదాపు అరవై రకాల రతి భంగిమలున్నాయి. వాటి గురించి కాస్త అవగాహన కలిగించుకుంటే వారి వారి వీలునుబట్టి ఆ రతిభంగిమలద్వారా సెక్స్‌ఎంజాయ్‌చేయవచ్చు.

ఎమ్.డి. రాజోలు

*మా పెళ్ళి అయ్యి నాలుగు సంవత్సరాలైంది. వెంటనే పిల్లలు వద్దని ఇంతవరకు నిరోధ్‌వాడుతూ వచ్చాము.వింతేమిటంటే ఈ నాలుగు సంవత్సరాల్లో మా ఆయనకి బట్టతల వచ్చేసింది.*

*ఇప్పుడు నాకు కడుపు వస్తే నాకు మగపిల్లవాడు పుడితే వాడికి కూడా బట్టతల వస్తుందా? ఎందుకంటే మావారికే కాదు మా మామగారికి కూడా బట్టతల ఉంది. మగపిల్లవాడు కాకుండా ఆడపిల్ల పుడితే బట్టతల వస్తుందా, రాదా? బట్టతల రాకుండా ముందు తీసుకునే జాగ్రత్తలు ఏమైనా ఉన్నాయా?*

బట్టతల సాధారణంగా వంశపారంపర్యంగా వచ్చే లక్షణం. మగవాళ్ళకి సంక్రమించే క్రోమోజోమ్స్‌లో బట్టతలకి సంబంధించిన జీన్స్ ఉంటాయి.

ఇవి మగ వాళ్ళల్లో తేలికగా ప్రభావం చూపిస్తాయి. ఆడవాళ్ళల్లో ఈ జీన్స్ ప్రభావం చూపించడం తక్కువ. అందుకనే ఆడవాళ్ళల్లో బట్టతల కనపడదు. బట్టతల రాకుండా ముందుగా తీసుకునే జాగ్రత్తలు ఏమీలేవు. మీరు ఎటువంటి ఆందోళనకర ఆలోచనలు పెట్టుకోకుండా పిల్లలని కనండి.

బట్టతల ఆలోచన పక్కన పెట్టండి.

Courtesy : MAXIM

సీరియల్

"యువరాణీ.. అమ్మా యువరాణీ" అంటూ ప్రధాన పరిచారిక వణుకుతున్న చేత్తో తట్టి పిలిచింది. బదులుగా "ఊ" అంటూ ఇటు నుంచి అటుదొర్లింది యువరాణి. మంచానపడి మూడుమాసాలవుతోంది.

ఇంతవరకు ఉలుకూపలుకూ లేకుండా కోమాలో పడుందామె. అలాంటి యువరాణిలో చలనం వచ్చిందంటే కోమానుంచి బయటపడుతున్నట్టే. పరిచారికలకు ధైర్యం చిక్కింది.ఒక నర్సు యువరాణి చేయి అందుకుని చూసింది. నాడి కాస్త వేగంగా కొట్టుకుంటోంది. చిరుచెమటలు పోస్తున్నాయి.

# మనిషిలో మనిషి



శరీర ఉష్ణోగ్రత నార్మల్ స్థితికి వస్తోంది. వెంటనే ఈ విషయం చెప్పటానికి ఇద్దరు పరిచారికలు రాజా వారి మందిరానికి పరుగుతీశారు.

ఇంతలో ఓసారి పొడిగా దగ్గి-చిన్నగా కనురెప్పలు ఎత్తి చూసింది యువరాణి. "చాలా ఆకలిగా ఉంది. తినడానికి ఏమన్నా ఇవ్వండి" అడిగింది. నూతిలోంచి వస్తున్నట్టు చాలా చిన్నగా ఉంది ఆమె స్వరం.

ఆమెను లేపి తలదిండ్లకు ఆన్చి కూర్చోబెట్టారు. వెంటనే అప్పటికప్పుడు తీసిన తాజా బత్తాయిరసం తాగించారు. ఇంతలో తన వయసునుకూడా మర్చిపోయి అంతఃపురంలోకి పరుగు పరుగున వచ్చారు రాజా విష్ణు చంద్ర గజపతి మహదేవ్.



E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్‌మోహనరావు

తల దిళ్ళకు ఆనుకుని కూర్చున్న కుమార్తెను చూడగానే ఆ తండ్రి హృదయము ఆనందంతో ఉప్పొంగింది.

తండ్రిని చూడగానే గుర్తుపట్టింది సంజనా. శక్తినంతా కూడదీసుకుని పాన్పుదిగి రెండడుగులు ముందుకేసి తూలిపడిపోయింది. అంతే ఒక్కదూకులో దూసుకెళ్ళి కుమార్తెను పడిపోకుండా ఒడిసిపట్టుకున్నారు రాజావారు. పసిబిడ్డను అక్కున చేర్చుకున్నట్టు కౌగిట చేర్చుకుని ప్రేమగా నుదురు ముద్దాడారు.

"డాడీ... నాకేమైంది?" అని అడుగుతోందిగాని గొంతు దాటి మాట బయటికి రావటంలేదు.

ఇరువురి కనులూ అశ్రుపూరితాలయ్యాయి.

"నా తల్లీ. మా బంగారం.నిన్ను మళ్ళీ ఇలా చూస్తాననుకోలేదమ్మా. దేవుడు దయ చూపాడు.

కార్తీ తన మాట నిలబెట్టుకున్నాడు. నిన్ను మళ్ళీ మనిషిలా చూడగలుగుతున్నాను..." అంటూ ఆనందంతో అంతటి రాజావారే చిన్నగా ఏడ్చేశారు.

### జరిగిన కథ (32)

సాధూబాయ్ వేషంలో వచ్చినవాడు ఎప్పుడొస్తాడా అని ఎదురుచూస్తుంటుంది సుదీప. జ్వాలాముఖిచుట్టూ ఎగురుతూ రహస్య బిల మార్గం ఎక్కడ వుందా అని వెదకడం మొదలు పెడతాడు కార్తికేయ.

రాకుమారి మేఘనా సౌందర్యానందసహనా దేవిమీద ప్రాచీన ప్రాణ నిక్షిప్త క్షుద్ర విద్యను ప్రయోగిస్తాడు మాంత్రికుడు మంత్రవాది భైరవేశ్వర్. ఆమె ప్రాణాన్ని పట్టుపురుగు రూపములో ఉంచి నికరాగ్వా దేశంలో వున్న ఒక బిలమార్గం సొరంగంలో దాచిపెడతాడు.

పరకాయప్రవేశ విద్యద్వారా కొంగరూపంలో ఉన్న కార్తికేయ ఆ బిల మార్గాన్ని కనుగొని ఆ పట్టుపురుగుని బద్దలుకొడతాడు. అలా బద్దలుకొట్టిన మరుక్షణం కోమాలో ప్యాలెస్‌లో ఉన్న సహనా దేవి ఒక్కసారిగా ఉలిక్కిపడి లేస్తుంది. పరిచారికలంతా ఆశ్చర్యపోతారు.

తను మంత్రించిన క్షుద్రవిద్య వికటించేసరికి ఆ శక్తులు మంత్రవాది భైరవేశ్వరుడి ప్రాణం తీస్తాయి. కొంగ రూపంలో ఉన్న కార్తికేయ పక్షి శరీరంలోకి ప్రవేశిస్తాడు. ఇక చదవండి.



యువరాణి కూడా దుఃఖిస్తోంది. తండ్రీ-కూతుళ్ళను చూస్తున్న అందరి కళ్ళలో నీరు నిలిచింది.

సంజనా కనులు ఎవరికోసమో ఆత్రంగా వెదుకుతున్నాయి. ఈ లోపల - "ప్రభూ యువరాణీవారు చాలా బలహీనంగా ఉన్నారు. మీరు ఇలా దుఃఖించకూడదు ప్లీజ్" అంటూ హెచ్చరించిందో నర్సు.

అప్పటికి కర్తవ్యం గుర్తొచ్చింది రాజావారికి. కుమార్తెను తలదిళ్ళకు ఆన్చి జాగ్రత్తగా బెడ్‌మీద కూర్చోబెట్టారు. సంతోషంలో కొత్తశక్తి, ఉత్సాహం వచ్చేశాయి రాజావారికి. ఫోన్ అందుకుని గతంలో యువరాణికి ట్రీట్‌మెంట్ చేసిన అరడజనుమంది డాక్టర్లకు ఫోన్లుకొట్టి విషయం చెప్పారు రాజావారు.

అలాగే ప్యాలెస్ బయట మిలటరీ మేజర్‌కి ఫోన్ చేసి డాక్టర్లు రాగానే లోనకు పంపించమని ఆర్డర్ వేశారు. "డాడీ... నాకు ఏమయింది?" ఎలాగో నోరు పెకల్చి హీనస్వరంతో అడిగింది సంజనా.

"ఏంకాలేదు తల్లీ. నీరసించావు అంతే. త్వరలోనే కోలుకుంటావు" అని పక్కన కూర్చుని ప్రేమగా తలనిమురుతూ చెప్పారు.

"లేదు... ఏదో జరిగింది... మీరేదో దాస్తున్నారు" అంది ముఖంలోకి చూస్తూ.

"లేదంటున్నాగా. ఇప్పుడు నువ్వు ఎక్కువగా ఆలోచించకూడదు" అన్నారు.

"బావ... బావ కార్తీ ఎక్కడ?"

ఈ ప్రశ్న ఎదురుచూసిందే కాని తనకు మాత్రం ఏం తెలుసు. ఈ మూడు మాసాలు ఎక్కడున్నాడో ఎన్ని అవస్థలు పడుతున్నాడో కనీసం ఇంతవరకు ఫోన్‌కూడా చేయలేదు. ఏం చెప్పగలడు?

"వస్తాడమ్మా... నువ్వు త్వరగా కోలుకోవాలని నీ పనిమీదే వెళ్ళాడు. వచ్చేస్తాడు. ఇక భయం లేదు. బావ వచ్చేసరికి నువ్వు లేడిపిల్లలా చెంగుచెంగున ఎదురువెళ్ళాలి. ప్రశాంతంగా ఉండు" కూతురికి ధైర్యం చెప్తున్నారుగాని ఈ మధ్య కాలంలో జరిగిన విశేషాలేమీ చెప్పలేదు రాజావారు.

యువరాణి కోమాలోకి వెళ్ళిపోయాకే హంతకులు తమ రాజగురువు కృష్ణశాస్త్రిని తన బావమరిది సూర్యప్రకాశవర్మను దారుణంగా హత్యచేశారు.

హత్యానేరం కింద కార్తికేయ అరెస్టయి జైలు నుంచి తప్పించుకుని పారిపోయాడు. ప్యాలెస్‌ను మిలటరీ ప్రొటెక్షన్‌లోకి మార్చారు. ఈమధ్యే తనను హత్య చేయవచ్చిన ఇద్దరు హంతకులు చిక్కారు.

అన్నిటికీ మించి తన తండ్రిగారు వ్రాయించిన వీలునామా. దానిగురించి యువరాణికి ఇంతవరకు తెలీదు. ఈ మొత్తం వ్యవహారంలో సూత్రధారి ద్రోహి కుమారశక్తి పీఠాధిపతి స్వామి సత్యానంద.

ఇవేమీ కుమార్తెకు చెప్పకుండా దాచారు రాజావారు. ఆమె ఆరోగ్యం పూర్తిగా కోలుకునేవరకు చెప్పకూడదని నిర్ణయించుకున్నారు. ఈ లోపల ఏదో రోజు కార్తికేయ నుంచి ఫోన్ వస్తుందని, త్వరలో వచ్చేస్తాడన్న నమ్మకంతో ఉన్నారు.

స్వాతి సపరివార పత్రిక 29.6.2018



## దానగుణం

ఛారిటీ కార్యక్రమాల్లో జోరుగా పాల్గొంటున్నది బాలీవుడ్ బ్యూటీ శ్రద్ధాకపూర్. ప్రతి ఒక్కరూ కూడా ఎంతో కొంత తిరిగి ఇవ్వగల దానగుణాన్ని అలవరుచుకోవాలని హితవు చెపుతున్నది.

"ప్రతి ఒక్కరూ తమకు తోచినంతలో అవసరమయినవారికి సాయం అందించాలి. నేను ఈసారి బోలెడన్ని దుస్తులు డొనేట్ చేస్తున్నాను.

మనం సెలబ్రిటీలమా? ధనిక కుటుంబం నుంచి వచ్చామా? అన్నది ముఖ్యం కాదు. మనవంతు సాయాన్ని ఇతరులకు అందించడం ముఖ్యం" అంటున్నది శ్రద్ధాకపూర్.

ఇంతలో అరడజనుమంది డాక్టర్లతో కూడిన వైద్య బృందం బిలబిలా అంతఃపురంలోకొచ్చేసింది. వారిలో ఇద్దరు లేడీ డాక్టర్‌లు కూడా ఉన్నారు తలదిండ్లను అనుకుని కూర్చోగలుగుతున్న రాకుమారిని చూసి వాళ్ళంతా ఆశ్చర్యచకితులయ్యారు.

వచ్చిన డాక్టర్లంతా సామాన్యులు కారు. ఒక్కో రంగంలో ఉద్దండులు ఒకరు నరాల స్పెషలిస్టు. ఒకరు ఎముకల స్పెషలిస్టు. ఒకరు హార్ట్ స్పెషలిస్టు. ఇలా గొప్ప డాక్టర్లైవుండి కూడా గతంలో కోమాలోని రాకుమారికి ఏ ట్రీట్‌మెంట్ లేదని చేతులెత్తేశారు.

అలాంటి యువతి లేచి కూర్చోగలగటం అందర్నీ విస్మయపరుస్తోంది. లేడీ డాక్టర్లు ఇద్దరూ సంజనాను ఖరోగా పరీక్షించి సంతృప్తిగా తలపంకించారు.

"ఇట్స్ ఎ మిరాకిల్. అద్భుతం. పరమాద్భుతం. కోమాలోకి వెళ్ళిపోయిన అమ్మాయి కేవలం శరీరానికి అందిస్తున్న ద్రవాహారంతో ప్రాణాలు నిలుపుకుని ఏ ట్రీట్‌మెంటూ లేకుండా తిరిగి నార్మల్ స్టేజ్‌కి రావటం చాలా వింత" అంటూ కామెంట్ చేశాడో డాక్టరు.

"ఈ వింతల గురించి మాకు తెలియదు డాక్టర్..." అన్నారు నవ్వుతూ రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్.

"ఎందుకంటే వైద్యశాస్త్రపరిధిలోకి రాని వింత రోగాలు కొన్ని ఉంటాయి. వాటిగురించి చెప్పినా మీకు అర్థంకాదు. మూఢనమ్మకాలని కొట్టిపారేస్తారు.

"ఇప్పుడు మాక్కావలసింది మీ ఆశ్చర్యాలు అనవసర చర్చలుకాదు. మీరేంచేస్తారో నాకు తెలీదు. వారం తిరిగేలోపల మా అమ్మాయి సంపూర్ణ ఆరోగ్యంతో ఎప్పటిలా తిరగాలి. ఎంత ఖర్చయినా ఫరవాలేదు. అందుకు ఏంకావాలో ఏం ట్రీట్‌మెంట్ ఇవ్వాలో దాని గురించి ఆలోచించండి" అంటూ హెచ్చరించారు.

నికరాగ్వా దేశం.

మసాయా ఓల్కానో ప్రాంతం.

బిలమార్గంలో లియోపక్షి కాలిపోతూండగానే తన పరకాయప్రవేశ విద్యతో వెనక్కి వచ్చి కొమ్మలమీది కొంగ శరీరంలో తిరిగి ప్రవేశించాడు కార్తికేయ.

అంతవరకు తల వాడవుగా వేలాడవేసి చచ్చి పడున్న కొంగలో చలనం ఏర్పడింది. మెడ వెనక్కి తీసుకుని కొమ్మమీద లేచి నిలబడింది. మెడ పొడవుగా చాపి ఆకాశంవంక చూస్తూ ఆనందంతో 'క్వాక్... క్వాక్' అంటూ రెండుసార్లు పెద్దగా అరిచింది.

కొంగ శరీరంలోని కార్తికేయకు చాలా సంతోషంగా ఉందిప్పుడు. శ్రమపడి ఇంతదూరం వచ్చినందుకు వచ్చిన రెండుపనులూ విజయవంతంగా పూర్తయ్యాయి. తనను అంతం చేయించాలని చూసిన మాఫియా కింగ్‌ని అంతం చేయగలిగాడు.

కొలంబియాలో వాడి మాఫియా సామ్రాజ్యాన్ని కూల్చేశాడు. తన ప్రాణసఖి మరదలు సంజనా ప్రాణశక్తిని నిక్షిప్తం చేసి పట్టుపురుగు రూపంలో బంధించిన మసాయా జ్వాలాముఖి రహస్య నరకద్వారంలో ఉంచిన మంత్రనిర్మిత గాజుపంజరాన్ని నాశనం చేసి ఆమెకు విముక్తి కలిగించాడు.

ప్రాణశక్తి తిరిగి స్వశరీరానికి చేరగానే ఇంతవరకు చైతన్య రహితంగా ఆమెలో నిద్రాణమైవున్న ఆత్మకు తిరిగి చైతన్యం వచ్చి కోమానుంచి బయటపడుతుంది. ఎప్పటిలా లేచి తిరగగలుగుతుంది. ఇక సంజనా గురించిన ఏ చింతా లేదు.

అలాగే మంత్రనిర్మిత గాజుపంజరం ధ్వంసం కాగానే ప్రయోగం తిప్పికొట్టబడి, ఇంతకాలం పంజరాన్ని కాచి వున్న ఉగ్రశక్తులు వెనక్కివెళ్ళి మంత్రవాది భైరవేశ్వర్‌మీద దాడిచేస్తాయి. వాడి వేలితో వాడి కన్నే పొడుచుకున్నట్టు ఆ నీచుడు ఈపాటికే నెత్తురు కక్కుకుని కుక్కచావు చస్తాడు.

కాబట్టి- ఈ రెండు పనులు పూర్తిగావటంతో ఇక ఇక్కడ తనకు పనిలేదు. ఎంత త్వరగా ఇండియా చేరుకోగలిగితే అంత మంచిది. అక్కడ చాలా పనులు అలాగే ఉండిపోయాయి. త్వరగా వెళ్ళిపోవాలి. కాని ఎలా? ఎలాగన్న ప్రశ్నతోనే అదంత సులువుకాదన్న సంశయం కూడా ధ్వనిస్తోంది. తిరిగివెళ్ళటం వచ్చినంత సులువుకాదనిపిస్తోంది.

అవును. అప్పుడంటే సాదూభాయ్ శరీరాన్ని ఒక ఉపకరణంలా వాడుకొని అతడి పాస్‌పోర్ట్‌తో సులువుగానే ఇక్కడికొచ్చి ఇదంతా చేయగలిగాడు. ఇప్పుడు తిరిగివెళ్ళటానికి సాదూభాయ్ లేడు. ఈ కొంగ శరీరంతప్ప తనవద్ద మరో మార్గంలేదు. వెళ్ళాల్సిన దూరమేమో వేల కిలోమీటర్‌లు ఉంది. ఏం చేయాలి. ఏంచేస్తే త్వరగా స్వదేశం చేరగలడు?

ఎంత ఆలోచించినా తనకో దారి కన్పించటం లేదు. అలాగని ఇక్కడే కూర్చుంటే పనులు కావు. గురుదేవుడు మణిసిద్ధులవారు ఏదో మార్గం చూపక పోరు. ఇక బయలుదేరటం మంచిది. పడ్డ శ్రమకు ఆకలి విపరీతంగా వేస్తోంది.

ముందుగా ఆహారాన్వేషణ, ఆ తర్వాతే ప్రయాణపు ఆలోచన. మరోసారి మెడచాపి 'క్వాక్' అంటూ పెద్దగా అరిచి రెక్కలుచాపి రివ్వున గగనవీధికి ఎగిరాడు బకరూపుడు కార్తికేయ. మసాయా జ్వాలాముఖి లోతుల్లో ఎక్కడినుంచో 'ఖణేల్ ఖణేల్'మంటూ ప్రేలుడు శబ్దాలు వినిపించాయి.

ఎందుకో ఉగ్రరూపంతో నిప్పుల సెగలు గక్కుతోంది అగ్నిపర్వతం. రెక్కలు చాపి గ్లైడర్‌లా ఎగురుతూ అవుటర్ సర్కిల్‌మీదుగా జ్వాలాముఖిని ఓ రౌండ్‌చుట్టివచ్చాక అక్కడ్నుంచి బయల్దేరి దూరంగా కన్పిస్తున్న పంటపొలాలవైపు ప్రయాణించింది.

అప్పటికే కొన్ని కొంగలు పొలాల మధ్య తిరుగుతూ ఆహారాన్వేషణలో ఉన్నాయి. తనూ వాటి సమీపంలో అటూ ఇటూ ఎగిరే మిడతల వెంట పరుగు తీస్తూ మధ్యాహ్న సమయంవరకు తిరిగి కడుపు నింపుకుంది. ఇక చాలు అనుకున్నాక తిరిగి ఆకాశానికి ఎగిరింది. ఒక్క అవకాశం, ఏదోక అవకాశం దొరక్కపోతుందా అన్న ఆశతో దూరంగా వున్న నగర సమీపంలోని విమానాశ్రయంవైపు సాగిపోయింది.

పర్లాకిమిడి రాజావారి ప్యాలెస్. ఎప్పటిలాగే ఆ రోజూ తెల్లవారింది. రాకుమారి కోమా స్టేజినుంచి బయట



వ్యవసాయరంగంలో సంక్షోభానికి పెరుగుతున్న పెట్రోల్, డీజిల్ ధరలు కూడా కారణం అవవచ్చు.

-హర్సిమ్రత్ కౌర్, కేంద్రమంత్రి



> ఎంతటి కఠిన సమస్యనైనా చర్చలతో పరిష్కరించుకోగలనన్న నమ్మకం నాకు వుంది.
> -రజనీకాంత్, నటుడు

పడి పది రోజులయింది. ఒక మొక్కకు ఎరువేసి నీరుపోసి శ్రద్ధచేస్తుంటే అది నవనవలాడుతూ ఏపుగా ఏవిధంగా పెరుగుతుందో అలా వైద్యుల కృషి ఫలితంగా యువరాణి రోజురోజుకూ శక్తి పుంజుకుని త్వరగా కోలుకుంటోంది.

చక్కనమ్మ చిక్కినా అందమే అన్నట్టు ఇంకా పూర్తిస్థాయిలో యధాపూర్వస్థితికి బలం చేరకపోయినా ఎప్పటి అందచందాలు రూపుదిద్దుకుని సౌందర్య ప్రభలా ఉంది.అయితే యువరాణి శారీరకంగా కోలుకుంటున్నప్పటికీ మానసికంగా ఇదివరకటి ఉత్సాహం, సంతోషం ఆమెలో కన్పించటంలేదు.

అందుకు ప్రధాన కారణాలు రెండు. వాటిలో మొదటిది బావ. తన ప్రాణంలో ప్రాణమైన కార్తికేయమీది బెంగ. ఎక్కడికెళ్ళాడు, ఏమయ్యాడు, ఎప్పటికొస్తాడు ఏమీ తెలీకపోవటంతో అతడికోసం దిగులుచెందుతోంది. రెండో కారణం ఏమంటే జరిగిన విషయాలేవీ కుమార్తెకు తెలీకుండా చాలా జాగ్రత్తలు తీసుకున్నారు రాజావారు.

అయినప్పటికీ క్యాలెండర్‌లో తేదీలనుబట్టి తను మూడుమాసాలుగా కోమాలోనే ఉన్నట్టు ఒకరు చెప్పకుండానే గ్రహించగల్గింది సంజనా. ఆ మధ్యకాలంలో ఏం జరిగిందన్నది అంతుచిక్కటంలేదు ఆమెకు.

పరిచారికలు నమ్మకమైనవాళ్ళైనా పెదవి విప్పటంలేదు. తమ రాజగురువు ప్యాలెస్‌లో పెద్దదిక్కుగా ఉండే ప్రముఖ జ్యోతిష శాస్త్రవేత్త కృష్ణశాస్త్రిగారు కన్పించటంలేదు. ఎప్పుడూ ప్యాలెస్‌ను కనిపెట్టుకునివుండే తన మేనమామ సూర్యప్రకాశవర్మగారూ కనిపించటం లేదు.

ప్యాలెస్ సెక్యూరిటీ సిబ్బందంతా ఏమయ్యారు. మిలిటరీ ప్రొటెక్షన్ ఎందుకు అవసరమయింది. ఏ విషయం తెలీక పిచ్చిపట్టినట్టుంది.

తండ్రిగారు రాజావారిని అడిగితే ఏదో మిషతో విషయాన్ని దాటవేసి తప్పించుకుంటున్నారు.

ఈ పరిస్థితిలో ఎలాగయినా తండ్రిగారినడిగి విషయం తెలుసుకుతీరాలన్న పట్టుదలతో ఉంది రాకుమారి. ఈ పదిరోజుల్లోనూ అంతఃపురానికే పరిమితమైన మేఘనా సౌందర్యానంద సహనాదేవి తొలిసారిగా తండ్రి రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ గారి మందిరానికి బయలుదేరింది.

ఈ పదిరోజుల్లోనూ ఏంజరిగిందో తెలీక కొట్టుమిట్టాడుతున్న ప్రాణి మరొకటుంది. అది ఎవరోకాదు, కుమారశక్తి పీఠాధిపతి స్వామి సత్యానంద.

వేలంచేరిలో మంత్రవాది భైరవేశ్వర్ అకాల మరణముతో దిక్కుతోచని పరిస్థితి అతడిది. అసలేం జరిగింది. ఎలా జరిగింది అన్నది అంతుచిక్కటంలేదు. అతడు సాధారణ చావు చస్తే పట్టించుకునేవాడు కాదేమో. కాని వాడు చచ్చింది భయంకరమైనచావు. కుక్కచావు.నవరంధ్రాలనుంచి నెత్తురు కక్కుకుని దారుణంగా మరణించాట్ట.

అంటే ఖచ్చితంగా అతడి ప్రయోగం తిప్పికొట్టబడి తన మంత్రశక్తులకు తనే బలైపోయాడు. డౌటే లేదు. కాని ఇక్కడ సమస్య ఏమంటే ఏ ప్రయోగం దెబ్బతీసిందో అర్థంగావటంలేదు.

భైరవేశ్వర్ పురాతన అతిప్రమాదకరమైన క్షుద్రవిద్యా ప్రయోగంలో గొప్ప మాంత్రికుడు. డబ్బుకోసం ఆశపడి తనకు పనిచేసినట్టే చాలామందికి ఇలాంటి వెధవపనులు చేసుంటాడు. వారిలో ఏ ప్రయోగందెబ్బ తీసిందన్నది ఊహించలేక కిందామీదా పడ్తున్నాడు.

పర్లాకిమిడి సంస్థానంలో మరణశయ్యమీది రాకుమారి లేచి తిరుగుతోందంటే ఈ ప్రయోగమే విఫలమైందని అనుకోవచ్చు. కాని సంస్థానంలో సంగతులేవీ బయటికి తెలిసే అవకాశం లేకుండాపోయింది. భైరవేశ్వర్ పోయిన రోజు ఉదయం ఎనిమిదిగంటలకే అతడి శిష్యులు ఫోన్‌చేసి జరిగింది స్వామి సత్యానందతో చెప్పారు. విని షాక్‌తో స్థాణువైపోయాడు. నోటినుంచి మాట పెగల్లేదు.

తను వేలంచేరి వెళితే నలుగురికీ తెల్సిపోతుందన్న భయంతో తన శిష్యుల్లో నమ్మకమైన ఇద్దర్ని వేలంచేరి పంపించాడు. వాళ్ళు వేలంచేరి వెళ్ళి భైరవేశ్వర్ అంతిమ సంస్కారాలవరకు ఉండి వెనక్కివచ్చేశారు. వచ్చి కొత్తగా చెప్పింది కూడా ఏమీలేదు.

భైరవేశ్వర్ వేకువ పూజలో ఉండగా భయంతో చావుకేకలు వేస్తూ నెత్తురు కక్కుకుని చచ్చాడని చెప్పారు. భైరవేశ్వర్‌కు ఫ్యామిలీ ఉంది. ఇద్దరు కొడుకులు ఒక కూతురు ఉన్నారు. బాగా చదువుకుని పెళ్ళిళ్ళుచేసుకుని మంచి ఉద్యోగాల్లో సెటిలయ్యారు. తలోచోట ఉన్నారు. తండ్రి వృత్తి వాళ్ళకు అంటలేదు. తండ్రి సంపాదించిన ఆస్తులు బాగానే ముట్టాయి.

అతడి భార్య పదేళ్ళ కిందటే కాలం చేసింది. కాబట్టి తను భైరవేశ్వర్ ద్వారా చేయించిన ప్రయోగం విఫలమై రాకుమారి బ్రతికిందేమోనన్న సందేహం అనుక్షణం పీడిస్తోంది స్వామి సత్యానంద్‌ని. సంస్థానంమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు.

ఎన్నో స్కెచ్‌లు వేసి తన చేతికి మట్టి అంటకుండా రాకుమారిని అంతం చేసి సంస్థానాన్ని ఆక్రమించాలని కలలు కన్నాడు.

రాకుమారి బ్రతికితే అంతా బూడిదలో పోసిన పన్నీరయిపోతుంది. అందుకే భయపడుతున్నాడు. ప్యాలెస్‌లో సంగతులు తెలుసుకోవాలని చాలా ప్రయత్నాలు చేసి విఫలమయ్యాకే ఇక నేరుగా ఫోన్ చేసి రాజావారినే అడగాలని నిశ్చయించుకున్నాడు.

కాని ఏ ముఖం పెట్టుకుని ఫోన్ చేయాలి? అన్నిసార్లు ఆయన ఫోన్‌చేసినా తను ఏదో సాకుతో పర్లాకిమిడి వెళ్ళకుండా తప్పించుకుంటూవచ్చాడు.

రాజావారిని చంపమని తను పంపించిన వెధవలిద్దరూ పట్టుబడి అరెస్టయి జైల్లో ఉన్నారు. వాళ్ళు తన పేరు బయటపెట్టకుండా మాట నిలుపుకున్నారు. లేదంటే తనూ వాళ్ళపక్కన జైల్లో కూర్చుని చిప్పకూడు తినాల్సివచ్చేది. అందుకే ఫోన్ చేద్దామంటే సత్యానంద్‌కు ముఖం చెల్లటంలేదు. అయినా తప్పదు.

## చెప్పాలంటే భయం

నటిగా ఎదగాలనుకునే అమ్మాయిలకు పరిశ్రమలో ఏదోక దశలో వేధింపులు ఎదురవుతుంటాయని, కాని బాలీవుడ్‌లో పరిశ్రమపై విమర్శలుచేసే ధైర్యం ఎవ్వరూ చేయరని అంటున్నది పంజాబీ పాప తాప్సీ. "పరిశ్రమలో తారలుగా అడుగుపెట్టే వారిలో చాలామందికి సినీ నేపథ్యం ఉండదు.

వాళ్ళలో అనేకమంది పరిశ్రమలో ఎటువంటివేధింపులు భరించాల్సివస్తుందోనని సందేహాలు వ్యక్తం చేస్తుంటారు. కాని, వాటిని ఓపెన్‌గా చెప్పలేరు.

అలా చేస్తే కెరీర్‌కు విఘాతం కలుగుతుందనే భయం ఉంటుంది కదా. నాకైతే అటువంటివి ఏవీ ఎదురవలేదు. ఒకవేళ ఉంటే చెప్పేసేదాన్నే" అంటున్నది తాప్సీ.



# చిలిపి



**తొందరగా 'ప్రొఫెసర్' అని పిలిపించుకోవడానికి మార్గం?**
ఇంద్రజాలం నేర్చుకుని ప్రదర్శనలివ్వడం!

**జైలు అధికారి కామెంట్ ప్లీజ్?**
ఎంతోమంది ఖైదీలు వచ్చిపోతున్నా జీవితాంతం జైలులో ఖైదీలా ఉండేవాడు.

**రేడియోలో ప్రసార విశేషాలెందుకు చెబుతారు?**
రేడియోను ఎప్పుడెప్పుడు ఆపుచేసుకో వచ్చో ముందుగా తెలియజెప్పేందుకు.

**'బ్రహ్మచారి' కామెంట్ ప్లీజ్?**
పక్కమీంచి నిద్ర లేచినప్పుడు ఏవైపునుంచయినా దిగడానికి అవకాశము ఉన్నవాడు!

**ఇంతకీ బస్ యాక్సిడెంట్ ఎలా అయిందండీ?**
వేగం, ప్రమాదము అన్న బోర్డుకు గుద్దుకొని.

**మన కాలేజీకి రాఖీనాడు సెలవు ఎందుకిస్తారు?**
కాలేజీ విద్యార్థినులందరూ విద్యార్థులకు రాఖీ కట్టేస్తారనే భయంచేత.

**హుండీలెందుకు?**
చెల్లని, 'నల్లని' నోట్లు వేసేందుకు!

**ఆడిటర్ కామెంట్ ప్లీజ్?**
అంకెల గారడీ చేయువాడు.

రాకుమారి మరణశయ్య దిగలేదని తెలిసేదాకా తనకు మనశ్శాంతి ఉండదు. ఇవన్నీ ఆలోచించాకే చివరికి శిష్యుడిచేత తన సెల్‌నుంచి రాజావారికి ఫోన్ చేయించాడు స్వామి సత్యానంద.

రాజా విష్ణుచంద్ర గజపతి మహాదేవ్ ప్రస్తుతం చాలా బిజీగా ఉంటున్నారు. తన బావమరిది సూర్యప్రకాశవర్మ బ్రతికున్నంతవరకు తమ ప్యాలెస్‌ను కనిపెట్టుకుని ఉండి ఆదాయ వ్యయాలంతా చూసుకునేప్పుడు తను విశ్రాంతిగా ఉండేవాడు.

కుమార్తె మంచానపడ్డం తన బావమరిదితోపాటు కృష్ణశాస్త్రిగారి హత్యలు మొదలయిన కారణాలతో దిగులుచెంది గడిచిన మూడు మాసాలూ ఏమీ పట్టించుకోలేదు.

ఇప్పుడు రాకుమారి ఆరోగ్యం కోలుకోవడంతో ఊపిరి తీసుకుని స్వయంగా తనే అన్నీ చూసుకుంటున్నారు.

లండన్‌లో ఉన్నట్టే ఇక్కడా ప్యాలెస్ కార్నర్‌లో ఓ ఆఫీసు ఉంది. అందులో అరడజనుమంది స్టాఫ్ పనిచేస్తున్నారు. వాళ్ళకి సూచనలు ఇవ్వటం వాళ్ళు పంపించే ఫైళ్ళను వెరిఫై చేయటంతోనే సరిపోతోందాయనకు.

ఆ రోజున కూడా తన మందిరంలో ఫైలు ముందేసుకుని చూస్తూండగా సడెన్‌గా డోర్ నెట్టుకుని విస విసా లోనకొస్తున్న కూతుర్ని చూసి ఒకింత ఆశ్చర్య పోయారు. "ఏంటమ్మా ఇది! నీ ఆరోగ్యం ఇంకా కోలుకోలేదు.అంతఃపురంవదిలిరావద్దని చెప్పాగదా.ఎందుకొచ్చావ్?" లాలనగా అడిగాడు ఫైల్‌మూస్తూ.

సంజనా మాట్లాడలేదు.రుసరుసలాడుతూ వచ్చి తండ్రి ఎదురుగా ఛైర్‌లో కూర్చుంది. ఆమె అలిగిందని అర్థమవుతోంది. "ఈ మౌనానికి అర్థం ఏమిటి? ఏమైంది తల్లీ. ఎవరిమీద కోపం?" అడిగారు.

"మీమీదే... అవును... మీమీదే చాలా కోపంగా ఉంది డాడీ" అన్నది. "నామీదా... ఏమైందని?"

"ఇంకా ఏం కావాలి... ఏ విషయం నాకు తెలియకుండా ఎందుకు దాస్తున్నారు?"

"నిశ్చింతగా ఉండమ్మా. అన్నీ సర్దుకుంటాయి... సమయం వచ్చినప్పుడు అంతా చెపుతా కదా" అన్నారు రాజావారు.

"ఆ సమయం ఇప్పుడొచ్చేసింది. ఇంకా ఓపిక పట్టడం నావల్లకాదు. నేను మూడుమాసాలుకోమాలో పడున్న సంగతి మీరు చెప్పలేదు.క్యాలెండర్‌లో డేట్లు చెప్పాయి. ఈ మూడుమాసాల్లో ఏం జరిగిందో నాకు తెలియాలి. మావయ్య సూర్యప్రకాశవర్మ, కృష్ణశాస్త్రి గార్లు కన్పించటంలేదు. వాళ్ళేమయ్యారు?

బావ కార్తికేయ ఎక్కడికి వెళ్ళాడు, ఏమయ్యాడు నాకు తెలియాలి. మన సెక్యూరిటీని తీసేసి మిలిటరీ సెక్యూరిటీ ఎందుకు అవసరమైంది? ఎప్పుడూ మన క్షేమంకోరే స్వామి సత్యానంద ఎక్కడున్నారు. ఇలా చాలా విషయాలు మీరు దాస్తున్నారు.

ఎవరూ చెప్పకుండా కట్టడి చేశారు.ఇదంతా నాకు అస్సలు నచ్చట్లేదు. ప్లీజ్ డాడీ. ఇప్పుడైనా చెప్పండి. లేకపోతే పిచ్చిపట్టేలా ఉంది!"అంటూ అర్థించింది.

"తెలుసుకుని... ఏం చేస్తావ్...?" గంభీరంగా కూతుర్ని అడిగారు రాజావారు.

"మీరేం చేశారు?" వెంటనే ఎదురు ప్రశ్నించింది సంజనా. "చెప్పండి డాడీ. మీరేం చేశారు? బాధలు కష్టాలు అన్నీ మీలోనే దాచేసుకుని నేను సుఖంగా ఉండాలనుకుంటున్నారు. అంతా మీరే భరిస్తే ఎలా డాడీ. మీ కూతురిగా నాకూ కొంత షేర్ చేయండి. ఎంత కష్టమైనా తట్టుకోగలను.

ఆ రోజు ఉదయం ఇదీ అని చెప్పలేని ఒక భయంకరమైన వికృతరూపం నన్ను మింగేయటానికి రావటం చూశాను. అంతే భయంతో పెద్దగా అరిచి తెలివి తప్పటం గుర్తుంది. ఆ తర్వాత ఇంతకాలం ఏం జరిగిందీ తెలీదు. చెప్పండి డాడీ. తర్వాత ఏం జరిగింది? ప్లీజ్..." సంజనా అంతగా రిక్వెస్ట్ చేయటంతో ఇక దాచి ప్రయోజనంలేదని అర్థమైంది రాజావారికి.

"ఓకే. చెపుతాను తల్లీ. అంతా చెబుతాను. కంగారుపడకుండా సాంతం విను. నీ సందేహాలు ఏమన్నా ఉంటే చివర్లో అడుగు" అంటూ చెప్పడానికి రెడీ అయ్యారు రాజావారు.

ఇంతలో సరిగ్గా అప్పుడే ఆయన సెల్‌ఫోన్ మోగింది. నంబరు చూడగానే అప్రయత్నంగా రాజావారి కనుబొమలు ముడిపడ్డాయి. కారణం అది స్వామి సత్యానంద సెల్‌ఫోన్ నంబర్‌కావటం.యువరాణి మంచాన పడ్డాక తను ఎన్నిసార్లు ఫోన్‌చేశాడు.ఎంతగా అర్థించాడు. ఒక్కసారి కూడా ప్యాలెస్‌కు రాని స్వామీజీ సడెన్‌గా ఇప్పుడు ఫోన్ చేయటంలో అంతరార్థమేంటి? ఏమిటో ఊహించగానే జాగ్రత్తపడ్డారు రాజావారు.

"ఎవరు డాడీ ఫోన్ చేసింది...? లిఫ్ట్ చేయడానికి ఇంతగా ఆలోచించాలా?"అడుగుతోంది సంజనా.

"అవునమ్మా. ఆలోచించాల్సిన వ్యక్తే. కాసేపు మవునంగా ఉండు. నేను ఫోన్ కిందపెట్టేవరకు మాట్లాడకు. నీగొంతు అటు వినిపించకూడదు. అర్థమైందా?"

"ఓకే డాడీ" అంది సంజనా.

**ఇంకా ఉంది**



**రజనీకాంత్ ఆధ్యాత్మిక రాజకీయాలంటూ ఆధ్యాత్మిక వ్యాపారం చేస్తున్నారు.**
-సత్యరాజ్, నటుడు

# నేనెవరో తెలుసా!

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 30 జూన్ 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

ఈ తరానికి టెలీఫోన్ అంటే సెల్‌ఫోనే. ఎప్పుడుపడితే అప్పుడు ఎక్కడనుండైనా మరెవరితోనైనా మాట్లాడగలిగిన అవకాశం సెల్‌ఫోన్ కల్పించింది. సెల్‌ఫోన్ రాకముందు ఇంట్లో ఫోన్ వుండటం ఒక విలాసం.

ఇంట్లో ఒక మూల నల్లపెట్టెలా వుండేది. అందరికీ దాని గురించి తెలియని రోజుల్లో 'బూచాడమ్మ బూచాడు నల్లపెట్టెలో వున్నాడు' అంటూ ఆ టేబుల్ ఫోన్‌ని వర్ణించాడు ఓ సినీకవి.

అటువంటి సెల్‌ఫోన్‌తో అదే ఊరిలోవాళ్ళతో మాట్లాడుకోవడం వరకే సాధ్యమయ్యేది.

పొరుగూరివారితో మాట్లాడాలంటే ఎంత సమయం పట్టేదో! ఫలానా ఊరిలో ఫలానా నెంబర్ వారికి కనెక్షన్ ఇవ్వమని టెలిఫోన్ వాళ్ళని అడిగితే వాళ్ళు ట్రంక్ కాల్ బుక్ చేస్తే, ఆ లైన్ ఎప్పుడు కలుస్తుందో తెలియక అలా ఫోన్‌ముందే గంటల తరబడి ఎదురుచూస్తూ కూర్చోవాల్సివచ్చేది.

విసుగుపుట్టి అలా ఒక్కక్షణం అటు వెళితే ఈలోగా మీరడిగిన ట్రంక్ వచ్చింది మీరు లేరు అంటే మళ్ళీ గంటలు గంటలు వేచివుండటమే.

ఇటువంటి పరిస్థితినుండి భారతీయులను ముందుకు తీసుకువెళ్ళటానికి అంతరిక్ష సాంకేతిక ప్రగతిని ఉపయోగించుకోవాల్సిందేనన్న ఆలోచన చేశాడు ఒక శాస్త్రవేత్త.

ఉపగ్రహాలను వాడుకుని సమాచారం అందించటం అనే ఆయన చేసిన ఒక గొప్ప ఆలోచన ఈ రోజున సబ్‌స్క్రైబర్ ట్రంక్ డైలింగ్ వ్యవస్థను తెచ్చింది. ప్రతి ఊరికీ ఒక ఎస్.టి.డి. కోడ్.

ఆ కోడ్ కొట్టి కావాల్సిన నెంబర్‌ని డయిల్‌చేస్తే వెనువెంటనే అవతలివారిని చేరుకునే అవకాశం వచ్చింది. ప్రతి వీధి చివర ఒక ఎస్.టి.డి. బూత్ వుండేది. సెల్‌ఫోన్ వచ్చి ఎస్.టి.డి. బూత్‌లను కనుమరుగు చేసుండవచ్చు.

కాని ఆ సెల్‌ఫోన్‌లు వాడుతున్నది ఆయన చేసిన 'ఆలోచన', 'అమలు' అనే ఉపగ్రహ టెక్నాలజీ ద్వారానే. ఎస్.టి.డి. బూత్‌ల ద్వారా ఎంత మంది ఉపాధి పొందారో లెక్కలేదు.

అలా సాంకేతిక విప్లవాన్ని భారతదేశంలో సృష్టించిన ఆయన పుట్టింది కర్ణాటకలో.

ఆయన ఇంటి పేరు తెలుగు ప్రాంతంలో ప్రత్యేకంగా చెప్పుకునే ఒక హోటళ్ళకు చెందినది.ఆయన చదువు స్కూల్‌స్థాయివరకు కన్నడ ప్రాంతంలో సాగింది. కాని డిగ్రీ చదువు నేటి ఆంధ్రప్రదేశ్‌లోని ఒక పట్టణంలో జరిగింది.

ఒక గొప్ప భవిష్యత్ సైంటిస్ట్‌ను తయారుచేసింది ఆ కాలేజీ అవటం ఆంధ్రులకు గర్వకారణం.

ఆ తర్వాత ఆయన బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేశాడు. దేశంలో ప్రారంభమైన నేషనల్ ఫిజికల్ రీసెర్చ్ ల్యాబ్‌లో పిహెచ్‌డికి చేరటమేకాక, నాటికే గుర్తింపు పొందిన విక్రమ్ సారాభాయ్ మార్గదర్శకత్వంలో డాక్టరేట్ సాధించాడు. నాడు మనదేశంలో అటువంటి మేధావులకున్న అవకాశాలు బాగా తక్కువ.

అందుకే ఆయన కూడా అమెరికా వెళ్ళాడు. ప్రతిష్ఠాత్మక ఎమ్.ఐ.టి.లో అధ్యాపకుడిగా వున్నాడు. టెక్సాస్ యూనివర్శిటీలో పనిచేశాడు.

కాని ఈ తరంవారిలా అమెరికాలో స్థిరపడదామనుకోలేదు. ఎలాగయినాసరే తన మాతృభూమికి సేవలు అందించి, తన పరిజ్ఞానంతో భారతదేశాన్ని మిగిలిన అగ్రరాజ్యాల సరసన అంతరిక్ష పరిజ్ఞానంలో నిలపాలి అని అనుకున్నాడు.

1966లో భారతదేశం తిరిగివచ్చేసరికి ఆయన వయసు 34 ఏళ్ళు. తాను పిహెచ్‌డి అందుకున్న సంస్థలోనే ప్రొఫెసర్ అయ్యాడు.

సౌరగాలులు వాటి ప్రభావం భూమ్యాకర్షణ అంశంమీద అధ్యయనం తొలిసారిగా చేసినవ్యక్తిగా గుర్తింపు పొందాడు. సాంకేతిక పరిజ్ఞానాన్ని భారత్‌లోకి తీసుకువచ్చింది ఆయనే. 1972లో ఆ ఆలోచన వచ్చింది.

మూడేళ్ళ కాలంలో భారతదేశపు తొలి ఉపగ్రహం 'ఆర్యభట్ట' ఆకాశంలోకి దూసుకువెళ్ళింది ఆయన మార్గదర్శకత్వంతోనే. నాటినుండి 'భాస్కర', 'రోహిణి' 'ఇన్శాట్ 1, 2' వంటి 18 ఉపగ్రహాలు ఆయన నేపథ్యంలో అంతరిక్షంలోకి వెళ్ళినవే.

రిమోట్ సెన్సింగ్ ఉపగ్రహాలను పంపించింది ఆయనద్వారానే. ఉపగ్రహాల ద్వారా దేశం ప్రకృతి వైపరీత్యాలను పసిగట్టగలిగింది.

అడవులను సర్వే చేయగలిగింది. సహజవనరుల గుర్తింపులో సహాయపడింది. సాంకేతిక పరిజ్ఞానం రిమోట్ సెన్సింగ్‌ద్వారా ప్రతి రంగాన్నీ ప్రభావితం చేయగలిగింది. అది ఆయన ముందుచూపు.

ఇప్పుడు పలుదేశాలు తమ ఉపగ్రహాలను అంతరిక్షంలోకి ప్రయోగించేందుకు శ్రీహరి కోట కేంద్రాన్ని ఎంచుకుంటున్నారంటే అందుకు మూలం ఆయన వేసిన సాంకేతిక పునాది.

ప్రభుత్వం ఆయన్ని అంతరిక్ష విభాగపు అధ్యక్షునిగా నియమించగానే రాకెట్ టెక్నాలజీని పరుగులు పెట్టించాడు.'ఆర్యభట్ట' స్థాయినుండి 'అంగారక మిషన్' వరకు అన్నింటినీ విజయవంతంగా నడిపించిన రెండు దశాబ్దాల కృషి ఆయనది.

అమెరికా దేశం ఆయన ప్రతిభను గుర్తించింది. వాషింగ్టన్‌లోని 'సొసైటీ ఆఫ్ శాటిలైట్ ప్రొఫెషనల్స్ ఇంటర్నేషనల్ హాల్ ఆఫ్ ఫేమ్'లో ఆయన పేరును 2013లో చేర్చారు. ఆ గౌరవం పొందిన తొలి భారతీయుడు ఆయన. రష్యా, అమెరికాలో పలురకాల అవార్డులు అందుకున్నారు.

అంతరిక్షంలోకి వెళ్ళిన తొలిమనిషి యూరీగగారిన్ పేరున ఇచ్చే అవార్డు ఆయనకు ఇచ్చింది రష్యా. 'శాంతియుత ప్రయోజనాల కోసమే భారతీయ సాంకేతిక పరిశోధనలు' అనే మాటకు కట్టుబడి ప్రయోగాలను విజయవంతం చేసిన అంతరిక్షవీరుడుగా ప్రభుత్వం చేత కొనియాడబడ్డాడు.

భారతప్రభుత్వం 1976లో పద్మభూషణ్,2017లో పద్మవిభూషణ్‌ని ఇచ్చి సత్కరించింది.

ఒక పౌరుడికి భారతదేశం ఇచ్చే పురస్కారంలో 'భారతరత్న' మాత్రమేఆయనకి ఇక దక్కాల్సింది. ఆయన సమకాలీకులలో అబ్దుల్ కలాం 'భారతరత్న' అయ్యాడు.

ఆయన సేవలను భారత ప్రభుత్వం పలు ఇతర రకాలుగా కూడా వాడుకుంది. ఆయనలో నిజాయితీ, దేశభక్తి, దేశ ప్రయోజనాలు కాపాడేందుకు, దేశాభివృద్ధిని పెంపొందింపచేసేందుకు ప్రతిక్షణం ఆలోచనలు చేసినవాడు కాబట్టే ప్రభుత్వం ఏ బాధ్యత అప్పగించినా దానిని నిర్వర్తించాడు.

అంతరిక్షాన్ని శాంతియుత ప్రయోజనాలకు మాత్రమే ఉపయోగించాలన్న లక్ష్యంతో పనిచేసే ఐక్యరాజ్యసమితి సంస్థకి ఆయన్ని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.అంటార్కిటికా ఖండ ఒప్పంద సంప్రదింపుల కమిటీకి ఆయనను ఛైర్మన్‌గా ఎన్నుకున్నారు.

జాతీయస్థాయిలో ఆయన అందుకున్న గౌరవ డాక్టరేట్లు, ఇతర అవార్డులకు లెక్కలేదు. భారత దేశ అంతరిక్ష పరిజ్ఞానం, సాంకేతిక ప్రగతిలో కీలక పాత్ర పోషించారాయన. ఇంతకీ...

*1. ఆ శాస్త్రవేత్త పేరేమిటి?*

*2. ఆయన డిగ్రీ చదివిన కాలేజీ ఏ పట్టణంలో వుంది?*

15.6.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :
1. మందుముల నరసింగరావు, 2. రయ్యత్

₹ 500/- బహుమతి పొందిన విజేత :
కె.ఎల్.ప్రసాదరావు, 16-3-1,
చుక్కా ప్యారడైజ్, ఫ్లాట్ నెం.101,
శ్రీరాం నగర్
రాజమహేంద్రవరం
533 104

# దీపం కింద నీడ

₹10,000 బహుమతి కథ

వాట్ల దేవదాసం రాజు

సెల్ : 94401 05987

చిల్లపెంకుల ఇల్లు. ఆగ్నేయ భాగాన రేకుల షెడ్డు. వంటా భోజనాలూ అక్కడే. దాని దాపున వసారాగా దించిన చోట వడ్రంగం పని జరుగుతుంటుంది. సాయం సంధ్య. మానేపల్లి వీరేశ లింగం వాలుకుర్చీలో కూర్చున్నాడు.

అప్పుడే పక్క గ్రామం ఇంజరం నుండి వచ్చాడు. కామాక్షమ్మ రంగు రంగుల దారాలతో కుట్టిన విసన కర్రతో విసురుతోంది. వీరేశలింగం ఉంచుకున్నా విడ సుబ్బమ్మ చెంగుతో చేతులు తుడుచుకుంటూ దగ్గరగా నిలబడింది.

చామనఛాయ... గిరజాల జుట్టు... చెవులకు రింగులు... కోలముఖంలో వింత వెలుగులు. వీరేశ లింగం కళ్ళల్లో మెరుపు ఉంది. నుదుటన నిలువునా తిలకం బొట్టు వీరేశలింగానికి అదనపు ఆకర్షణ. అతని చేతిలో నిఖార్సయిన చేవదేలిన టేకు కర్ర అద్భుతమైన దారుశిల్పమవుతుంది.

"కామాక్షీ... కాఫీ పట్టుకురా... చక్కగా..." అని భార్యకు పురమాయించాడు.విసనకర్ర బల్లమీదఉంచి వంటగదిలోకెళ్ళింది. మొగుడు అడగ్గానే ఏ పనైనా అగ్గగ్గలాడుతూ చేసేస్తుంది కామాక్షి ఆనందంగా.

సుబ్బమ్మకేసి చూసి కొంటెగా కన్నుకొట్టాడు "చాల్లెండి సంబడం"అంటూ సిగ్గుపడింది సుబ్బమ్మ. కామాక్షమ్మ, సుబ్బమ్మల సఖ్యత గురించి ఊళ్ళో వాళ్ళు చెప్పుకుంటారు. వంటవంతు కామాక్షిది. స్నానానికి వేడినీళ్ళు కాయడం, ఇల్లంతా శుభ్రంగా ఉంచడం సుబ్బమ్మ పని.

పొగలు కక్కుతున్న కాఫీ తీసు కొచ్చింది కామాక్షి చిన్నపాటి మర చెంబుతో. గ్లాసులోకి వంచుకుని మరచెంబు మూత బిగించి కాఫీ చప్పరించడం మొదలెట్టాడు. కామాక్షి విసనకర్రను మళ్ళీ చేతిలోకి తీసుకుంది.

వీధిలో కారు ఆగిన శబ్దం. రోడ్డు మీద దుమ్ము రేగింది. కారు చుట్టూ మూగిన పిల్లల గలగల విన బడుతోంది."రాములవారి గుడి ఎదురుగా అన్నారు. వీరేశలింగం గారి ఇల్లు ఇదేనా?" అని అడిగి కిందకు దిగిందొక అందమైన పడుచు. డ్రైవరును అక్కడే ఉండమని చెప్పి ఆమె లోపలికి వచ్చింది.

ఆవిడ కంటే ముందు ఆమె ఒంటిమీంచిఅత్తరు పరిమళం వీరేశలింగం ముక్కుపుటాల్ని తాకింది. సాలోచనగా కామాక్షి, సుబ్బమ్మలకేసి చూశాడు.ఇద్దరూ తమ గదుల్లోకి వెళ్ళిపోయారు.ఎవ రైనా కొత్తవాళ్ళు వచ్చినప్పుడు ఆడాళ్ళిద్దరూ అక్కడ ఉండటానికి వీల్లేదు.ఇది వీరేశలింగం శాసనం.

ఆమె నడక నాజూకుగా ఉంది.ఆమె ముఖం ప్రస న్నంగా ఉంది. ఆమె పెదవులు ఎర్రగా విచ్చుకున్న మందారాల్లా ఉన్నాయి.ఆమె పసిడిఛాయలోమెరిసి పోతూంది. వీరేశలింగం కుర్చీలోంచి లేచి నిలబడి ఎవరన్నట్లు చూశాడు."నాపేరు నాగమణి. మండపేట నుండివచ్చాను.వీరేశలింగంమీరే కదూ"అడిగింది.

"అవును... నేనే... అలా కూర్చోండి"అని ముక్కాలి పీట చూపించాడు వీరేశలింగం.రెండడుగుల ఎత్తులో ఉందది. కాసేపు అలాగే నిలబడి చుట్టూ చూసింది. మరో కుర్చీలాంటిది కనబడలేదు.

గదిలోకి అత్తరు దుకాణం కదిలివచ్చినట్లుంది. మెడలో ఒంటిపేట గొలుసు... చెవులకు దుద్దులు, బుట్టలు... చేతికి బంగారుగాజులు... కాటుక కళ్ళు... ఆకుపచ్చటి జాకెట్టు లేత ఉదారంగు చీరతో నాగ మణి ముక్కాలిమీద సర్దుకుని ఒద్దికగా కూర్చుంది. వీరేశలింగం ఆమెను తేరిపార చూశాడు.ఆమె రాకకు కారణమేమిటో ఊహించలేకపోతున్నాడు.

మొత్తమ్మీద తన అవసరమేదో ఆమెకు ఉందని గ్రహించాడు. "నాతో ఏమిటి పని...? ఏం కావాలి మీకు...?" సూటిగా అడిగాడు.

"ఇంటి నిర్మాణంలో ఉన్నాను. మీ వృత్తి నైపుణ్యం గురించి విన్నాను. సింహద్వారం అందంగా కళాత్మ కంగా నగిషీలతో చెక్కిద్దామన్నది నా కోరిక. దాన్ని మీరే చేయాలి. అది మాట్లాడ టానికే వచ్చాను"అంది వీరేశలింగం ముఖం కేసి చూస్తూ. వీరేశ లింగం కుర్చీలో కూర్చున్నాడు. మాట్లాడ లేదు. ఆమెనే తదేకంగా చూస్తున్నాడు. కాసేపటికి "ఇంతకీ మీరేం చేస్తుం టారు?" అడిగాడు.

"నాపేరు చెప్పగానే తెలుసుకుంటారనుకున్నాను. నాగరత్నమ్మ కూతురును. ప్రస్తుతం మేళాలకు వెళ్ళడంలేదు. ఇంటిపట్టునే ఉంటున్నాను. బాగా డబ్బున్నవాళ్ళకు నేనంటే గొప్ప మోజు" అని ముసి ముసినవ్వులు నవ్వింది. ఆ నవ్వులో కోరింది సర్వం ఇచ్చేసే సమ్మోహనశక్తి ఉంది.

"ఓహో... అలాగా... అర్థమైంది. చెప్పొచ్చేదేమింటే మీరు నన్ను భరించలేరు. నేనే చేయాలంటే అయ్యే పని కాదు. ఇక్కడే ఊపిరిసలపనంత పని ఉంది. ఊరొదిలి రావడం సాధ్యం కాదు. ఇంకో ఏర్పాటు చేసుకోండి" కుడిచేయిమీసం మీదకు వెళ్ళింది.

ఎడమచేతివేళ్ళతో గిరజాలు సవరించుకున్నాడు. పంచె సర్దుకున్నాడు. చురుకుగా కళ్ళను అటూ ఇటూ తిప్పాడు. నాగమణి చిన్నబుచ్చుకుంది. తన మాటను గౌరవిస్తాడని అనుకుంది. నిరాశ ఎదు రవ్వడం ఊహించలేదు.

"అలా అనొద్దండి. కొండంత ఆశతో వచ్చాను. మీ గురించి గొప్పగా విన్నాను. అద్భుతంగా అందరూ మెచ్చేలా మీరే చేయగలరు. మీరేం అడిగినా కాదన కుండా ఇస్తాను. సందేహం వద్దు" విలాసంగా ఒళ్ళు విరుచుకుంది నాగమణి. కళ్ళు కూడా ఏదో చెబు తున్నట్లే ఉన్నాయి. అందం పెట్టు బడితో ఎంతవారైనా దిగివస్తారనే నమ్మకం ఆమెది. "ఏమైనా సరే... ఇస్తారా? డబ్బులు, బియ్యం... అలాంటివేమీ నాకు వద్దు. ఐనా నేనడిగింది మీరి వ్వలేరు.ఇక మీరు వెళ్ళొచ్చు"అన్నాడు వీరేశలింగం లౌక్యంగా.

ఈ లోపులో సాయంగా ఉండే గాంధీ మజ్జిగ పట్టుకొచ్చి నాగమణికి అందించాడు. గాంధీని తీవ్రంగా చూశాడు వీరేశలింగం. ఆ చూపులకు అర్థం తెలుసు. వెంటనే వీధిలోకెళ్ళిపోయాడు. నాగమణి ఏదో ఆలో చిస్తూ నెమ్మదిగా



మజ్జిగ తాగుతున్నది.
నాగమణి లేచి నిలబడింది. వీరేశ లింగం దగ్గరగా వెళ్ళి వంగొని పాదాలకు నమస్కరించింది. పైట జారినా సర్దుకోలేదు.

"మీరు రావడమే భాగ్యం. మీరు పని చేస్తున్నంతకాలం మా ఇంట్లోనే నా పడకగదిలోనే ఉండ వచ్చు. మిమ్మల్ని ఒప్పుకుంటు న్నాను. ఇచ్చిన మాటకు కట్టుబడి ఉంటాను. అద్భుతకళాఖండాన్ని సింహద్వారంపై చెక్కాలి. ఎవరుచూసినా ఇటువంటిది మరెక్కడా లేదని అనుకోవాలి. ఇంకా చెప్పాలంటే అసూయపడాలి. ఇందుకోసం దేనికైనాసరే అంగీకరిస్తాను" అంది నాగమణి.

"మీరు ఆశించినట్టు చేయాలంటే ఎన్నాళ్ళు పడుతుందో తెలుసా? రేపు ఎల్లుండీ అయ్యేదికాదు. ఆలోచించుకోండి" అన్నాడు.

"ఎన్నాళ్ళు కాదు. ఎన్నేళ్ళయినా సరే భరిస్తాను. మీరు మాట ఇవ్వండి చాలు. తృప్తితో వెళతాను" నాగమణి చెప్పింది.

"అయితే ఒక షరతు" ఖంగుమని మోగింది





## రూపం మారుతుంది

**ప**క్కింటి అమ్మాయి ఇమేజ్‌తో ఇప్పటిదాకా గుర్తింపు పొందిన అనుఇమ్మానుయేల్ అభిమానులను కొత్తరూపంతో అబ్బురపరచబోతున్నది.

శైలజారెడ్డి అల్లుడు'తో రూపం మారుతుందంటున్నది. "నేనిప్పుడే నా పాత్రగురించి ఎక్కువగా చెప్పలేను. కాని,చాలా యాటిట్యూడ్ వుంటుంది. తాజా శ్వాసలాంటి పాత్ర.ఇందుకోసం షూటింగ్ విభిన్న అనుభవాన్ని ఇస్తున్నది. సహనటుడు నాగచైతన్య చాలా కంఫర్టబుల్, స్వీట్ పర్సన్" అంటూ హుషారుగా చెప్పింది.

వీరేశలింగంగొంతు. పెదాలమీదచిరునవ్వు దోబూచులాడుతోంది. వీరేశలింగం కళ్ళల్లో ఒకలాంటి మెరుపు. హుందాగా... చల్లని చూపులతో నాగమణిని పరిశీలనగా చూస్తున్నాడు.

"చెప్పండి. తప్పక పాటిస్తాను"

"నేను ఉండగా మరో మగాడు ఇంటి గుమ్మం తొక్కకూడదు... జాగ్రత్తగా ఆలోచించుకోండి" అన్నాడు వీరేశలింగం స్థిరంగా.

"మీ మీద గౌరవంతో వచ్చాను. మీరెలాంటి వారో మీ స్వభావం ఏమిటో సంపూర్ణంగా తెలుసుకునే వచ్చాను.మీ షరతును అంగీకరిస్తున్నాను. ఎట్టి పరిస్థితుల్లోనూ ఇచ్చిన మాట జవదాటను" అంది నాగమణి.

వీరేశలింగంలేచి నాగమణి తల మీద చేతితో తట్టాడు. నాగమణి ఒప్పందం ప్రకారం నడుచుకుంది. వీరేశలింగాన్ని పువ్వుల్లో పెట్టుకుని చూసుకుంది.ఎంతో భక్తి ప్రపత్తులతో మెలిగింది. తాళి కట్టించుకున్న భార్యలా సమాదరించింది. శయనేషు రంభలా ప్రవర్తించింది.

వీరేశలింగం మండపేటలో రెండున్నర ఏళ్ళు ఉన్నాడు. దారుశిల్పిగా అసమాన ప్రతిభను ప్రదర్శించే రీతిలో సింహద్వారం రూపుదిద్దుకుంది.

దేశంలో మరెక్కడా లేనివిధంగా విభిన్న కళాకృతులతో సింహద్వారాన్ని చెక్కాడు.

**మం**డపేట నుండి వచ్చాక వీరేశలింగం స్వభావంలో ఆలోచనల్లో ఘననీయమైన మార్పొచ్చింది.

జగత్తుకు ధనం మూలమని గ్రహించాడు. వృత్తి ఏదైనా నాగమణి, ఆమె తల్లి కూడబెట్టిన ఆస్తుల్ని గమనించాడు. వీరేశలింగంలో డబ్బు సంపాదించాలనే కొత్తయావ పుట్టుకొచ్చింది.

వృత్తికి అంకితమైపోయి కళాత్మక విలువలతో జీవించడం ఒక్కటే పరమార్థం కాదని అనుకోసాగాడు. ఇలా ఆలోచించడం తప్పే కావచ్చు. డబ్బు వల్ల ఒనగూడే ప్రయోజనాల పట్ల వ్యామోహం పెరిగింది.

ఆ ఎరుక వీరేశలింగం నమ్మే విలువలకు తూట్లు పొడుస్తుందా? సరిగ్గా అదే సమయంలో దొంగరాముడు పరిచయమయ్యాడు.

దొంగరాముడు చిల్లర దొంగతనాలు చేసి అనేక సార్లు జైలు ఊచలు లెక్కించాడు. అసలు వాడు వీరేశలింగానికి ఎలా దగ్గరయ్యాడు?

ఒకనాటి అర్ధరాత్రివేళ పక్కింట్లో కలకలం. దొంగతనం జరిగింది. దొంగరాముడు పట్టుబడ్డాడు. ఆ ఇంట్లోవాళ్ళు వాడిని చితక్కొట్టి పెరట్లో మామిడి చెట్టుకు కట్టేశారు. తెల్లారాక జనం పోగుపడ్డారు. తలో మాట అని నిందించారు. దొంగరాముడు మానసిక శారీరకహింసకు గురయ్యాడు.డీలా పడిపోయాడు. చితికిపోయాడు. బయటపడే మార్గాలు లేవు.

హడావుడి గమనించి వీరేశలింగం అక్కడకు వెళ్ళాడు. అతడిని చూసి దొంగరాముడు పెద్ద పెట్టున ఏడుపు మొదలెట్టాడు.

"నంగనాచి ఎదవ. దొంగేడుపులు ఏడుస్తున్నాడు. తన్నండి. మరెప్పుడూ ఏ ఇంటిలోకీ దూరకుండా కాళ్ళు విరగ్గొట్టాలి, దొంగవెధవని" అంటూ ఆవేశపడుతున్నాడొకాయన. అందరూ తలో మాట అని ఆవేశాన్ని వెళ్ళగక్కుతున్నారు.

వీరేశలింగం పరిస్థితి గ్రహించాడు.

"దండించింది చాలు. వదిలేయండి. ఇకముందు దొంగరాముడు ఇటువంటి పనులు చేయడు. నాది హామీ. మీ దెబ్బలకు చచ్చాడంటే మళ్ళీ అదో గోల" అక్కడివాళ్ళను అనునయించాడు. బతిమాలాడు. పూచీపడ్డాడు. అండగా నిలబడి విడిపించాడు.

తన ఇంటికి తీసుకెళ్ళాడు. ఆకలి గమనించి అన్నం పెట్టించాడు. దొంగతనం మానేయమని హితబోధ చేశాడు. ఒట్టువేయించుకున్నాడు.

వీరేశలింగంపట్ల దొంగరాముడికి ఎంతో గౌరవభావం. రోజూ ఇంటికి వచ్చేవాడు. బుద్ధిగా కూర్చునేవాడు. ఇద్దరిమధ్య సాన్నిహిత్యం పెరిగింది. అదే కొంప ముంచింది వీరేశలింగాన్ని.

వీరేశలింగం తరచూ నాగమణి ఎంతటి ఉత్తమురాలో ధనవంతురాలో చెప్పేవాడు. మండపేటలో తన వైభోగం గురించి చెప్పేవాడు. తనలోని కళకు నాగమణి ఎట్లా దాసోహమయ్యిందో చెప్పేవాడు.డబ్బు ఉంటే ఏమైనా సాధించవచ్చని కొండమీంచి కోతిని ఎట్లా దింపవచ్చో అర్థమైందని చెప్పేవాడు.

ప్రస్తుతం వీరేశలింగంలో అంతర్లీనంగా ధనాపేక్ష దాగిఉందని గ్రహించాడు దొంగరాముడు. దాని ఫలితంగా తనకొచ్చిన ఒక తప్పుడు ఆలోచనను పదేపదే వీరేశలింగం చెవిలో జోరీగలా ఊదడం మొదలెట్టాడు. ససేమిరా అన్నాడు వీరేశలింగం. తిట్టాడు.

ఆ ప్రసక్తి ఎప్పుడూ తీసుకురావద్దన్నాడు. అలా అన్నాడుగానీ తర్వాత్తర్వాత లొంగిపోయాడు. బలహీనత చొరబడటానికి ఒక్క లిప్తకాలం చాలు.

దొంగరాముడు ఇచ్చిన సలహా ప్రకారం చట్టవ్యతిరేక కార్యకలాపానికి సిద్ధమయ్యాడు వీరేశలింగం చిత్రంగా. అందుకు అతని మానసికస్థితి కూడా తోడైందేమో. సరిగ్గా రెండు నెలల తర్వాత...

పోలీసులు వచ్చారు. వీరేశలింగం ఇల్లంతా సోదా చేశారు. అనేక ఆధారాలు దొరికాయి. వీరేశలింగంకు బేడీలు వేసి రాజమండ్రి సెంట్రల్ జైల్‌కు తీసుకుపోయారు. తప్పు చేసినప్పుడు శిక్ష అనుభవించడం తప్పదు. వీరేశలింగం కిమ్మనలేదు.

మౌనంగా అనుసరించాడు. కామాక్షి, సుబ్బమ్మల రోదనలు మిన్నంటాయి. ఊరంతా ఆశ్చర్యపోయింది. ఔరా... ఏమిటీ దౌర్భాగ్యం... అనుకుని విస్తుపోయారు. చలామణీలో ఉన్న వెండి నాణాల్ని ఏమాత్రం తేడా లేకుండా అచ్చుగుద్దినట్లు తయారు చేశాడు వీరేశలింగం.

ఫలితంగా జైలుశిక్ష. కళ వక్ర మార్గం పట్టి బజారులో పడేసింది.

అతని జీవితంలో ఇదొక మచ్చ, దీపం కింద చీకటిలా...



పెట్రోల్, డీజిల్ ధరలు తగ్గాలంటే ముందుగా రాష్ట్రప్రభుత్వాలు పన్నులు తగ్గించాలి. -రాజీవ్‌కుమార్, నీతి ఆయోగ్ ఉపాధ్యక్షుడు

జైలునుండి విడుదలైన వీరేశలింగం కోలంక చేరాడు. హితులనుకున్నవాళ్ళూ, సావాసగాళ్ళూ ముఖం చాటేశారు. సుబ్బమ్మ ఇంటినుండి ఎప్పుడో వెళ్ళిపోయిందని తెలుసుకున్నాడు.

కామాక్షి బెంగతో సన్నగా, పీలగా తయారైంది. కళ్ళు లోతుకుపోయాయి. పిల్లలు ఇద్దరూ చదువులు మానేశారు. ఇంటి దగ్గరే ఉంటున్నారు. వాళ్ళకు వారసత్వంగా అందాల్సిన వృత్తి నైపుణ్యాల్ని నేర్పి ప్రయోజకుల్ని చేయాలి. తనని ప్రేరేపించి తనచేత తప్పుడు పనులు చేయించిన దొంగరాముడు సైతం అయిపు లేడు. మరో రెండు నెలలు గడిచాయి.

వత్సవాయి తమ్మిరాజు రమ్మని పిలిచారు. ఆయన ఇంట్లో ఉన్నా బయట రోడ్డుమీద తిరిగినా చిన్న పంచె, భుజంమీద తువ్వాలు మాత్రమే ఉంటాయి. ఎత్తుగా, లావుగా గంభీరంగా ఉండే ఆయనంటే వీరేశలింగానికి ఎనలేని గౌరవం.

తమ ఇద్దరికీ భార్యతోపాటు మరో ఆడది ఇంట్లో ఉండటం విశేషం. తనని 'లింగా' అని ఆప్యాయంగా పిలుస్తారు. వీరేశలింగం వెళ్ళాడు.

"ఊరి పొలిమేరలో గ్రామ రక్షణకు కోలపిళ్ళమ్మ గుడికట్టాలని మన ఊళ్ళోవాళ్ళు కోరుకుంటున్నారు. అమ్మోరు ఇన్నాళ్ళూ దిక్కూ, మొక్కూ లేకుండా రేకుల షెడ్డులో ఉంటున్నది. ఆవిడ విగ్రహం కర్రతో చేయాలి. అది నీవల్లే అవుతుంది"

మనం పని మొదలెడుతున్నాం. రెండు మూడు రోజుల్లో చేవదేరి నాలుగు కాలాలపాటు మన్నికఉండే టేకుమాను కొందాం. మంచి టేకు నువ్వే ఎంచాలి"అని చెప్పి మారుమాటలేకుండా తమ్మిరాజు ఇంటి లోపలికి వెళ్ళిపోయారు. ఏకపక్షంగా ఆదేశం ఇచ్చినట్లుగా తమ్మిరాజు ధోరణి చికాకు కలిగించింది.

వీరేశలింగం అన్యమనస్కంగా ఇల్లు చేరాడు. మనసు అతని వశంలో లేదు. పరిపరివిధాల ఆలోచనలు. రుచులు తెలియడంలేదు. నిద్రపట్టడం లేదు. సాధారణవ్యక్తిని ఐనప్పటికీ నాగమణి తనని ఎంతలా ఆదరించింది? ఆమెకు దేవుడు అన్యాయం చేశాడు. ఎంతో మక్కువతో నిర్మించుకున్న ఇంటిలో ఎన్నాళ్ళో నివసించలేని దురదృష్టం ఆమెది.

బోలెడంత జీవితం ఉండగానే మాయదారి రోగం వచ్చి పై లోకాలకు ఎగిరిపోయింది. ఆమె జ్ఞాపకాలు కలవరపెడుతున్నాయి. ఆమెతో గడిపిన మధుర క్షణాలు గుర్తుకొస్తున్నాయి.ఆమెకు ఆజన్మాంతం రుణపడి ఉన్నాడు. సమాచారం తెలిసినప్పుడు భోరున ఏడ్చాడు. ఆమె ఒడిలో సేద తీరాల్సిన సమయం ఇది.

తమ్మిరాజు మాట ఎప్పుడూ జవ దాట లేదు. ఆయన కుటుంబంతోఎంతో సాన్నిహిత్యం ఉంది. ఆప్యాయంగా 'లింగా' అని పిలుస్తాడాయన. మనిషి జీవితం ఏమిటి? చనిపోయాక కీర్తి, అపకీర్తుల సంగతి మనం చూడకపోయినా ఈ తాపత్రయాలెందుకు? బతికినన్నాళ్ళూ. ఏదోబంధం నడిపిస్తుంది.




తర్వాత అంతా శూన్యం.

అర్ధరాత్రివేళ. ఒక సంశయంలోంచి కాంతిరేఖలు వెలువడి దేహం నిండా కమ్మాయి. నాగమణి రూపం కళ్ళముందు నవ్వుతూ కనిపించింది. చటుక్కున సందేశం ఏదో అందినట్లు ఉలిక్కిపడ్డాడు.

దిగ్గున లేచాడు. మంచినీళ్ళు తాగాడు. నాగమణిని తలుచుకుంటూ నిద్రకు ఉపక్రమించాడు. తెల్లారగానే పరుగున తమ్మిరాజు దగ్గరకు వెళ్ళాడు. ఆయన పాదాలకు నమస్కరించాడు.

"కోలపిళ్ళమ్మను దారుశిల్పంగా మలుస్తాను. రాజమండ్రిలో కోటిలింగాల పక్కన మంచి టేకు ఉన్నట్లు తెలిసింది. ఈవేళే బయలుదేరుదాం"ఊపిరి పీల్చుకోకుండా టకటకా అనేశాడు.

తమ్మిరాజు ఆశ్చర్యపోయాడు. 'వీరేశలింగం తిక్క సన్నాసి. మళ్ళీ మనసు మార్చుకున్నా మార్చుకుంటాడు. ఇక ఆలస్యం చేయకూడదు' అనుకున్నాడు తమ్మిరాజు. రాజమండ్రి వెళ్ళారు.

ఆవరణంతా గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి టేకు మానులు.వీరేశలింగం దృష్టి ఒక మూలగాఉన్న టేకు లాటు మీద పడింది. పైభాగాన గుంతలు పడి నల్లగా కమిలి ఉన్న టేకు చూశాడు. అంతర్వీక్షణంతో అదే మేలైందని దాన్నే ఎంపిక చేశాడు వీరేశలింగం.

తమ్మిరాజు వారిస్తున్నా వినలేదు. ఆయన చెవిలో ఏదో చెప్పాడు. కొద్దిగా చెవుడు కారణంగా సరిగ్గా వినబడలేదు తమ్మిరాజుకు. మొత్తంమీదఅతిచొరవగా బేరంచేసి కొనిపించేశాడు.



ఎన్నికల్లో అక్రమాలను వెలుగులోకి తెచ్చేవారికి సంపూర్ణ రక్షణ కల్పిస్తాం.
-ఓ.పి.రావత్,
ఎన్నికల ప్రధాన కమీషనర్

రెండు సంవత్సరాలు పట్టింది కోలపిళ్ళమ్మ విగ్రహం తయారవ్వడానికి. ముఖం చెక్కడానికి ముహూర్తం కావాలి. సరైన నిష్ఠ పాటించకపోతే అమ్మోరు ఊరుకోదని ఒక నమ్మకం. ముఖంచెక్కడం కూడా పూర్తయ్యింది. విగ్రహానికి రంగులు అద్దాడు, చీర ఆభరణాలతో సహా. ఆఖరుగా కళ్ళు తీర్చాడు. విగ్రహానికి ప్రాణం పోసినట్లుగా ఉంది.

తీవ్రమైన ఉద్వేగం... ఎదురుగా నిలబడి ఏడ్చేశాడు వీరేశలింగం. ఎందుకు ఏడుస్తున్నాడో చుట్టూవున్న వాళ్ళకు తెలియదు. తర్వాత కాలంలో కొంతమంది పసిగట్టారు.

"ఊరుకు అమ్మోరేగానీ కోలపిళ్ళమ్మ మానవమాత్రురాలిగానే ఉంటుంది. భీకరంగా కాకుండా సాత్వికంగా, సరస్వతీదేవిలా ఉంటుంది.

నోటిలోంచి పంటికోరలు, చేతుల్లోరాక్షస తలకాయలుండవు. అందుకే పిల్లలు సైతం నిర్భయంగా గుడి లోపలకు వెళ్ళి పాదాలు,చేతులు తడుముతూ ఆడుకుంటారు. ఆ తల్లి ఏమనదు. అందుకే మన ఊరోళ్ళు కోలపిళ్ళమ్మకు నోరు కుట్టేశారంటారు" నామా గాంధీ చెప్పడం ఆపాడు.

భుజంమీద తువ్వాలుతోముఖం తుడుచుకున్నాడు."అన్నట్టు గాంధీ తాతా...విగ్రహం పూర్తయ్యాక వీరేశలింగం ఎందుకు ఏడ్చాడు?" ఆత్రుత ఆపుకోలేక అడిగాను.

"ఆహాహా... ఏమీలేదు, దేవబాబూ...అదాటునచూస్తే ఎరుగున్నవాళ్ళకు విగ్రహం అనిపించదు. జీవకళ ఉట్టిపడుతుంది. ముఖంలో స్పష్టంగా మండపేట నాగమణి పోలికలు కనపడతాయి. ఆవిడే పీఠంమీద కూర్చుందనుకుంటారు" నవ్వాడు నామా గాంధీ.

# కీళ్ళనొప్పుల ఉపశమనానికి

కీళ్ళనొప్పులు అనేది బాధాకరమైన పరిస్థితి. కీళ్ళు వంగవు. మోకాళ్ళు కదలించలేరు. నిరంతర వాపు బాధ.

జీవితాన్ని కుంగదీసే జబ్బుఇది.శరీరంలోని ఏ కీలుకైనా రావచ్చును. కీళ్ళకు అంటివున్న కండరాలమీద ప్రభావం చూపుతుంది. సాధారణంగా వయసుమళ్ళినవారిలో కనిపించే ఇబ్బంది ఇది.



కీళ్ళనొప్పులు అనే పదం వాడినప్పటికి నిజానికి అందులో వందరకాల భిన్నమైన నొప్పులు వున్నాయి.

వాటిలో అత్యధికంగా కనిపించే దాన్ని వైద్యపరిభాషలో 'ఆస్టియో ఆర్థ్రైటిస్' అంటారు. దీని తర్వాతి స్థానం 'రుమటాయిడ్ ఆర్థ్రైటిస్'ది.

ఒక అంచనాప్రకారం ప్రపంచ జనాభాలో 60 ఏళ్ళ వయసు నిండిన పురుషులలో దాదాపు 10 శాతం స్త్రీలలో 18 శాతం ఆస్టియో ఆర్థ్రైటిస్‌తో బాధపడుతున్నారు. మనదేశంలో 65 ఏళ్ళు వయసు పైబడిన మహిళల్లో 45 శాతం కీళ్ళనొప్పుల సమస్య కనిపిస్తోంది.

కీళ్ళనొప్పులు అనేది శరీరంలోని పలుభాగాలలో కనిపించేది.

కీలుభాగాలు సులభంగా చలించటానికి వీలుగావుండే మృదులాస్థిఅరిగిపోయినా, కందెనలా పనిచేసే ద్రవపదార్థంతరిగిపోయినా కీళ్ళదగ్గర బాధ తీవ్రమవుతుంది. మోకాళ్ళ ప్రాంతంలో వచ్చే సమస్య అదే. మెడభాగంలో అరుగుదల స్పాండిలైటిస్ తెస్తున్నది. వెన్నుభాగంలోని అరుగుదల నడుపు నొప్పి, నడుము నుండి పాదాలవరకు లాగేస్తున్న బాధను తెస్తాయి.

కాలి కీళ్ళు, కాళ్ళ మడమభాగం, చేతివేళ్ళు మోచేతిభాగంలోని కీళ్ళ దగ్గర వాపు కనిపించి, కీళ్ళను వంచలేని బాధ.దేనినిగట్టిగా పట్టుకోలేనిఇబ్బంది. నిరంతరం పొడిచినట్టుగా వుండే నొప్పులు. కీళ్ళభాగంలో వాపు, ముట్టుకుంటే తీవ్రమైన సలుపు.

ఎముకల బలహీనత- ఇవన్నీ కీళ్ళ నొప్పుల జబ్బులో భాగాలే.

రుమటాయిడ్ ఆర్థ్రైటిస్ అనేటువంటిది అంతర్గతంగా ఏర్పడే సమస్య. శరీరంలోస్వయంవిధ్వంసం కారణంగా వచ్చే డయాబెటిస్ వంటిది. అది ఎందుకు వస్తుందో, ఎలా వస్తుందో ఇదమిత్థంగా చెప్పలేనిది. ఒకవేళ వస్తే జీవితకాలం భరించాల్సినది.

కీళ్ళనొప్పుల వ్యాధులను శాశ్వతంగా తగ్గించివేయగలిగిన మందులు గాని, మార్గాలుగాని వున్నాయని చెప్పలేం. వ్యాధి ముదరకుండా, బాధ మరింత వేధించకుండా నియంత్రణలో వుంచుకోగలగటమే చెయ్యగలిగినది.

## యోగా

కీళ్ళు, కండరాలను ఒక క్రమపద్ధతిలో కదిలించటంద్వారా వాటిని తిరిగి స్వాధీనంలోకి తీసుకురావటం యోగా ద్వారా సాధ్యమవుతుంది.

ఇది ఒక్కసారిగా జరగదు. కాని సాధన ద్వారా సాధించగలుగుతారు. బిగుసుకుపోయినట్టుగా వున్న కీలు భాగాలు, పట్టేసిన కండరాలను సరైన మార్గం. ముఖ్యంగా వెన్నునొప్పి, ఇతర సమస్యలతో సతమతమయ్యే వారికి యోగాసనాలు సహాయపడతాయి.

## పెరుగు

మానవ శరీరంలో కొన్నిలక్షల సూక్ష్మజీవులు వుంటాయి. వీటిలో హాని చేసేవి, మేలుచేసేవి వుంటాయి. మేలు చేసే సూక్ష్మజీవులు తగినంతగా వుంటే ఆరోగ్యం మెరుగవుతుంది.

ఆహారంలో తప్పనిసరిగా పెరుగును తినమనేది అందుకే. పెరుగు పేగును శుభ్రపరుస్తుందంటారు.

శుభ్రపరచటమంటే వున్నవాటిని తొలగించటమే కాదు మేలుచేసేవాటిని అధికంచెయ్యటంకూడా. పెరుగు,కొన్ని రకాల ఆకుకూరలను తీసుకున్నప్పుడు మేలుచేసేటువంటి సూక్ష్మజీవులు అధికంగా తయారై కీళ్ళనొప్పుల బాధనుండి ఉపశమనం ఇస్తాయి.

## ఆకుకూరలు

ఆకుకూరలు చౌకగా లభిస్తాయి. అందుకే చాలామందికి వాటిమీద చిన్న చూపు. కాని ఆకుకూరలు చేసే మేలు చాలా వుంది. తోటకూర, పాలకూర వంటివి తరచుగా తినాలి.

మనకు ఎన్నో రకాల ఆకుకూరలు లభిస్తాయి. బచ్చలి, గోంగూర, చుక్కకూర వంటివి. అయితే గోంగూరతో కొన్నిరకాల ఇబ్బందులు వుంటాయి.

మిగిలిన ఆకుకూరల్లోని విటమిన్లు ఎముకలకు మేలుచేస్తాయి. ఎముకలలోని క్యాల్షియమ్‌ని తగ్గనివ్వవు. ఒక వయసు తర్వాత ఎముకలు బలహీనపడి పెళుసుగా తయారవుతాయి.

తుంటి ఎముకలు చాలా సులభంగా చిట్లటం లేదా విరగటం జరుగుతుంది. ఆటువంటి ప్రమాదం నుండి రక్షించగలిగినవి ఆకుకూరలు. ఆకు

కూరల్లోని పోషకపదార్థాలను సులభంగా గ్రహించటానికి కొంచెం నిమ్మరసం జోడిస్తే మరీ మంచిది.

## పసుపు

**ప**సుపుతో పలురకాల లాభాలున్నాయి. ఆయుర్వేదం పసుపులోని ఔషధగుణాలను గుర్తించి దానినిఆహారంలో భాగంగా చేసింది. కూరలలో, పచ్చడులలో పసుపును వాడతారు.

ఆ పసుపులోని కుర్కుమిన్ అనే


Courtesy : SANANDA

రసాయనం వాపులను తగ్గిస్తుంది. దీనిలోని యాంటీ ఆక్సిడెంట్స్ ఆరోగ్యాన్ని అందిస్తాయి. పసుపును ప్రాథమిక చికిత్సలో వాడటం మన ఇళ్ళలో పరిపాటి. గాయం తగిలితే పసుపుఅద్దుతారు. చిన్నచిన్న కురుపులకు వాడతారు.

కీళ్ళనొప్పులకు పసుపు వాడవచ్చు. వేడిపాలలో పసుపుకలుపుకునితాగాలి. పాలలోని కొవ్వులు, పాలను వేడిచేసినందువల్ల వచ్చినటువంటి ఉష్ణోగ్రతల వల్ల పసుపులోని మేలుచేసే రసాయనాలు సులభంగా శరీరానికి వంటబడతాయి. కీళ్ళనొప్పుల బాధనుండి బయటపడేస్తాయి.

## మిరప

**మి**రపకాయలు వాటికారం గురించి తెలియనివారెవరూ వుండరు. మిరపకాయలు రుచికి వాడతాము.

అయితే అందులో కారం అందించే కాప్సైసిన్ అనే పదార్థం ఔషధంగా పనిచేస్తుంది. కీళ్ళబాధనుండి నివారణకు తయారుచేసే పలు ఆయింట్మెంట్స్‌లో కాప్సైసిన్ వుంటుంది.

ఇది రాసినప్పుడు అందరికి మంట అనిపిస్తుంది. కాని అందరికి ఒకేలాంటి ఉపశమనం కలిగించదు.

దీని ప్రభావం ఒక్కొక్కరి మీద ఒక్కోవిధంగా వుంటుంది.

## గ్లూటెన్

**గ్లూ**టెన్ అనేది ఒక ప్రొటీన్. పలు రకాల ధాన్యాలలో ఇది లభిస్తుంది. గోధుమ, బార్లీ, ఓట్స్ వంటివాటిలో వుండే గ్లూటెన్‌వల్ల కీళ్ళవాపు వస్తుంటుంది. గ్లూటెన్ పెరిగితే బాధ అధికమవుతుంది.

అదిగమనించినవారు గ్లూటెన్‌కి దూరంగా వుండటంమంచిది.

గ్లూటెన్ శరీరంలోకి చేరకుంటే కీళ్ళబాధ తగ్గుతుంది, కీళ్ళు సులభంగా కదులుతాయి.

బాధపరిమితంగా వుంటుంది. అయితే గ్లూటెన్‌ని దూరంగా వుంచాలన్న ఆలోచనలతో మిగిలిన పోషకపదార్థాలను వదులుకోవటం అవుతుంది.

కాబట్టి గ్లూటెన్ వల్ల కీళ్ళనొప్పుల బాధకి గురవుతున్నవారు వైద్యుని సంప్రదించి, పోషకపదార్థాల లోపం కలగకుండా, గ్లూటెన్‌చేరకుండా ఎటువంటి ఆహారం తీసుకోవచ్చో తెలుసుకుని అనుసరించటం మంచిది.

## కాపడం

**కీ**లుభాగంలో వాపులేదా నొప్పివున్నప్పుడు వెంటనే 'పెయిన్‌కిల్లర్' మాత్ర వేసుకోవటంకన్నా బాధిస్తున్న ఆ భాగానికి కాపడంపెట్టటం మంచిది. వేడి కాపడం వాపును తగ్గిస్తుంది, బాధనుండి ఉపశమనం తెస్తుంది. కొంతమంది బాధకు వేడికాపడం కాక చల్లదనం కల్పించాల్సి వుంటుంది.

ఐస్ ముక్కను బాధించే భాగానికి పెడితే వాపు తగ్గి క్రమంగా బాధ పరిమితంగా వుంటుంది.

## సంగీతం

**సం**గీతం బాధానివారిణి. అలజడిలో వున్న మనసుకు ప్రశాంతతను ఇచ్చేది సంగీతం. ఆ సంగీతం వింటే మనసే కాదు, శరీరంలోని బాధ కూడా పోతుంది అంటున్నాయి పరిశోధనలు. నచ్చిన సంగీతాన్ని ఇరవై నిమిషాలు విన్నవారికి బాధ సగం తగ్గిపోతుంది.

ఇక సంగీతాన్ని స్వయంగా సాధనచేస్తే బాధ నుండి ఉపశమనం కలుగుతుంది.

మనసును బాధమీదనుండి మరలించగలిగిన శక్తి సంగీతానికుంది.

బాధిస్తున్న కీళ్ళు, కండరాలు రిలాక్స్ అయి నొప్పిని దూరంచేయగలదు సంగీతం అని ప్రయోగాలు చెపుతున్నాయి.

ఇలా నొప్పి అనగానే అలా ఒక మాత్ర మింగటం అనే అలవాటు అంత మంచిది కాదు. పలురకాల మందుల వల్ల సైడ్ ఎఫెక్ట్స్ వుంటాయి. అటువంటి వాటినుండి బయట పడేయగలిగిన ఇతర మార్గాలను ముందుగా చూసుకుని తప్పనిసరి పరిస్థితిలోనే మందులను వేసుకోవటం మంచిది.

ఇది కీళ్ళనొప్పులు, వాపులకే కాదు ఇతరబాధలకూ అనుసరించదగినది.

**కె.యశ్వంత్**

# Whats App

ఈ రోజుల్లో తాగి, బండి నడపటమన్నది సమస్యే కాదు. ఎందుకంటే ఒకే రోజు పెట్రోలు, ఆల్కహాల్ కొనగలిగే డబ్బు ఎంత మంది దగ్గరుంటుంది?

☺ టైమ్ బాగుంటే, మన తప్పులని జనం జోకులుగా భావిస్తారు. టైమ్ బాగోపోతే జోకులను కూడా తప్పు అంటారు.

☺ ఆనంద్ : "లావూ డియర్ ఇంట్లో అందరూ సినిమాకెళ్ళారు. త్వరగా వచ్చెయ్ ఇద్దరం కలిసి ఏదైనా చేద్దాం.
లావణ్య : ఒరేయ్ వెధవా! నీ మాటలు నేను నమ్మను గాక నమ్మను. మొన్న వారం ఇలాగే పిలిచి ఇంట్లో అంట్లన్నీ నాతో తోమించావ్.

☺ ఓ తండ్రి తన కొడుకుకిలా వాట్సాప్‌లో మెసేజ్ పెట్టాడు. "ప్రియమయిన కుమారా! నీ తండ్రి, నీ తల్లి, నీ టీచర్ నిన్ను అనవసరంగా కఠినమయిన నియమాలతో రాచి రంపాన పెడుతున్నారని అనుకుంటున్నావా? అయితే కొన్ని రోజులు ఓపికపట్టు పెళ్ళాం వస్తుంది"

☺ బెంగళూరులో మేలో జరిగిన ఎన్నికల్లో ఓటు వేయటానికి వెళ్ళాడు రంగారావు. పోలింగ్ బూత్ లోపలికెళ్ళి ఓటు వేసిన తరువాత తిరిగి వస్తూ, అక్కడున్న పోలింగ్ ఏజెంట్‌ను అడిగాడు.
"మా ఆవిడ ఓటు వేయటానికి వచ్చిందా?"
పోలింగ్ ఏజెంట్ ఓటర్ల లిస్ట్ చూసి "అవును వచ్చారు, ఓటు వేశారు, కాస్సేపటిక్రితం"
అది విన్న రంగారావు బాధపడుతూ "నేను కొద్దిగా ముందొస్తే బాగుండేది. ఆవిడని కలిసుండేవాడిని.
పోలింగ్ ఏజెంట్ ఆశ్చర్యంగా "మీరు, ఆంటీ కలిసి ఉండట్లేదా?"
రంగారావు "లేదు. ఆమె 15 ఏళ్ళక్రితం చనిపోయింది. కాని, ప్రతి ఎన్నికలప్పుడూ తను వచ్చి ఓటేస్తోందని మాత్రం నాకు తెలిసింది"

☺ భార్య : ఎండలో మిట్టమధ్యాహ్నం ఎక్కడికి వెళుతున్నారు?
భర్త : డాబాపైకి వెళ్ళి పిట్టలకు నీళ్ళుపెట్టి వస్తాను.
భార్య : అక్కర్లేదు, కిందకి దిగిరండి. మీ పిట్టలన్నీ పుట్టింటికెళ్ళాయి.

☺ ప్రతిమనిషిలో ఒక 'రాక్షసుడు' వుంటాడు. ఆధార్‌కార్డ్ జిరాక్స్‌లో వాడు బయటకివస్తాడు.

☺ ఉత్తరాఖండ్‌లోని సియాంజి గ్రామంలో, ఎవరి ఇంటిముందు ఎక్కువ మొక్కజొన్న కండెలు వేళ్ళాడేసివుంటే ఆ ఇంటి వారంతా ధనవంతులని అర్థం.

☺ పాతరోజుల్లో పిల్లలు అమ్మమ్మ వాళ్ళింట్లో పుట్టేవారు. సెలవులకు తరచుగా అమ్మమ్మ దగ్గరకు వెళ్ళేవాళ్ళు. ఈ రోజుల్లో పిల్లలు హాస్పిటల్స్‌లో పుడుతున్నారు. తరచుగా అక్కడికి వెళుతున్నారు.

☺ సునంద : రవీ! నువ్వు నన్ను ఎంతగా ప్రేమిస్తున్నావు?
రవి : ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ "నక్షత్రాల వంక చూడు. అంతగా నేను ప్రేమిస్తున్నాను నిన్ను"
సునంద : అయోమయంగా "ఇది పగలు కదా, నక్షత్రాలు లేవు కదా?"
రవి : తలూపుతూ 'అవును' అన్నాడు.

☺ మంచి స్నేహితులు అద్దంలా, నీడలా వుంటారు.
అద్దం అబద్ధం చెప్పదు.
నీడ మనల్ని విడిచి వెళ్ళదు.

☺ ఓ హాస్పిటల్ ఐసియులో వున్న వ్యక్తి ఆ రోజు రాశిఫలం చూసుకుంటే ఇలా వుంది.
'ఈ రోజు చాలా మంచిరోజు. దూరప్రయాణం చేస్తారు.ఖర్చు తక్కువ.పాతమిత్రులను,బంధువులను కలుసుకుంటారు. ఆటంకాలు లేకుండా ప్రయాణం సుఖంగా సాగుతుంది.

---

సరోజాపురం కాలనీలోని పెళ్ళైన ఆడవాళ్ళందరూ కలిసి ఓ పిక్నిక్‌కు వెళ్ళారు. ఆ పిక్నిక్‌లో ఈవెంట్స్ నిర్వహించే కాంతమ్మ వచ్చి "డియర్ ఫ్రెండ్స్! చివరిసారిగా మీరు మీ భర్తలకు 'ఐ లవ్ యు' అని మెసేజ్ ఎప్పుడు చేశారో చెప్పండి" అంది. కొందరు వారంక్రితం అని, ఇంకొందరు రెండు రోజులక్రితం అని, మరి కొందరు గుర్తులేదని చెప్పారు.
అప్పుడు కాంతమ్మ "ఓకే, నో ప్రాబ్లమ్. ఇప్పుడు మీరు మీ భర్తలకు 'ఐ లవ్ యు' మెసేజ్ పెట్టండి. ఎవరికైతే వారి భర్తనుండి మొదటగా 'ఐ లవ్ యూ టూ' అని రిప్లై మెసేజ్ వస్తుందో వారికి గొప్ప బహుమతి ఇస్తాం" అంది.
అందరూ మెసేజ్‌లు పెట్టారు.వారికొచ్చిన రిప్లైలు ఇలా వున్నాయి.

+ ఏమే, పిక్నిక్‌లో ఎవరి గొలుసు అయినా నచ్చిందా?
+ ఏంటి సంగతి?
+ ఈ రోజు మళ్ళీ వంట చేయలేదా?
+ స్వీటీ, అంతా బానే వుంది కదా?
+ డార్లింగ్, ఇంటిఖర్చులకి ఇచ్చిన డబ్బులు అయిపోయాయా?
+ ఇక్కడ నేను పని టెన్షన్‌తో చస్తుంటే, ఈ మెసేజ్‌లేంటే బుర్రగాని దొబ్బిందా?
+ ఓ మళ్ళీ యాక్సిడెంట్ చేశారా?
+ ఒకే అర్థమైయింది. ఇవాళ్ళ కూడా పిల్లాడిని నేనే స్కూల్‌నించి తీసుకురావాలి అంతేనా?
+ ఏమే. ఈ మెసేజ్ నిద్రలో వుండిపెట్టావా? లేక నాకేమైనా కలొచ్చిందా?

# ప్రణయం ఎవ్వడివన్నా...?

కొంత అయిష్టంగా వెళ్ళిన విష్ణు చెప్పాడు. "నేను మీ టైమ్ ఎక్కువగా తీసుకోను చాలా బ్రీఫ్‌గా నాగురించి చెబుతాను"అన్నాడు.పరిస్థితి సగానికిపైగా అర్థమైంది.

"సరే చెప్పండయితే" అన్నాడు డాక్టర్ చటర్జీ.

అతడు చెప్పసాగాడు. "నేనూ యశూ ఒకర్నొకరం ప్రేమించుకున్నాం! ఇప్పటికీ నన్ను ప్రేమిస్తున్న అమ్మాయ్ ఇప్పుడు మరొక అబ్బాయిని అంతే గాఢంగా ప్రేమిస్తున్నానని అంటోంది. నేను నా ప్రియురాలిని అతనితో కలిసి షేర్ చేసుకోలేను. దటీజ్ నాచురల్ కదా?" అన్నాడు విష్ణు.

డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

అవునన్నట్టుగా తలూపాడు. "అందుకని ఆ అమ్మాయిని 'నేను కావాలా? అతడు కావాలా' తేల్చుకోమని అడిగాను. కానీ ఆమె ఇద్దరూ కావాలంటుంది. అలా ఎలా కుదురుతుంది?"

"ఇది చాలా టిపికల్ కేస్!" సానుభూతిగా చెప్పాడతను. అంతే! విష్ణుముఖంలో ఒక్కసారిగా గుప్పునవెలుగు! తనని ఒకరు అర్థంచేసుకున్నారుకదా అన్న రిలీఫ్ చోటుచేసుకుంది. కౌన్సిలర్ వరుసగా కొన్ని ప్రశ్నలడిగాడు. ఆ ప్రశ్నలన్నింటికీ విష్ణు సమాధానాలు చెప్పాడు. చివరగా కొంత విశ్లేషణ ఇచ్చాడు. "ఆ అమ్మాయి సింగిల్ చైల్డ్‌గా పెరిగింది కాబట్టి ఆమెకు తనభావాల్ని పంచుకునే తోడులేరు. ఇక్కడ నువ్వు ఆమెకి ఒక బిగ్ బ్రదర్‌లా దొరికావు.

ఆమె మనసులోని మాటలన్నింటినీ నీతో స్వేచ్ఛగా పంచుకోగలిగింది.ఆలోచించు!అది నిజమోకాదో నీకే తెలుస్తుంది"అన్నాడు.అతను ఆలోచనలోపడ్డాడు.

"అదేవిధంగా ఆమెతో నీలో ఒక స్నేహితుణ్ణి కూడా చూసుకుంది. అందుకే ఆమె తన మనసులోని భావాల్ని దాచుకునే ప్రయత్నం కూడా చేయకుండా అన్నీ నీతో షేర్‌చేసుకోగలిగింది. రైట్?" అడిగాడతను. అతనికి నిజమే కదా అనిపించింది.

అక్కడ్నుంచి వచ్చిన తర్వాత అతని ఆలోచనా దృక్పథం మారిపోయింది.

యశస్విని ఆశ్చర్యపోయి మైత్రేయి మెయిల్ మొత్తం మళ్ళీ ఒకసారి చదువుకుంది. యశూ! నీకు చెప్పటానికి నాకు చాలా బాధగా వుంది. నీకు తెల్సా? నేను, బిందు ఇద్దరం బ్రేకప్ అయ్యాము.

అయామ్ సో స్యాడ్! ఈ బాధని ఎవరితో షేర్ చేసుకోగలనా! అని ఆలోచిస్తుంటే నువ్వు గుర్తొచ్చావ్! నీతో చెప్పటం వల్ల ఒకసారి అంతా నాకు నేను చెప్పుకున్నట్టుగా ఉంటుంది. అసలేం జరిగిందో నేను నీ దగ్గరకు వచ్చిన తర్వాత చెబుతాను. నేను వన్స్ ఫరాల్ ఇండియాకి వస్తున్నాను. నాకు ముందుగా మా ఇంటికి వెళ్ళాలని లేదు.

ఎందుకంటే అక్కడఅందరూ నన్నెలా రిసీవ్ చేసుకుంటారో నాకు తెలియదు. ముందుగా బెంగళూరు వచ్చి ఏదైనా జాబ్ వెతుక్కుంటాను.





## అందుకోవాల్సిన అవకాశం

**బాలీవుడ్** హాటెస్ట్ భామ హ్యూమాఖురేషి 'కాలా'లో నాలుగు పదుల ప్రౌఢగా నటించి అబ్బురపరిచింది. హీరోయిన్‌గా కెరీర్ సాగాల్సిన దశలో మిడిల్ ఏజ్ మహిళగా నటించడం గురించి అడిగితే నవ్వులతో వివరించింది.

"'కాలా'లో రజనీకాంత్‌గారి తత్వంతో సమానమైన గాంభీర్యంగల పాత్ర నాది. ఆయనతో సినిమా అనగానే రెండు చేతులూ చాచి అందుకోవాల్సిన అవకాశం అనిపించింది.

మొదట్లో ఆయనతో కలిసి నటించడం అంటే భయపడ్డాను కాని, రజనీకాంత్‌గారిని చూసిన తర్వాత అదంతాపోయింది. సినీ విషయాల్లోనే కాకుండా జీవితానికి సంబంధించి కూడా ఎంతో నేర్చుకోవాల్సిన వ్యక్తి ఆయన" అంటూ కితాబులు ఇచ్చింది.

## జరిగిన కథ (20)

**య**శస్విని చూసేందుకు ఆమె మేనత్త కవిత వస్తుంది. ఆవిడ రాక యశస్వికి కొత్త ఉత్సాహాన్ని ఇస్తుంది.

తను గంధర్వ్‌ని, విష్ణుని ఇద్దర్నీ ప్రేమిస్తున్నానని చెప్పేసరికి ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవని చెబుతుందామె. ఇంకా అనేక రకాలుగా హితవు చెప్పినా యశస్వికి తలకెక్కదు.

తను ప్రాణప్రదంగా ప్రేమించిన యశస్వి, గంధర్వ్‌ని ప్రేమిస్తుంది అన్న సంగతిని జీర్ణించుకోలేకపోతాడు విష్ణు.

యశస్వి ఒక అద్భుతమైన కానుక అని రేష్మతో చెబుతాడు విష్ణు. రేష్మతో విష్ణు మాట్లాడుతుండగానే చక్రి నుండి ఫోన్ వస్తుంది విష్ణుకి.

యశస్వి విష్ణుకి చేసిన మోసం గురించి విష్ణుతో చక్రి సంభాషిస్తుండగానే కోపంతో ఫోన్ కాల్‌ని కట్ చేస్తాడు. విష్ణులో వస్తున్న మార్పుని గమనిస్తుంది నీతూ. సైకియాట్రిస్ట్ దగ్గరకు వెళదామని విష్ణుతో చెప్పి డాక్టర్ చటర్జీతో అపాయింట్‌మెంట్ తీసుకుంటుంది నీతూ.

ఇక జరగబోయేది చదవండి.

ఒక వారంరోజులు నీ దగ్గర షెల్టర్ ఇవ్వగలవా? నీ దగ్గర ఐతే నేను కంఫర్టబుల్‌గా ఉండగలనని నాకన్పిస్తోంది. అందుకే నేను నీ దగ్గరకి వద్దామని అనుకుంటున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే! నీకు ఓకేనా? కొద్దిగా తేరుకున్న తర్వాత ఏదైనా హాస్టల్ కానీ లేదా పీజీ కానీ చూసుకుంటాను.

నేను పూర్తిగా కుదురుకున్న తర్వాత నేను ఇండియా వచ్చానని మావాళ్ళకు చెప్తాను.

'ఏమాత్రం మొహమాటపడకుండా నా దగ్గరకు రా!' అని రిప్లయ్ ఇచ్చి మైత్రేయి రాకకై ఎదురుచూడసాగింది. తను ముందుగా చెప్పిన రోజు ఉదయాన్నే మైత్రేయి లగేజీతో సహా ఫ్లాట్ ముందు నిలబడింది. ఆమెని సాదరంగా లోపలికి ఆహ్వానించి ఆమెకు కావలసిన సపర్యలన్నీ చేసి-

"నీకు జెట్‌ల్యాగ్ తీరే వరకు రెస్ట్ తీసుకో! నేను సాయంత్రం ఆఫీస్ నుంచి ఎర్లీగా వస్తాను! అప్పుడు మాట్లాడుకుందాం!" అని చెప్పి వెళ్ళిపోయింది.

యశస్విని ఆఫీసు నుంచి తిరిగి వచ్చిన తర్వాత మైత్రేయి చెప్పటం మొదలుపెట్టింది. "యశూ నీకు తెలుసా! నేను ప్రెగ్నెంట్ కావాలనుకుంటున్నాను" యశస్విని ఆశ్చర్యంగా "ఎలా?" అని అడిగింది.

"ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ ద్వారా!"

"అవునా?" అని ఆమె ఆశ్చర్యపోయింది.

ఇద్దరు స్త్రీలు కలిస్తే జీవించవచ్చునేమో కానీ కన్సీవ్ కావాలంటే ఖచ్చితంగా ఒక పురుషుడి అంశ కావలసిందే కదా! అది సృష్టి నియమం కదా?

ఆర్టిఫీషియల్ ఇన్‌సెమినేషన్ ద్వారా గర్భవతులైతే పుట్టబోయే బిడ్డలకు తండ్రి ఎవరో ఎలా తెలుస్తుంది? వారికి ఇద్దరు తల్లులుంటారు కానీ తండ్రి ఉండడన్న మాట! యశస్వి వేగంగా ఆలోచించసాగింది.

"నేను ప్రెగ్నెంట్ అయ్యాననే అపురూపమైన ఫీలింగ్ ఎక్స్‌పీరియన్స్ చేయటం, నా శరీరంలో ఒక బుజ్జి పాపాయిని మోయటం,

ఆ పాపాయి నా బొజ్జలో కదులుతూ ఉంటే ఆ కదలికల్ని నేను ఫీలవటం, నా ప్రాణాల్ని పణంగా పెట్టి ఆ పాపాయికి జన్మనివ్వటం, ఆ పాపాయికి పాలివ్వటం... ఇవన్నీ నేను కోరుకోవటం తప్పంటావా?" కాదు అన్నట్టుగా తల అడ్డంగా ఊపి "ఇటీజ్ నాచురల్!" అని చెప్పింది.

"కానీ బిందు ఒప్పుకోవటంలేదు. తనే ప్రెగ్నెంట్ అవుతానంటుంది" చెప్పిందామె.

యశస్వి గతుక్కుమంది. 'బిందుకూడా అమ్మాయే





# కేరళ అందాలు

కేరళ వెళ్తే కళ్ళనిండా ప్రకృతి సౌందర్యం పరుచుకుంటుంది. అలల తాకిడి ముద్దాడుతుంటే ఉదయాన్నే సముద్రపు అందాలు చూడడం, ఆకాశంలోని మబ్బులు భూమిపై నీలినీళ్ళను తాకుతున్నంత పరవశం, జాలరులతో స్నేహం-

ఉదయించే సూర్యబింబం, అస్తమించే సూర్యుడు, ఇసుకలో గుంతలు తవ్వుకునే పీతలు, తాబేళ్ళు రంగురంగుల వివిధ ఆకృతుల్లో ఉండే గవ్వలసేకరణ ఓ పక్క విందు చేస్తుంటాయి. ఇంకోవైపు ఎటు వెళ్ళినా సుగంధ ద్రవ్యాలతోటలు, సువాసనలు వెదజల్లుతుంటాయి. యాలకులు, దాల్చినచెక్క చెట్ల బెరళ్ళు, పండిన కోకోగుత్తులు, పెప్పర్‌వైన్స్-ఎన్నో.

సమీపంలోని సుగంధ దినుసుల దుకాణాల్లో బేరం ఆడుతూ కోరినన్ని కొనుక్కోవచ్చు.

కేరళ వంటకాల గురించి చెప్పనే అక్కర్లేదు. ఆధునిక ఎలక్ట్రానిక్ యుగానికి దూరంగా పల్లె అందాల్లో, ప్రకృతి నడుమ సేదతీరి, సరికొత్తగా రీఛార్జి చేసుకోవడానికి అనువైన ప్రదేశం కేరళ. ◆






కాబట్టి ఆమె యాంగిల్‌లోంచి అది కూడా ప్రకృతి సహజసిద్ధమైన కోరికేకదా! అందులో తప్పేముంది?

కానీ ఏమిటిది? ఒకే ఇంట్లో ఉంటోన్న ఇద్దరమ్మాయిలు గర్భవతులై, తండ్రెవ్వరో తెలియని బిడ్డలకు తల్లులై... దాదాపుగా సింగిల్ పేరెంట్స్‌లానే ఆ పిల్లల పెంపకమంతా ఒంటిచేత్తో... అయ్యో!

ఎంత కష్టం తల్లీ?

వీరిలాగానే అటుపక్క పురుషులుకూడా ఒకరితో ఒకరు కలిసి జీవిస్తూ స్వలింగ సంపర్కానికి అలవాటు పడి కేవలం స్పెర్మ్ బ్యాంకులకు తమ స్పెర్మ్‌ని డొనేట్ చేస్తూ... ఛా! ఛా!! ఎందుకీ అవస్థ?

"మా రిలేషన్‌షిప్‌లో నేను వైఫ్‌గా, తను హబ్బీగా ఉన్నాము. కాబట్టి లెక్కప్రకారం అక్కడ ప్రెగ్నెంట్ అవడానికి నేను ఎలిజిబుల్. కానీ బిందు ఒప్పుకోలేదు. తను ప్రెగ్నెంట్ అవుతానంది" అంటూ ఆగింది.

యశస్వి మనసులోనే ఆలోచించుకోసాగింది. 'ఒకప్పుడు మేమిద్దరమూ ఒకటే! మా ఇద్దరి హార్మోన్స్ ఒకటే, మా ఎమోషన్స్ ఒకటే అనుకున్నారు.కానీ హార్మోన్స్ ఒకటే అవడం వల్ల ఒకేరకమైన కోరికలూ కలుగుతాయన్న ఆలోచనెందుకు రాలేదు?

"తనంటే నాకు చాలా ప్రేమ! తనేదడిగినా నేను కాదనను! ఇంకొన్నాళ్ళు ఆగితే, మా ఇద్దర్లో తనే ప్రెగ్నెంట్ అవటానికి నేను ఒప్పుకునేదాన్నేమో?! కానీ ఆమె నన్ను చాలా హర్ట్ చేసింది.

నాకు సైట్ ఉండడం, ఆమెకన్నా నేను తక్కువ హైట్ ఉండటం,నాకు అప్పుడప్పుడు ఆస్తమా రావటం నా తప్పా?" అని అడిగింది.

కాదన్నట్టుగా తల అడ్డంగా ఊపింది.

"మరి నువ్వే చూడు ఆ బిందు ఎలా మాట్లాడిందో? ఇవన్నీ నెగెటివ్ క్వాలిటీస్ అని, పుట్టబోయే పిల్లలకు కూడా ఈ లక్షణాలు జన్యుపరంగా వస్తాయని, అందుకే నేను ప్రెగ్నెంట్ కావడానికి అర్హురాలిని కానని నాతో ఆర్గ్యుమెంట్ పెట్టుకుంది. నేను చాలా హర్ట్ యాను. పుట్టబోయే పిల్లలు అందంగా, ఆరోగ్యంగా ఉండాలని అందరికీ ఉం టుంది.

కానీ నా బాధంతా ఆమె నన్నర్థం చేసుకోలేదని! నేను మొదటిసారిగా ఆమెతో గొడవపడ్డాను. నన్ను సెల్ఫిష్ గాళ్ అంది"

అదంతా గుర్తొచ్చి కాబోలు ఆమె గొంతు భారంగా తయారయ్యింది. మాటల కోసం వెతుక్కుంటున్నట్టుగా కాసేపాగి మళ్ళీ చెప్పింది "నెమ్మదిగా నాకు ఒక ఫీలింగ్ కలగసాగింది.

నేను బిందుతో కాకుండా ఒక అబ్బాయితో కలిసి జీవిస్తే అతను నన్నిలా హర్ట్ చేసి ఉండేవాడు కాదు. నీకు నెగెటివ్ పాయింట్స్ ఎక్కువగా ఉన్నాయ్ కాబట్టి నేనే ప్రెగ్నెంట్ అవుతా అని ఓ మగాడు నన్ను అనలేడు కదా! అని అనిపించసాగింది.

నేను ఎంచుకున్న దారి సరయ్యింది కాదనుకుంటా! మా రిలేషన్‌షిప్‌లో ఎక్కడో, ఏదో లోపం ఉందనిపించింది. అందుకే మేమిద్దరమూ విడిపోయాము.

నీకు తెల్సా? నేను ఒక ప్రేమికురాల్ని మాత్రమే కాదు, ఒక మంచి స్నేహితురాలిని కూడా కోల్పోయాను" అంటూ దుఃఖించసాగింది.

యశస్వి ఆమె తలనిమిరింది. టిష్యూ పేపర్‌తో కళ్ళు తుడుచుకుంటుండగా యశస్వి లేచి గ్లాసుతో మంచినీళ్ళు తీసుకొచ్చి, ఆమెతో త్రాగించింది.

ఆమె తేరుకుని మళ్ళీ చెప్పసాగింది.

"ఏమో యశూ! వ్యక్తికి నచ్చినట్లు బ్రతికే హక్కు ఉన్నంత మాత్రాన ఇలా విపరీతంగా, ప్రకృతివిరుద్ధంగా స్వలింగసంపర్కాలకు పాలుపడకూడదేమో?

అలాంటి అన్నాచురల్ రిలేషన్‌షిప్స్ ఇలాంటి పరిణామాలకు దారితీస్తాయేమో? ఏమో! నేను నా విషయంలో జరిగింది చెప్తున్నాను. త్వరగానే బయటపడ్డాను. ఇంకా కొన్నాళ్ళు కలిసి వుంటే ఇంకెన్ని విషయాల్లో డిఫర్ అయ్యేవాళ్ళమో? ఇంకా ఎంత పోట్లాడుకునేవాళ్ళమో? ఏదేమైనా నేను తిరిగి ఇంటికి వెళ్తే మా పేరెంట్స్ ఎలా రియాక్ట్ అవుతారో తెలియదు"

"ఇట్సోకే! ఎవ్రీథింగ్ విల్ బి ఆల్‌రైట్! ఇప్పుడు నువ్వు చాలా డిస్టర్బ్‌డ్‌గా ఉన్నావు. ఇప్పుడేమీ ఆలోచించకు. కొంతకాలమైన తరువాత ఏ నిర్ణయం తీసుకోవాలో ఆలోచిద్దాం! కూల్! ముందు నువ్వు రెస్ట్ తీసుకో!" అంటూ నచ్చచెప్పింది.

మైత్రేయి పడుకున్న తర్వాత తీరుబడిగా ఆమె ఇంటర్నెట్ బ్రౌస్ చేసింది.

ఇద్దరు స్త్రీల మధ్య సంబంధాలు అనేవి పాశ్చాత్య పోకడలు మాత్రమే అనుకోవడానికి వీల్లేదు. మన దేశంలో కూడా ఇలాంటి సంబంధాలు ప్రాచీన కాలం నుంచి అక్కడక్కడా చూస్తూనే ఉన్నాము.

అందుకు ఉదాహరణ... ఎన్నో ఏళ్ళ క్రిందట షబానా అజ్మీ నటించిన "ఫైర్" చిత్రమే!

ఆ చిత్రంలో పురుషుని నిర్లక్ష్యానికి, నిరాదరణకు

గుర్తైన స్త్రీలు ఒకరిని ఒకరు ఓదార్చుకునే క్రమంలో శారీరకంగా కూడా దగ్గరై ఆ అవసరాల్ని తీర్చుకుంటూ ఉంటారు.అదేవిధంగా ఎంతవరకు నిజమో తెలీదు కానీ తను స్పోర్ట్స్ విమెన్ విషయంలో కూడా ఇలాంటి స్వలింగ సంపర్కాన్ని కొంతమంది కోచ్‌లే ప్రోత్సహిస్తారని వింది. అబ్బాయిలతో ఎఫైర్లు పెట్టుకుని ఎమోషనల్‌గా కమిటైతే కెరీర్ దెబ్బతింటుంది.

శారీరకావసరాలు తీరుతుండటంవల్ల ఇతర రకాలైన ఆలోచనలేవీలేకుండా కెరీర్‌మీద మరింత బాగా శ్రద్ధపెడతారన్నది వారి ఉద్దేశ్యం!

అయినా ఈ స్వలింగ సంపర్కుల మానసికస్థితి సహజమేనా? ఇవి ప్రకృతి విరుద్ధమైన అసహజమైన స్థితి కదా? స్త్రీ, పురుషుల మధ్య సంబంధాలు ప్రకృతి సహజమైనవిగా భావిస్తున్నప్పుడు ఇలా ఇద్దరు స్త్రీల మధ్య ఏర్పడే బంధాలు అసహజమైనవే కదా?

అస్సలు ఇలాంటి సంబంధాలు ఎందుకు ఏర్పడుతున్నాయ్? పుట్టి పెరిగేక్రమంలో ఎదురయ్యే వ్యక్తిగత,సామాజికవాతావరణ ప్రభావమా? అంటే ఇద్దరు అమ్మాయిలు కలిసి తిరగడంవల్ల ఎవరికీ ఏ అభ్యంతరమూ ఉండదు. అదే ఒక అమ్మాయి, అబ్బాయి కలిసి తిరిగితే ఆ స్నేహాన్ని మన సమాజం అంత త్వరగా ఆమోదించదు. ఇందువల్ల ఇలాంటి సంబంధాలు ఏర్పడుతున్నాయా?

లేదంటే జన్యుపరంగా వాళ్ళల్లో ఏవైనా దోషాలుండటం వల్ల పుట్టుకతో ఇలాంటి స్థితి వస్తుందా? లేదంటే వాళ్ళు తింటున్న ఆహారంలో ఏదైనా లోపం వుందా? ఇలాంటి సంబంధాల వలన భవిష్యత్తులో పరిణామాలు ఎలా ఉంటాయి?

ఇంటర్‌నెట్‌లో రకరకాల లింక్స్...

చట్టబద్ధత ఉండటం, లేకపోవటమనేది వేరే విషయం. మానవ సమాజము ఒక క్రమపద్ధతిలో సాగిపోవాలి అంటే స్త్రీ పురుషులిద్దరూ అవసరమేకదా!

ఓ ప్రైవేట్ టీవీఛానెల్‌లో ఆ న్యూస్ చూసి అందరూ విస్తుపోయారు. గంధర్వ్ పెళ్ళి చేసుకోబోతున్నాడన్న ఆ వార్త చూడగానే అకాడమీలో అందరూ షాకయ్యారు. 'నీకు తెల్సా? అంటే నీకు తెల్సా?' అని ఒకర్ని ఒకరు ప్రశ్నించుకున్నారు.

కానీ ఎవరికీ తెలీదు. గంధర్వ్ తనకే కాదు ఎవరికీ మాట మాత్రం చెప్పలేదని యశస్వికి అర్థమైంది. కారణమేంటో తర్వాత తెలిసింది. ఆకాశం నిండా మబ్బులు కమ్ముకున్నాయ్.

ఆమె ఇంటికి వెళ్ళేసరికి విష్ణు సోఫాలో కూర్చుని ఎదురుగా టీపాయ్ మీదున్న ల్యాప్‌ట్యాప్‌లో ఏదో వర్క్ చేసుకుంటున్నాడు.

అతడ్ని చూడగానే కొన ఊపిరితో కొట్టుకుంటున్న ప్రాణం లేచి వచ్చింది. వయొలిన్ టేబుల్ మీద పెట్టింది.

అతను 'ఈ టైమ్‌లో వచ్చిందేమిటి?' మనసులో అనుకున్నాడుకానీ పైకిఏమీ అన్లేదు. ఓ కన్నూ ఓ చెవీ మాత్రం ఆమె

## సొగసరి చదువరి

శ్రీలంకలో పుట్టి బహ్రెయిన్‌లో పెరిగిన జాక్వెలిన్ ఫెర్నాండెజ్ అందాల బొమ్మ, మంచి నటి మాత్రమేకాదు. చదువరి కూడా.

సిడ్నీ యూనివర్సిటీనుంచి మాస్ కమ్యూనికేషన్స్‌లో డిగ్రీ తీసుకున్నది. అంతేనా- బోలెడన్ని భాషలూవచ్చు. ఇంగ్లీష్, హిందీ, ఫ్రెంచ్, స్పానిష్, అరబిక్ భాషలు అనర్గళంగా మాట్లాడేస్తుంది.

మోడలింగ్‌కోసం ఇండియాలో కాలుపెట్టాక,బాలీవుడ్ అవకాశాలు వెన్నంటాయి. 'కిక్' ఆమె కెరీర్ రూటుమార్చేసింది. శ్రీలంకలో 'కీమాసూత్ర' రెస్టారెంట్ నడుపుతున్నది.అనుకోకుండావచ్చేసి, ఎంతలా పాతుకుపోయిందో కదా.



కోసమే కేటాయించి, మామూలుగా ఉన్నట్టు కన్పించటానికి ప్రయత్నిస్తూ పని చేసుకోసాగాడు.

అతని దగ్గరకు నడిచి వచ్చి నెమ్మదిగా అడిగింది. "విష్ణూ! నేను నీ ఒళ్ళో తలపెట్టుకుని పడుకోవచ్చా?"

"ష్యూర్ కమాన్!" అతను ప్రేమగా రెండుచేతులూ చాచాడు. ఆమె వచ్చి సోఫాలో అతని ప్రక్కన కూలబడ్డట్టుగా కూర్చుంది.

అతను టీపాయ్‌ని కొంచెం దూరంగా జరిపాడు. ఆమె అతని ఒడిలో తలపెట్టుకుని పడుకుంది. అతనేమీ మాట్లాడలేదు.నెమ్మదిగా ఆమె తలనిమురుతూ, ఆమెకేమాత్రం నొప్పి తెలీకుండా జుత్తుకున్న క్లిప్ తీసేశాడు. ఆమెకి ఆ సంగతి కూడా తెలియలేదు.

'గంధర్వ్ నావాడు! నా స్వంతం! చాలా మర్యాదగా చెబ్తున్నాను. నువ్వికనుంచీ గంధర్వ్‌ని మర్చిపోవాలి! దట్సిట్! లేదంటే అస్సలు ఉపేక్ష అంటే ఏమిటో మీరంతా చూస్తారు' అదేమాట చెవుల్లో మార్మోగుతోంది.

ఆ ఉపేక్ష గంధర్వ్ ఉడ్ బీ... ఎంతో పోష్‌గా ఉన్న ఉపేక్ష, ఎందరినో కాదని, గంధర్వ్‌ని ఏరి కోరి పెళ్ళి చేసుకుంటున్న ఉపేక్ష... కాస్తయినా మర్యాదలేకుండా అన్నన్ని మాటలు ఎలా అంది? తనని ఒక్కదాన్నేకాదు అందర్నీ అలానే అంది మరీ ముఖ్యంగా ఫిమేల్‌స్టాఫ్‌ని! తనే కాదు. ప్రతి ఒక్కరూ హర్టయ్యారు.

ఒక్క అరగంటలో ఒక సునామీ వచ్చి వెళ్ళినట్లయ్యింది. ఇంత జరుగుతుంటే గంధర్వ్ అక్కడే ఉన్నాడు. చిర్నవ్వుతో చూస్తూ దీపపుస్తంభంలా నిలబడ్డాడు తప్ప ఆ అమ్మాయిని ఒక్కమాట కూడా అనలేదు. ఆపే ప్రయత్నం చేయలేదు.



**ఇకనుండి 5, 8 తరగతులలో డిటెన్షన్ వుంటుంది. ఒకే పరీక్ష రెండుసార్లు తప్పితే తిరిగి చదవాల్సిందే.**

-ప్రకాష్ జవదేకర్, కేంద్రమంత్రి

ఒక ప్రైవేట్ టీవీఛానెల్ ఓనర్ కూతురు అతని ప్రేమలోపడింది! వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోబోతున్నారు అన్న వార్తవినగానే తామందరూ ఎంతో సంతోషించారు? కానీ ఇది ఎవరూ ఊహించలేదు.

తలచుకుంటేనే తలంతా హోరెత్తుతోంది. అవే మాటలు మళ్ళీమళ్ళీ విన్పిస్తున్నాయ్. తనకు ఊహతెల్సినతర్వాత ఎవరూ అంత దారుణంగా మాట్లాడగా తను విన్లేదు.పెళ్ళిచేసుకుంటేమాత్రం ఒక మనిషికి ఇంకో మనిషి అంతలా ఎలా స్వంతమవుతారు? వివాహితులతో ఇంకెవరూ మాట్లాడకూడదా?

అతను ఆమెకిస్వంతమవ్వలేదు. 'బానిస'య్యాడు. ఎస్! కళ గురించి, కళాకారుల గురించి ఎన్నో కబుర్లు చెప్పిన గంధర్వ్ కూడా అలా ఎలా ఉండిపోగలిగాడు? తలుచుకుంటేనే అసహ్యం వేస్తోంది.

తను అతడ్ని ఎంతో గొప్పగా ఊహించుకుంది. ఆ రోజు తను అతనితోపాటు విష్ణుని కూడా ప్రేమిస్తున్నానని చెబితే ఎందుకు కూల్‌గా ఉన్నాడో అర్థం కాసాగింది. ఒక అంతర్జాతీయ వేదికమీద రాజ సింహాసనం వేసి అతగాడ్ని కూర్చోబెట్టి తామంతా ఆరాధించారు. అతని కీర్తికిరీటంలో ఇంకో కలికితురాయి అమర్చాలని తామంతా కలిసి ఒక బలమైన టీమ్‌గాఏర్పడి ఎంత కష్టపడ్డారు? చివరికి ఏం జరిగింది?

అతనితో సహా ఆ సింహాసనాన్నీ, ఆ కిరీటాన్ని ఓ అమ్మాయ్ తన తండ్రి సంపాదించిన డబ్బుతో సునాయాసంగా



## ఇకనైనా వింటారా

తమిళంలో ఓ సినిమా, మలయాళంలో రెండు సినిమాలు చేస్తూ కాస్తంత బిజీగా వున్నానని అనిపించుకుంటున్న రాయ్‌లక్ష్మి ఈ మధ్య పదేపదే ఓ విషయం చెవుల్లో పడుతుండడంతో రుసరుసలాడింది. కమల్‌హాసన్ హోస్ట్‌గా వున్న తమిళ బిగ్‌బాస్ సెకండ్ సీజన్‌లో రాయ్‌లక్ష్మి పాల్గొంటున్నదన్న పాట పదేపదే వినపడుతున్నది.

"కాదంటూ చెప్పిన విషయాన్నే మళ్ళీ మళ్ళీచెప్తూ అలసిపోయాను. ఇకనైనా సీరియస్‌గా వినిపించుకోండి. నేనీ షోలో పాల్గొనడంలేదు. ఎందుకిలా ప్రచారం చేస్తున్నారో అర్థం కావడంలేదు" అంటూ సోషల్‌మీడియాలో పేర్కొన్నది.



కొనేసింది. తమ టీమ్‌లోవాళ్ళందరికీ కళ మినహా ఎవరికీ ఏమీ పెద్దగా తెలీదు.రాజకీయాలు చేయటం, డబ్బులు సంపాదించిపెట్టే ప్రోగ్రామ్స్ అరేంజ్ చేసుకోవటం ఏమీ తెలీదు. ఎంత అన్యాయం?

గాడ్! తనకు ఒళ్ళు భగభగ మండిపోయింది. గంధర్వ్‌లాంటి గొప్ప గాయకుడు ఆఫ్టాల్ ఒక్క అమ్మాయ్ కోసం అంతగా మారిపోయాడా? ఎందుకు? ఇంతకాలం పెళ్ళికోసమే బ్రతికాడా? పెళ్ళే అతని జీవిత పరమార్థమా?

అంత డబ్బున్న అమ్మాయ్ భార్యగా వస్తుంటే ఇక తన సంగీత జీవితాన్నంతా తాకట్టు పెట్టేశాడా? పెళ్ళిని కేవలం భవిష్యత్ జీవితానికి అవసరమైన ఓ ఇన్వెస్ట్‌మెంట్‌గా చూశాడా? ఆ జీవితానికి సంబంధించినవాళ్ళెవ్వరూ అవసరం లేదనుకున్నాడా?

తనకింకా అనుమానంగానే ఉంది.గంధర్వ్ ఒక్కడే ఇలా ప్రవర్తించాడా? ఎవరైనా ఇంతేనా? ఈ సమాజంలో పెళ్ళి అనేది వ్యక్తి జీవితంలో ఇంతగా మార్పు తీసుకునివస్తుందా? బయటకొచ్చిన తర్వాత నాలుగూ కడిగేద్దామని కాల్‌చేసింది.ఎన్నిసార్లు కాల్ చేసినా కాల్ కలవటంలేదు.

ఏమైందోనని తను కన్ఫ్యూజయ్యి, వాట్సాప్‌లో మెసేజ్ పెడితే తప్పకుండా చూస్తాడులేఅని వాట్సాప్‌లో మెసేజ్ పెట్టింది. ఎంతకీ మెసేజ్ అతనికి డెలివరీ అయినట్టు నోటిఫికేషన్ రావటం లేదు. అప్పుడు తనకర్థమయ్యింది.

తన నెంబర్ వాట్సాప్‌లో బ్లాక్ చేశాడు. దుర్మార్గుడు! ఆ లెక్కన తన సెల్ నెంబర్‌నికూడా 'కాల్ రిజెక్షన్'లో పెట్టి ఉంటాడు. ఇంకా ఎందుకు సందేహం? ఇందాకట్నుంచి కాల్ ఎందుకో కనెక్ట్ అవ్వట్లేదు అనుకుంటోంది. అసలు కారణం ఇదన్నమాట!

అంటే తనంత కానిదయిపోయిందా? తను విస్తుపోయి నిల్చుని ఉండగానే గంధర్వ్ నెంబర్ నుంచి కాల్ వచ్చింది. ఒక్కక్షణంలో తనలో ఎంత భావ సంచలనం? ఏమో! గంధర్వ్ కాల్ చేశాడేమో... తనున్న పరిస్థితి గురించి ఏమన్నా చెప్తాడేమో!

అయ్యో! తనకు అతని పరిస్థితి తెలీదు కదా? అనవసరంగా అపార్థం చేసుకుంది. ఛా! తాను కాకపోతే గంధర్వ్‌ని ఇంకెవ్వరు అర్థం చేసుకుంటారు? తను కాస్తంత ప్రేమగా మాట్లాడాలి!

తన బాధని మర్చిపోయి అతని బాధని అర్థం చేసుకోవాలి. నీకు నేనున్నాను అని చెప్పాలి! తను కాస్తంత ప్రేమగా మాట్లాడాలి! తన బాధని మర్చిపోయి అతని బాధని అర్థంచేసుకోవాలి.

నీకు నేనున్నాను అని చెప్పాలి! అనుకుంటూ ఫోన్ తీసింది. అంతే! వడగళ్ళ వాన కురిసింది.ఒక ఫోన్ నెంబర్ని కాల్ రిజెక్షన్‌లో పెడితే ఆనెంబర్ గల వాళ్ళు కాల్‌చేస్తే ఫోన్ రింగవ్వదు. శబ్దం రాదు కానీ స్క్రీన్ మీద ఆ నెంబర్ కనపడుతుంది.

ప్రక్కన ఒక గుండ్రటి నీలంరంగు గుర్తు కూడా ఉంటుంది.కాబట్టి ఆ నెంబర్‌కి తిరిగి కాంటాక్ట్ చేయగలిగే సౌకర్యం ఉంటుంది. ఆ కాల్ ఉపేక్ష చేసింది.

ఇంకా అదృష్టం ఏమిటంటే అప్పటికే గంధర్వ్ తన నెంబర్ డిలీట్ చేసినట్టున్నాడు. ఆమెకి ఆ నెంబర్ ఎవరిదో అర్థం కాలేదు.

చాలా చీప్‌గా "ఎవత్తివే నువ్వు? నామొగుడికెందుకు కాల్ చేస్తున్నావ్? నీకు పనీ పాటా లేదు? ఇంకోసారి ఫోన్ చేశావంటే చెప్పుచ్చుకుని కొడ్తాను" అంటూ నోటికొచ్చినట్టల్లా వాగింది.ఎంతవమానం? తను ఇంటికెలా వచ్చిందో తనకే తెలీదు. కడుపులో బాధ సుళ్ళుతిరుగుతోంది.ఎవరితో ఐనా పంచుకోవాలి.

"ఏమైందీ అని అడగవా విష్ణూ?" కళ్ళు తెరిచి అతడ్ని చూస్తూ అడిగింది."నీకు చెప్పాలనిపిస్తే నువ్వే చెప్తావుగా!"అనునయంగా అన్నాడు.

అతని ఛాతీమీద తన పిడికిలితో టకటక కొడ్తూ, వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ"అంతేనా?అంతేనా? నువ్వు నన్ను పట్టించుకోవా? ఎందుకలా ఉన్నావ్ అని అడగవా? నీకు నేను ఎలా ఉన్నా ఏం ఫర్లేదా?" గబగబా అడిగింది.

అతను చిరునవ్వుతో "రైట్! చెప్పు!నాకు నీ గురించిన వివరాలన్నీ కావాలి! నువ్వు ఏం చెప్పదల్చుకున్నా చెప్పు! వింటాను" అన్నాడు.

"నేను గంధర్వ్‌ని గాఢంగా ప్రేమించాను"

మాటలో తేడా అతనికి బాగా అర్థమయ్యింది. అందుకే ఇంకా ప్రశాంతంగా అడిగాడు. "యశూ! ముందు నీకు క్లారిటీ కావాలి!నువ్వు గంధర్వ్‌ని ప్రేమిస్తున్నావా? అతని పాటని ప్రేమిస్తున్నావా?"

ఆమె ఒక్కక్షణం అయోమయంలో పడ్డట్టుగా చూసింది. తర్వాత అదే అయోమయంతో అడిగింది. "గంధర్వ్ వేరు! గంధర్వ్ పాట వేరునా? అలా ఎలా అవుతుంది? అలాకాదు.పాటే తను అయినట్టు, తనే పాట ఐనట్టుగా గంధర్వ్ఎలాపాడతాడో తెల్సా?"

"వన్ మినిట్!" అంటూ ముందుకు వంగి, తన సెల్‌ఫోన్ తీసుకుని, గబగబ ఏవేవో బటన్స్ ప్రెస్‌చేసి "నా చెలి రోజావే..."గంధర్వ్‌పాడినపాటని ఆన్‌చేశాడు. రెండు లైన్లు అవ్వగానే ఆఫ్ చేసి-

"ఇప్పుడిక్కడ గంధర్వ్ ఉన్నాడా?లేడు!కానీ అతని పాట ఉంది. ఇప్పుడు చెప్పు" చిన్నపిల్లని ఓపిగ్గా అడిగినట్టే అడిగాడు.

"మే బి! నేను అతని పాటని ప్రేమిస్తున్నాను..."

"అతని పాట నీకెప్పుడూ వినిపిస్తూ ఉంటుంది. యూట్యూబ్‌లో, గూగుల్‌లో అతని పాటలున్నాయ్! ఎన్ని పాటలు కావాలంటే అన్ని పాటలు ఎప్పుడంటే అప్పుడు వినవచ్చు! నీ జీవితమంతా వింటూనే ఉండవచ్చు!ఇంక నీకేంటి ప్రోబ్లమ్?" అన్నాడు విష్ణు.

"నిజమే! కానీ విష్ణూ! నేను గంధర్వ్‌నీ, అతనితో గడిపిన కాలాన్నీ జీవితంలో ఎప్పుడూ మర్చిపోలేను" కన్నీటిపర్యంతమవుతూ చెప్పింది.

"నిన్నుమర్చిపొమ్మని ఎవరన్నారు? నువ్వు అతడ్ని, అతని పాటనీ ప్రేమిస్తూనే ఉండు. అతడ్ని ఇన్‌స్పిరేషన్‌గా తీసుకో... నీ వయొలిన్‌ని మరింతగా సాధనచెయ్యి!అతను నిన్ను మెచ్చుకునేంతగా సాధన చెయ్యి!"ఓదార్పుగా చెప్పాడు.

**ఇంకా ఉంది**



**రాజకీయాలలోకి వచ్చే సినీనటులు మాటమీద నిలబడటంలేదు. అందువల్ల వారిని రాజకీయాలకు దూరంగా ఉంచండి.**

-సుబ్రహ్మణ్యస్వామి, బి.జె.పి. నేత

# వారఫలం

**జూన్ 21 నుండి 27, 2018 వరకు**

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. పనులు అనుకున్నవిధంగా పూర్తవుతాయి. ఖర్చులు అంచనాలను అవసరాలకు తగినట్లుగా సర్దుబాటు కాగలదు. ముఖ్యమైన సంప్రదింపులను పూర్తిచేసుకోగలుగుతారు. నిరుద్యోగులకు కొన్ని అవకాశాలు ఏర్పడే సూచనలు ఉన్నాయి. కుటుంబమున అనవసరమైన చర్చలందు లౌక్యంలతో సాగుట మంచిది. వృత్తి, ఉద్యోగ, వ్యాపారములలో మీ అభిప్రాయములకు గుర్తింపులు ఏర్పడతాయి. వీరికి గురు, శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



**వృషభం:** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2పా. శారీరక బడలికలు కొనసాగుతాయి. ఆదాయ, వ్యయాలు సరి సమానంగా ఉంటాయి. ఆహ్వానించినవారినుండి తిరస్కారభావం ఏర్పడకుండా తగు జాగ్రత్తలు పాటించుకోవాలి. ఇతరులపై అనవసర వ్యాఖ్యానాలు ఏర్పడకుండా తగు మెలకువలు అవసరం.గతంలో నిలిచిపోయిన ఒప్పందాలను పూర్తిచేసుకోగలుగుతారు. బంధువర్గం నుండి సహాయ సహకారములు పొందగలరు. వీరికి శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



**మిథునం:** మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా. ఆటంకములను, అవరోధాలను సమర్థించుకొంటూ యత్నించుకోవాల్సివుంటుంది. ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాల్సివుంటుంది. సమష్టికృషి ఉండేటట్లు జాగ్రత్తలు పాటించుకోండి. ఆర్థికంగా మిశ్రమం, కొన్ని అవసరాలను తగ్గించుకొనుట మేలు. ఆధ్యాత్మికతలకు ప్రాధాన్యతనీయలేక పోతారు. కొన్ని నోటీసులు పుచ్చుకోవలసిరావచ్చును. వివాహ యత్నములు చురుకుగా సాగుతాయి. వీరికి సోమ, బుధ వారములు అనువైనవి.



**కర్కాటకం:** పునర్వసు 4వపా, పుష్యమి, ఆశ్లేష. కొన్ని టెన్షన్‌లను ఎదుర్కోవలసివచ్చినా మీరనుకొన్నట్లుగా పనుల్ని పూర్తి చేసుకోగల్గుతారు. సమర్థతలకు తగిన గుర్తింపులు ఏర్పడతాయి. ఖర్చులను నియంత్రించుకొంటూ సాగుతారు. నూతన పొదుపు పథకములపట్ల లేదా భూక్రయాలపట్ల ఆకర్షితులవుతారు. పిల్లల చదువు వ్యవహారాల విషయాలలో మేలు పొందుతారు. గురు, శుక్ర, బుధ వారములు అనువైనవి.



**సింహం:** మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. ఈ వారంలో ఆత్మవిశ్వాసంతో వ్యవహరించుకోండి. పనులలో పట్టుదలలు చూపవలసివుంటుంది. కుటుంబమున ఒంటరి పోరుగా ఉండగలదు. బంధువులచే ప్రతివాదములందు ఆచితూచి వ్యవహరించుకోండి. ఆదాయాలు మీ అవసరాలు తీరునట్లుంటాయి. నూతన వృత్తి, వ్యాపారాలను చేపట్టుటకు ప్రయత్నములు ముమ్మరంగా సాగుతాయి. ఆరోగ్యం సహకరిస్తుంది. వీరికి శుక్ర, శని, ఆది వారములు అనువైనవి.



**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా. వివాహాలకు వ్యయం చేస్తారు. ఖర్చులకు తగిన ప్రయోజనాలను ఏర్పరచుకోగలరు. పెద్దల అభిమానములను పొందగలరు. అధికారులతో ఉత్తర ప్రత్యుత్తరాలలో గుర్తింపులేర్పరచుకోగలరు. గతంలో ఏర్పడిన సమస్యలకు పరిష్కారములు పొందుతారు. విద్యార్థులకు కోరుకొన్న తావుల ప్రవేశాలు ఏర్పడతాయి. కుటుంబ సభ్యులతో సరదాలు పంచుకోగలరు. వీరు ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, ఆది, సోమ వారాలు అనువైనవి.



**తుల:** చిత్త 3, 4 పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా. ఇతరులను ఆకట్టుకోగలరు. అనుకొన్న పనులను పూర్తిచేసుకొంటారు. ఎదుటివారి ఆలోచనలను పసిగట్టగలరు. హామీలిచ్చేటప్పుడు ఆలోచనలు చేయండి. విలువైన, ఇష్టపడిన వస్తువులను ఏర్పరచుకోగలరు. ఇతరుల బాధ్యతలను, పనులను స్వీకరించకండి. ఆరోగ్యం అనుకూలంగా ఉంటుంది. దూర ప్రయాణాలను చేపట్టవలసిరావచ్చును. ఉద్యోగుల స్వస్థాన ప్రాప్తికై చేసే యత్నములు అనుకూలిస్తాయి. వీరు ముఖ్యమైన పనులు చేపట్టుటకు శుక్ర, శని, ఆది, బుధ వారములు అనువైనవి.



**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ఈ వారంలో అనారోగ్యభావనలతో పనులు నత్తనడకన సాగే సూచనలు వున్నాయి. ఆర్థికంగా ఉత్సాహాన్ని ఇచ్చే వార్తలుంటాయి. బంధుమిత్రులతో అకారణ వైరభావములు ఏర్పడు సూచనలు ఉన్నాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాలుపంచుకోగలరు. చేపట్టుకొన్న ప్రయాణాలు సౌకర్యయుతంగా సాగుతాయి. భ్రాతృవర్గమున పై సమస్యలు తగ్గగలవు. వీరు ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, ఆది, సోమ వారములు అనువైనవి.



**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. ఈ వారంలో శుభాశుభ మిశ్రమముగా సాగుతారు. పట్టుదలలతో వ్యవహరించుకోగలరు. అనుకొన్న పనులను ఆలస్యంగానైనా పూర్తిచేయగలరు. ఖర్చులకు తగిన ప్రయోజనాలు, అవసరాలకు తగిన ఆదాయాలు ఉంటాయి. సంతానపరంగా ఊహించని కొన్ని ఖర్చులు ఏర్పడగలవు. ప్రభుత్వతరహా పనులను అనుకూలింపచేసుకొంటారు. వీరు ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, శని, ఆది, బుధ వారాలు అనువైనవి.



**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. మీ ప్రయత్నములకు శాంతమును తోడవ్వవలసివుంటుంది. నిత్యకృత్యములతో బిజీతనము గోచరించగలదు. ధనసహాయాలు వంటివి చేయవలసిరావచ్చును. ఒంటరి పోకడలు పనికిరావు. యంత్ర వాహనాల వాడకంలో జాగ్రత్తలు అవసరం. ఇతరుల బాధ్యతలను కొన్నిటిని స్వీకరించవలసిరావచ్చును. ఆదాయం, ఖర్చులలో సంతృప్తులేర్పడతాయి. కళాశాల ప్రవేశాలు అనుకూలం. శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



**కుంభం:** ధనిష్ఠ 3, 4 పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. మార్పు-చేర్పులు మందకొడిగా సాగినా ఉత్సాహముగా వ్యవహరించుకోగలరు. అనారోగ్యభావనలందు జాగ్రత్తలకు ప్రాధాన్యత నీయండి. సహోద్యోగులతోను, అధికారులతోను కలసి వ్యవహరించుకోగలరు. సాహసాలందు, సొంత డ్రైవింగ్‌నందు మెలకువలు పాటించుకోవాలి. అవివాహితులకు, నిరుద్యోగులకు శుభములు కలుగుతాయి. కొందరికి నూతన ఉద్యోగ అవకాశములు ఏర్పడతాయి. వీరు ఆది, సోమ, బుధ వారములందు ముఖ్యమయిన పనులను తలపెట్టుకోవటం మంచిది.



**మీనం:** పూర్వాభాద్ర 4వపా, ఉత్తరాభాద్ర, రేవతి. ప్రణాళికాయుతముగా సాగగలిగితే అన్నిటా అనుకూలతలను పొందుతారు. ధనలాభం వున్నది. ఆత్మీయులతో ఇచ్చిపుచ్చుకోగలరు. ఇతరులపై ఆధిపత్య ప్రదర్శనలకు దూరంగా ఉండండి. బంధుమిత్రుల రాకపోకలు పెరుగుతాయి. ఆర్థిక ఉన్నతికై చేసే యత్నములు ఫలిస్తాయి. శుభ కార్యములకు, దైవకార్యములకు హాజరవుతారు. మీ కుటుంబంలో మరియొకరి సంపాదన మొదలవ్వగలదు. వీరికి శుక్ర, శని, ఆది వారములలో అన్ని విషయాలలో సమయోచితమైన ఆలోచనలు అవసరం.

**విద్య అనేది మనిషి నుంచి వేరుచేయలేని సంపద వంటిది.**

# ద్విగుణం

ఉమామహేష్ ఆచాళ్ళ

"ఇప్పుడు మన చీఫ్ గెస్ట్ మధుసూదన్ గారు మాట్లాడతారు. ఆయన మాట్లాడే ముందు ఆయన గురించి పరిచయ వాక్యాలు చెబుతాను" అని, ఆ స్కూల్ హెడ్‌మాస్టర్ అంతకుముందే నేను వాళ్ళకిచ్చిన నా ప్రొఫైల్ అంతా చెప్పటం మొదలుపెట్టారు. ఆయన చెబుతూవుంటే స్కూల్ అంతా చప్పట్లతో మార్మోగిపోతోంది.

ఆ చప్పట్లే కదా నన్ను ఇంతవాణ్ణి చేసిన టానిక్. హెడ్‌మాస్టర్‌స్పీచ్ ఇలా సాగుతోంది. "శ్రీ మధుసూదన్ గారు మన ఊళ్ళోనే చదువుకున్నారు. టెన్త్‌క్లాస్‌లో తాలూకా ఫస్ట్, ఇంటర్‌లో జిల్లా ఫస్ట్.

ఎంసెట్‌లో స్టేట్ ర్యాంకర్. ఈ ప్రముఖ కంపెనీలో ఇంజనీర్‌గా జాయిన్ అయ్యి, అంచెలంచెలుగా ఎదిగి, ప్రస్తుతం ఇదే సంస్థలో సీనియర్ స్థాయిలో ఉండటం మనందరికీ గర్వకారణం.

ఈ సంస్థయొక్క 'కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ' పథకం కింద మన స్కూల్‌లో కంప్యూటర్ ల్యాబ్ డెవలప్ చేసినందుకుగాను మనం ఈ రోజు ఈ సంస్థ తరఫున ఆయనకీ సన్మానం ఏర్పాటు చేయటం ఆనందదాయకం..." అని మా కంపెనీ బ్యానర్‌కేసి చూపిస్తూ, వెంటనే నావైపు తిరిగి-

"ఇప్పుడు శ్రీ మధుసూదన్‌గారు మాట్లాడతారు" అంటూ నన్ను ఆహ్వానించగానే, ముందే రాసుకున్న ఇంపార్టెంట్ పాయింట్స్ ఓసారి చూసుకుంటూ లేచి వెళ్ళి మాట్లాడటం మొదలుపెట్టాను. నాకు చిన్నప్పటి నుంచి స్కూల్‌లో కూడా అదే అలవాటు.

ఎటువంటి పొరపాట్లూ జరక్కుండా చాలా జాగ్రత్తలు తీసుకుంటా. ఎప్పుడూ టాపర్‌గా ఉండాలంటే ఆ మాత్రం శ్రద్ధ అవసరం.

దాదాపు ఓ అయిదు నిముషాలు మా కంపెనీ గురించి, నా గురించి, ఈ స్థాయికి చేరుకోవటానికి నేను పడిన కష్టం గురించి, సి.ఎస్.ఆర్. గురించి, అనర్గళంగా మాట్లాడి ముగించిన తరువాత మొత్తం స్కూల్ అంతా కరతాళధ్వనులతో ఇంకోసారి మార్మోగిపోయింది.

ఫంక్షన్ అయిపోయి బయలుదేరుతూండగా, మొదటినుంచి నన్నే గమనిస్తున్న ఒకతను దగ్గరగా వచ్చి, "నువ్వు... సారీ... మీరు మధు కదూ" అన్నాడు, నాకేసి పలకరింపుగా చూస్తూ-

"ఆ అవును. నువ్వు... ఓ చంద్రమౌళి, ఎలా వున్నావు" అని నేను అడిగేసరికి-

అతను "బావున్నాను. ఇన్నేళ్ళయినా నన్ను బానే గుర్తుపట్టావు" అన్నాడు సంతోషంగా.

అప్పుడు చూశాను అతన్ని పరిశీలనగా. జుట్టు ఊడలేదుకానీ, నెరిసింది. సాధారణమయిన బట్టలు, చెప్పులు, చేతికి ఓ బెల్ట్ వాచీ.

నాకెందుకో అతన్ని అలా చూశాక అప్పటికే గాల్లో తేలుతున్న నా శరీరం ఇంకొంచెం తేలికగా అనిపించింది. "నువ్వేం చేస్తున్నావు చంద్రమౌళి" అడిగాను అతన్ని. పెద్దగా ఇంటరెస్ట్ లేకపోయినా.

"నేను ఈ స్కూల్‌లోనే మ్యాథ్స్ టీచర్‌గా చేస్తున్నాను. నువ్వు ఈ స్థాయికి చేరుకోవడం నాకు చాలా ఆనందంగా ఉంది మధు" అన్నాడతను సూట్‌లో ఉన్న నాకేసి మురిసిపోతూ చూస్తూ,

"ఓహ్, దట్స్ రియల్లీ నైస్. సరే ఉంటాను కలుద్దాము. ఇప్పటికే చాలా లేట్ అయ్యింది" అన్నాను నా రోలెక్స్ వాచ్ అతనికి చూపిస్తూ.

"రాక రాక వచ్చావు. ఇంటికిరా. నాన్నగారు కూడా నిన్ను చూస్తే చాలా సంతోషిస్తారు" అన్నాడతను అభిమానంగా. వాళ్ళ నాన్నగారు టెన్త్‌లో మా తెలుగు టీచర్. కాదనలేక బయలుదేరాను.

అతను ముందు బైక్‌మీద వెళుతూ దారి చూపిస్తున్నాడు. వెనుకే నా డ్రైవర్ అతన్ని ఫాలో అవుతున్నాడు. ఎందుకో అతని బండి నెంబర్ చూశాను. టోటల్ రెండు. నా ఆలోచనలన్నీ ఒక్కసారిగా వెనక్కి వెళ్ళాయి.

నేను, చంద్రమౌళి ఒకటో తరగతి నుంచి క్లాస్‌మేట్స్. నాకూ, అతనికీ ఫస్ట్‌ర్యాంక్ గురించి చాలా గట్టి పోటీ నడిచేది. అఫ్‌కోర్స్ ఎప్పుడూ ఒక్క మార్క్ తేడాలో నేనే ఫస్ట్ వచ్చేవాడిని.

అతను ఎప్పుడూ నా వెనుకే, సెకండ్ ర్యాంకే, అప్పుడప్పుడూ నాకు ఒంట్లో బాగోలేకపోతేనో లేక చిన్న చిన్న క్లాస్ టెస్ట్‌ల్లోనో తప్ప.

ఇంటర్‌లో కూడా అంతే... ఇంటర్ అయిపోయాక నేను ఎమ్‌సెట్ స్టేట్ లెవెల్‌లో ర్యాంకర్‌గా నిలిచి ఇంజనీరింగ్‌లో చేరాను.

కారణాలు తెలియదుకానీ చంద్రమౌళి బిఎస్సీలో చేరాడు. తర్వాత చూచాయగా తెలిసింది అతను బి.ఇడి చేసి అదే ఊర్లో టీచర్‌గా పనిచేస్తున్నాడని. అతనూ బానే చదివేవాడు కానీ ఒకటెప్పుడూ ఒకటే కదా. ఈ ఆలోచనల్లో ఉండగా, చంద్రమౌళి ఇల్లు వచ్చింది. అది ఓ చిన్న డాబా ఇల్లు.

నా నాలుగొకట్ల 'ఆడీ' కారులోంచి దర్జాగా దిగి అప్పటికే ఇంటికి చేరి నా కోసం గేటుదగ్గర వెయిట్ చేస్తున్న చంద్రమౌళిని అనుసరించాను.

అంతా మట్టిజాగా. గేటునుంచి ఇంటికి దాదాపు ఓ ఇరవై అడుగుల దూరం చేరటానికి ఓ రెండు అడుగుల వెడల్పు మాత్రం అక్కడక్కడా పెచ్చులు వూడిపోయిన సిమెంట్ గచ్చు. అటూ ఇటూ కూడా ఎండిపోయి రాలి పడిన ఆకుల గుట్ట.

గదిలోంచి ఓ చిన్నపిల్ల పాడుతున్న 'కుంద గౌర...' రెండో గీతం వినిపిస్తోంది.

నా చిన్నప్పుడు నేను



అమ్మ దగ్గర నేర్చుకున్న సంగీతం కారణంగా ఆ గొంతులో అపశృతి నాకు స్పష్టంగా తెలుస్తోంది.

చిన్న హాలు. హాలునిండా గోడకి వేలాడదీసిన బ్లాక్ అండ్‌వైట్ ఫోటోలు, అంత కళలేని కలర్ ఫోటోలు.

ఇంట్లో అందరినీ పరిచయం చేశాడు. అతని భార్య స్టీల్ గ్లాస్‌లో కాఫీ ఇచ్చింది.

అతని తల్లి ఇత్తడి క్యారేజీ తెరిచి నాలుగు చక్కిలాలు ప్లేట్‌లో పెట్టింది. పెరట్లో మడత కుర్చీలో పడుకునివున్న అతని నాన్నగారిని లేపి నన్ను పరిచయం చేశాడు.

అక్కడ వాతావరణం చూశాక నాకు చాలా ఆనందంగా ఉంది. నా నమ్మకం నిజమైంది. రెండెప్పుడూ రెండే. అవును మా మధ్య పోటీ అటువంటిది.

బయలుదేరుతూ చంద్రమౌళితో "నువ్వుకూడా మా ఇంటికి రావాలి. ఇక్కడే టౌన్‌షిప్‌లో ఉంటున్నా. ఈ రోజు నీకు సెలవేగా, పోనీ ఇప్పుడు నాతో రావచ్చుగా..." అన్నాను నవ్వుతూ.

నా విజయం పరిపూర్ణం అవ్వాలంటే ఒకటికీ రెండుకీ తేడా నాకు తెలిస్తే సరిపోదు. రెండుకీ, ఒకటికీ తేడా అతనికి కూడా తెలియాలిగా. ఏమనుకున్నాడో, "సరే, ఒక్క నిమిషం..." అంటూ ఇంట్లోకి వెళ్ళి భార్యకి, వాళ్ళ అమ్మకి చెప్పివచ్చాడు.

అతను బండి తియ్యబోతూ ఉంటే వారించి, నా కారులో కూర్చోపెట్టి తీసుకువెళ్ళాను. నా కారు హార్న్ మోగగానే సెక్యూరిటీ వచ్చి గేట్ తీశాడు.

అది టౌన్‌షిప్‌లో నా బంగ్లా... లోపలికి తీసుకునివెళ్ళి నా ఇల్లు అంతా చూపించాను. ముఖ్యంగా బెడ్‌రూమ్‌లో 15×15 సైజులో ఓవైపు గోడ మొత్తం టెన్నిస్ రాకెట్‌తో వున్న నా ఆయిల్ పెయింట్ ఫోటో.

హాల్లో కూర్చున్నాక అడిగాను, "ఎలా ఉంది నా ఇల్లు?" అని.

"చాలా బాగుంది మధు, నువ్వు ఈ స్థాయిలో ఉండటం నిజంగా నాకు చాలా సంతోషంగా ఉంది. అమ్మ, నాన్నగారు బాగున్నారా?" అన్నాడతను.

"ఆ ఆ, వాళ్ళకి ఈ సిటీ వాతావరణం అలవాటు లేదుకదా అందుకే ఊళ్ళోనే ఉంటున్నారు" అన్నా, రిక్లైనర్ సోఫాలో వెనక్కి జారబడుతూ,

ఇంతలో పోస్ట్‌మాన్ వచ్చి ఓ లెటర్ ఇచ్చిపోయాడు. ఓపెన్ చేసిచూస్తే అది ఈ మధ్య ట్యాక్స్ బెనిఫిట్‌కోసం ఓ చారిటబుల్ సంస్థకి ఇచ్చిన డొనేషన్ తాలూకు రిసీట్.

"ఇదిగో ఓ చారిటబుల్ ఆర్గనైజేషన్ ద్వారా ఓ స్టూడెంట్‌ని చదివిస్తున్నాను. నా శాలరీలో ఓ టూ పర్సెంట్ ఇలా స్పెండ్‌చేస్తే అదో సాటిస్‌ఫాక్షన్..." అన్నాను కొంచెం గర్వంగా.

అతను మళ్ళీ నాకేసి అబ్బురంగా చూశాడు. కాసేపు నా గురించి చెప్పాక అతను లేచి నుంచుని "ఇక వస్తా మధు, ఇప్పటికే లేట్ అయ్యింది. నీకు చాలా పనులుంటాయి" అనగానే,

"ఉండు, మా డ్రైవర్ దింపుతాడు" అంటూ ఫోన్‌లోనే డ్రైవర్‌కి చెప్పి, మీదనుంచే అతనికి బై చెప్పేసి లోపలికి వచ్చేశాను.

భోజనం చేసి ఓ అరగంట పడుకుని లేచి హాలులోకి వచ్చి టీవీ ఆన్ చేద్దామని రిమోట్ తీస్తూవుండగా పొద్దున్న పోస్ట్‌లో వచ్చిన రిసీట్ గాలికి ఎగిరి కిందపడింది.

తీసి తిరిగి టేబుల్‌మీద పెడుతూ యథాలాపంగా చూశా. ఆ రసీదు అడుగున తెలుగులో ఇలా రాసుంది-

"గమనిక : ఎప్పుడయినా మీరు మా సంస్థ పని తీరుతో సంతృప్తిచెందనియెడల మీరు చేసిన ఆర్థిక సహాయం వాపసు పొందుటకై ఈ కింది నెంబర్‌కి కాల్ చెయ్యొచ్చు"

నాకు నవ్వొచ్చింది.

ఆ రసీదును తిరిగి టేబుల్‌మీద పెడుతూ ఎందుకో అనుమానం వచ్చి మళ్ళీ చదివి కింద సంతకం,పేరు చూశాను.

ఏదో సందేహం. ఉండబట్టలేక అక్కడ వున్న నెంబర్‌కి కాల్ చేశాను.

ప్రస్తుతం బయటకు వెళ్ళారని, ఎప్పుడొస్తారో తెలియదని సమాధానం వచ్చింది.

ఇంకొన్ని వివరాలు కనుక్కున్నాక, నేను ఇక ఇంట్లో ఉండలేకపోయాను. అదే టెన్షన్.

చిన్నప్పుడు పరీక్షల్లో ఫస్ట్‌ర్యాంక్ ఎక్కడ మిస్ అవుతుందో అని పడే టెన్షన్. వెంటనే డ్రైవర్‌కి ఫోన్ చేసి కారు తియ్యమని బయల్దేరాను.

గేట్ తీసుకుని లోపలికి వెళ్ళా. పొద్దున్న చూసిన ఎండుటాకులు ఇప్పుడు లేవు. తుడిచినట్టున్నారు. అంతా శుభ్రంగా ఉంది. తల పైకెత్తి చూస్తే అటుపక్క మామిడిచెట్టు, ఇటుపక్క వేపచెట్టు విశాలంగా పరుచుకుని రెండూ రెండు 'ఓ జనరల్' ఎ.సి.ల్లా చల్లని గాలి, నీడ ఇస్తున్నాయి.

ఇంతలో నన్ను చూసి అప్పుడే వచ్చిన చంద్రమౌళి గబగబా దగ్గరకి వచ్చి- "అరే ఏమైంది మధు, మళ్ళీ వచ్చావు. ఏదైనా మర్చిపోయావా?" అంటూ కంగారుగా అడుగుతున్నాడు.

"ఏం లేదు నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాను. నా గొంతు వణుకుతోంది.

"సరే ఇంట్లోకి రా", అంటూ నన్ను సాదరంగా లోపలి తీసుకెళ్ళాడు. లోపలిగదిలోంచి "జ్ఞానమొసగ రాదా... గరుడ గమన వాదా" అనే త్యాగరాజ రూపక తాళం పూర్వీకల్యాణిరాగంలో శ్రావ్యంగా వినిపిస్తోంది సాయంత్రం మూడ్‌కి తగ్గట్టుగా.

"ఆ పాడేది ఎవరు?" అన్నాను ఆత్రంగా.

"తను నా కూతురు శ్రావ్య..." అన్నాడతను మురిపెంగా.



"మరి పొద్దున్న పాడింది...?" అడిగాను అతన్ని అనుమానంగా.

"ఓ అదా, నా కూతురు ఎవరో చిన్నపిల్లకి సంగీతం నేర్పుతోంది. బహుశా ఆ పిల్ల గొంతు వినుంటావు" అన్నాడు అతను నవ్వుతూ.

హాల్‌లోకి వెళ్ళాక అప్పుడు చూశాను గోడమీద ఫోటోలు పరిశీలనగా.

చంద్రమౌళి ఉత్తమ ఉపాధ్యాయుడు అవార్డు సి.ఎమ్.గారి చేతులమీదుగా అందుకుంటున్న ఫోటో, అతని పూర్వీకుల ఫోటోలు, అలాగే మరికొంతమంది ప్రముఖులు అతను నడుపుతున్న స్వచ్ఛందసంస్థకి వచ్చిన సందర్భంగా తీసిన ఫోటోలు.

హాల్లో అతని భార్య దేవుడికి పూల మాల అల్లుతూ నన్ను చూసి లేచి పలకరించింది.

గదిలో అతని తల్లి పాట పాడుతున్న మనవరాలికి జడ వేస్తోంది.

## ముప్పైకి ముందే పెళ్ళి

పెళ్ళిమాట ఎత్తితే కెరీర్‌కు విఘాతంకాగల దేమోనన్న వెరపు అలియాభట్‌లో అస్సలే కనిపించడంలేదు. పైగా, ముప్పైకి ముందే మూడుముళ్ళు వేయించుకుంటానేమో అని ఫ్రాంక్‌గా చెప్తోంది.

"ప్రస్తుతానికైతే పెళ్ళి ఆలోచన లేదు. అయినా అదిప్పుడే జరగాలి, అప్పుడు జరగాలి అంటూ నేను ప్రణాళికలు వేసుకోలేను. ఏమో! ముప్పైకి ముందే పెళ్ళిచేసుకుంటానేమో. సహజీవనంపట్ల నాకు మంచి అభిప్రాయం లేదు" అంటున్నది. ఏమిటో- అందరూ అనుకుంటున్నట్లు రణబీర్ కపూర్‌తో ప్రేమలో పడిందా? చూద్దాం!

చంద్రమౌళిని తీసుకుని బయటకు వచ్చాను. అరుగుమీద నేను పై మెట్టుమీద కూర్చుంటే అతను కింద మెట్టుమీద కూర్చున్నాడు.

"మౌళీ, మధ్యాహ్నం నేను డొనేషన్‌గురించి చెప్పినప్పుడు ఆ సంస్థ నువ్వే నడుపుతున్నావని నాకు ఎందుకు చెప్పలేదు?" అన్నాను నిష్ఠూరంగా.

"అదా, అందులో నేను గొప్పగా చెప్పుకోవడానికేముంది. ఏదో నీలాంటివాళ్ళు సాయంచేస్తుంటే, నేను మేనేజ్ చేస్తున్నాను అంతే" అన్నాడతను తేలిగ్గా.

"అన్నిసార్లూ అందరూ సాయంచెయ్యకపోవచ్చు కదా. అక్కడ దాదాపు ఏభైమంది పిల్లలున్నారని నాకు తెలిసింది. నువ్వు కూడా ఎంతో కొంత వెయ్యనిదే అవ్వదు... పైగా ఎవరికయినా ఎప్పుడయినా డబ్బు వాపసు అని రాశావు. ఇదంతా ఎలా సాధ్యం?" అని అడిగా ఉండబట్టలేక.

"మధు, నాకు దాదాపు ఎనభై వేలు జీతం. నాన్నగారికి ముప్పైవేలు పెన్షన్ వస్తుంది. మా కుటుంబానికి ఓ పాతిక వేలు వుంటే సరిపోతుంది. అమ్మ, నాన్నని, నా భార్యని, అడిగాను. వాళ్ళు సంతోషంగా ఒప్పుకున్నారు. అంతే" అన్నాడతను నవ్వుతూ.

"మరి నీ పిల్లల ఫ్యూచర్...?" నా అనుమానం ఇంకా తీరలేదు.

"ఏమో, నేను అంత దూరం ఆలోచించలేదు. అయినా అవన్నీ ఇప్పుడెందుకు. నీలాంటి స్నేహితులు వుండగా నాకు ఎందుకు బెంగ" అతని కంఠంలోని నిజాయితీ నాకు చాలా స్పష్టంగా తెలుస్తోంది.

"... చంద్రునికంత్తై, ధ్రువునిపైనంత్తై..." పెరటిలో నుంచి చంద్రమౌళి నాన్నగారు తన మనవడికి చెబుతున్న తెలుగు పాఠం



**అమెరికా, చైనాల మధ్య వాణిజ్య యుద్ధం ఆ రెండు దేశాలకే కాదు ప్రపంచ దేశాలన్నింటికీ నష్టమే.**

*-రఘురామ్‌రాజన్, ఆర్.బి.ఐ. మాజీ గవర్నర్*

లీలగా వినిపిస్తోంది. ఎప్పుడో ఇంజనీరింగ్‌లో ఉండగా కొని, చదవకుండా వదిలేసిన 'సింపుల్ బై ఛాయిస్' పుస్తకం గుర్తుకువచ్చింది.

అప్రయత్నముగా రెండో మెట్టుమీదకి దిగి, "చంద్రా, రెండంటే ప్రతిసారీ ఒకటి తర్వాత వచ్చేదే అనుకునే నాకు, రెండంటే ఒకటికి రెట్టింపు కూడా అని ఈరోజే తెలిసింది" అన్నాను ఉద్వేగంగా అతని చేతిని నా చేతిలోకి తీసుకుంటూ.

"ఏమైంది మధు ఇవాళ నీకు, ఎందుకు అంత ఎమోషనల్ అవుతున్నావు" అంటూ చంద్రమౌళి నా భుజంమీద చెయ్యేశాడు.

"సరే, నేను వస్తా, ఎప్పుడైనా ఏదైనా అవసరం ఉంటే తప్పకుండా కాల్ చెయ్యి. వచ్చేవారం మీ ఫ్యామిలీని తీసుకుని ఇంటికిరా. ఈలోగా నేను ఊరు వెళ్ళి అమ్మ, నాన్నని తీసుకునివస్తాను..." అన్నాను లేచి నిలబడుతూ.

"తప్పకుండా మధు, అమ్మని, నాన్నగారిని చూసి చాలా రోజులయింది" అన్నాడు చంద్రమౌళి ఆనందంగా. అతను నన్ను అనుసరించాడు.

సాయంత్రం నీరెండలో నా వెనకున్న అతని నీడ నన్నుదాటి నా ముందు పడుతోంది. గేట్‌వరకూ వెళ్ళాక లోపలినుంచి అతని తల్లి బయటకు వచ్చి-

"అదేమిట్రా చంద్రా... అబ్బాయి వెళ్ళిపోతున్నాడు, చీకటి పడింది, ఫలహారం చేసి వెళ్ళమను" అంది కంగారుగా.

"మధు, నువ్వు ఫలహారం చేసివెళితేకాని అమ్మ ఒప్పుకోదు. రా..." అంటూ నన్ను లోపలికి తీసుకువెళ్ళాడు చంద్రమౌళి.

పెరట్లోకి వెళ్ళి కాళ్ళు, చేతులు కడుక్కుని లోపలికి వచ్చాక ఆవిడ కంచంలో అప్పుడే పెరట్లోంచి కోసి, కడిగిన అరిటాకు వేసి దిబ్బరొట్టె, అల్లంపచ్చడి పెట్టింది. ఎప్పుడో చిన్నప్పుడు అమ్మచేస్తే తిన్న, తర్వాత మళ్ళీ ఇదే తినడం. చాలా బావుంది. అచ్చం అమ్మ చేతివంటలా.

ఇంట్లో అందరికీ చెప్పి బయలుదేరాను. గేట్ వరకూ వచ్చాక, "చంద్రా, ఇబ్బంది అనుకోకపోతే నీ బండిమీద నన్ను కొంచెం మా ఇంటివరకూ డ్రాప్ చేస్తావా?" అని అడిగాను.

చంద్రమౌళికి ముందు అర్థంకాలేదు, తర్వాత నవ్వి, "తప్పకుండా, పద" అన్నాడు బండి హెడ్‌లో కీ పెట్టి స్టార్ట్‌చేస్తూ...

నా డ్రైవరుని కారు తీసుకువెళ్ళిపొమ్మని, చంద్రమౌళి బండిమీద ఇద్దరం కలిసి బయలుదేరాం.

బండిమీద అతని వెనకాల నేను కూర్చున్నానేమో, రంగు వేయకపోవడంవలన సహజంగా నెరిసిన అతని జుట్టు వెండిరంగులో చంద్రుడితో పోటీపడి మెరుస్తోంది.

చప్పట్లు లేకపోయినా నా మనసు ఇప్పుడు తేలిగ్గానే ఉంది.

# మధ్యాహ్నం-ఓ కునుకు

ప్రపంచంలో మొదటగా కునుకు తీసినవాడు ఎవడో తెలియదుగానీ, కునుకు తీయటం గురించిన చర్చలు నిరంతరం సాగుతూనే వున్నాయి.

కునుకు తీయటం ఒట్టిటైమ్‌వేస్ట్ అని కొందరు అంటే, మరికొందరు ఏమీ చెప్పకుండా కునుకు తీసేస్తూ వుంటారు.కొంతమంది అభిప్రాయం ప్రకారం పగటినిద్ర పిల్లలకుఅవసరం కానీ, పెద్దలకు అవసరం కాదు.

తరచి చూస్తే కునుకు తీయటం అనేది అన్ని వయస్సుల వారికీ అవసరమే అని తెలుస్తుంది. కానీ, కునుకు తీసేవారు సరిగ్గా వివేచనచేసి, అవసరానికితగ్గట్టు నిర్ణయంతీసుకోవాలి.

సరైనసమయంలో తీసిన కునుకు చాలా మంచి చేస్తుంది.

ఇటీవల జరిగిన పరిశోధనలో సాయం సమయంలో తీసే కునుకు చాలా మంచి చేస్తుందని తేలింది.

## బరువు అదుపులో :

నిద్ర తక్కువైతే మన శరీరంలో 'లెప్టిన్' అనే హార్మోన్ ఉత్పత్తి తగ్గిపోతుంది. దాంతో హెర్కిన్‌హార్మోన్ ఎక్కువ తినేట్టు చేస్తుంది.

లెప్టిన్ హార్మోన్ తగ్గిపోవడంవల్ల ఎప్పుడూ ఆకలిగా అనిపిస్తూ, ఆపకుండా ఏదో ఒకటి తినాలనిపిస్తుంది. తింటూ వుంటారు.

దానివల్ల బరువు పెరుగుతారు. అదే చిన్నపాటి కునుకు తీస్తే నిద్ర సరిపోయి ఆకలి తగ్గుతుంది. శరీర బరువు పెరగకుండా ఉంటుంది.

## పవర్‌నాప్‌లు మంచివి :

ఓ 15 నుంచి 20 నిమిషాల సేపు కునుకు తీయటంవల్ల మెదడు,శరీరం చక్కగా విశ్రాంతిని పొందుతాయి.

మనం మామూలుగా నిద్రపోయినప్పుడు మన శరీరం, తనకి తాను సరిచేసుకుంటుంది, బాగుచేసుకుంటుంది. అదే విధంగా మెదడు కూడా పనిచేస్తుంది.

మెదడులోని రసాయనాలు అన్నింటినీ సరిచేసి కొత్త ఉత్సాహాన్ని నింపుతాయి. నిద్రకు చిన్న తమ్ముడైన 'కునుకు' తీస్తే కూడా ఇదే లాభాలు మనకు కలుగుతాయి.

15 నుంచి 20 నిమిషాలు కునుకు తీయటమే పవర్ నాప్.

## ఆందోళన తగ్గిస్తుంది :

కొద్దిసేపు అలా కునుకు తీయడం వల్ల మనస్సు శాంతపడుతుంది. ఆందోళన తగ్గుతుంది. చురుకుదనం పెరుగుతుంది. ముందురాత్రి సరిగ్గా నిద్రపోక పోతే మీ చికాకు తారస్థాయిని అందు కుంటుంది. అందుచేత చిన్న కునుకు తీస్తే రక్తపోటు తగ్గుతుంది. గుండెకు కూడా మంచిది.

ఒత్తిడిని, ఆందోళనను తగ్గించటానికి కునుకు తీయటం, వేరే ఔషధాలు వాడటంకంటే ఉత్తమ మార్గమని పరిశోధనలు నిర్ధారించాయి.

## గుండెకు మంచిది :

రాత్రంతా చదువుకోవటంవల్లో లేక పనిచేయటంవల్లో శరీరానికి అవసరమైన 8 గంటల నిద్ర లభించదు.

దానివల్ల రక్తపోటు, ఒత్తిడి శరీరంలో పెరుగుతాయి. గుండె, లయ వీటివల్ల తప్పుతుంది. అలా ఒత్తిడి తరచుగా వుంటూవుంటే గుండె బలహీనపడుతుంది. అందుచేత అవకాశం చూసుకుని కునుకు తీయటంవల్ల గుండె గట్టిగా వుంటుంది.

## సున్నితత్వం పెరుగుతుంది :

పిల్లలు తిక్కతిక్కగా అతిగా అల్లరి చేస్తుంటే వెళ్ళి కాసేపు 'పడుకో పోరా' అని పెద్దలు అదిలిస్తారు.

ఈ విషయం పెద్దలకు కూడా వర్తిస్తుంది. బాగా అలసిపోయి, ఓపిక తగ్గిపోయి, బడలికగా ఉండి, ఒత్తిడి విపరీతంగా పెరిగినప్పుడు పెద్దలకు కూడా తిక్క, చికాకు ఎక్కువవుతాయి. సాయంకాలం పూట తీసే ఒక చిన్న కునుకు వీటివన్నింటినీ తగ్గిస్తుంది. సాయంకాలమే ఎందుకంటే ఉదయం నుంచి మనం పెట్టే పరుగులు నిదానంగా తగ్గుతాయి. కాస్తంత తీరిక దొరుకుతుంది.



Courtesy : B+VE

# టాలీవుడ్ తల్లివంటిది



పరిశ్రమలోకి వస్తూనే సంచలనం సృష్టించింది పంజాబీ పోరి మెహరీన్ కౌర్. 'కృష్ణగాడి వీర ప్రేమగాథ' తర్వాత రెండో చిత్రానికి కొంత గ్యాప్ తీసుకున్నప్పటికీ, 'మహానుభావుడు' నుంచి మెహరీన్ చేసిన చిత్రాలన్నీ క్యూకట్టాయి. విదేశాల్లో చదువుకుని చిత్రసీమకు వచ్చిన విద్యావంతురాలు ఈమె.

ఆదిలో ఆమె సినిమాలు అద్భుతంగా ఆడినా, తర్వాత కొన్ని వైఫల్యాలు చవిచూడక తప్పలేదు. వరుస ఫ్లాప్‌లతో అవకాశాలు తగ్గుతాయనుకుందేమో, ఈ మధ్య ఓ ఆంగ్లపత్రికకు ఫోటోషూట్ చేసి, తన అందచందాలను ఎంచక్కా ప్రదర్శించింది. ప్రస్తుతం 'పంతం' సినిమా చేస్తున్నది. ఆమెతో ఇంటర్వ్యూ:

**పరిశ్రమలోకి వచ్చాక మీలో మార్పు వచ్చిందా?**

ప్రతిరోజూ నాకోసం నేను పనిచేస్తాను. పరిణతి, కాన్ఫిడెన్స్ స్థాయిలు పెరిగాయి.ఛాయిస్‌లు తీసుకోవడంలోనూ కాన్ఫిడెంట్‌గా వుండగలుగుతున్నాను.

**రెండో చిత్రానికి కావాలనే ఎక్కువ సమయం తీసుకున్నారా?**

అవుననే చెప్పాల్సివుంటుంది. నా మొదటి సినిమా తర్వాత ప్రేక్షకులకు నాపట్ల అంచనాలు బాగా పెరిగాయి. అందుకే రెండో సినిమాను జాగ్రత్తగా ఎంచుకున్నాను. 'మహానుభావుడు' సినిమా నాకెంతో మంచి పేరు తెచ్చిపెట్టింది.

**మీ జీవితం ఎలా ఉండాలని కోరుకున్నారు?**

(నవ్వేస్తూ) ఇలాగే.నాకు పని కావాలి, ప్రయాణాలు కావాలి. బాగా నిద్రపోవాలి. బిజీగా వుండడం నాకు చాలా ఇష్టం. అదృష్టవశాత్తూ రెండు సంవత్సరాల దాకా ప్రస్తుతం నా చేతిలో పని వుంది.

**భాష సమస్య ఎదురైన సందర్భాలున్నాయా?**

లేదు.ఎమోషన్లకు భాష హద్దు కాదన్నది నా అభిప్రాయం. కెరీర్ ఆరంభంలో మూడుభాషల్లో పని చేయుగలగడం నా అదృష్టం.

**మీరామధ్య కొన్ని పెద్ద చిత్రాలను వదులుకున్నారట కదా?**

అవును. డేట్లుసర్దుబాటుకాలేదు. కథ నచ్చకపోతే ఎంత పెద్ద సినిమా అయినా నేను ఒప్పుకోలేను. అయినా అటువంటి పరిస్థితి నాకు రాలేదనుకోండి. ఇప్పటిదాకా అన్నీ మంచి కథల అవకాశాలే వచ్చాయి.

**మీరు మరువలేనంతటి ప్రశంస ఏదైనా ఉందా?**

నేను నటించిన హిందీ సినిమా 'ఫిల్హౌరి' చూసి









చాలామంది ప్రశంసించారు. నా నటనకోసమే 'మళ్ళీ మళ్ళీ' సినిమా చూశామని కొందరు దర్శకులు చెప్ప డాన్ని నేను ఎప్పటికీ మర్చిపోలేను.

**ఓ నటిగా మీరు కోరుకునేది ఏమిటి?**

నేను అందుకున్న విజయాలు మరింత హార్డ్ వర్క్‌కు పురికొల్పుతు న్నాయి. ప్రేక్షకులకు ఆనందాన్ని, వినోదాన్ని ఇవ్వగలగాలి.

ఊరికేతెరపైన ఎంటర్‌టైన్ చేయ డం కాకుండా రోల్ మోడల్ కావాల న్నది నా కోరిక. ఆఫ్ స్క్రీన్ కూడా స్ఫూర్తిదాయకంగా వుండాలి.

**సినిమాల్లోకి రావాలనుకున్నప్పుడు మీ కుటుంబ సభ్యులు ఎలా స్పందించారు?**

మాకు సినీ నేపథ్యం లేదు. మా అమ్మానాన్నలకు సినిమాలగురించి తెలియదు.

నాన్న వ్యవసాయం, అమ్మ హౌస్‌వైఫ్. నా సోద రుడు మోడలింగ్ రంగంలో ఉన్నాడు. తనకు సిని మాలగురించి బాగాతెలుసు. సినిమాల్లోకిరావాలన్న నిర్ణయాన్నిఅమ్మానాన్నలకుచెప్పి ఒప్పించింది తనే.

**ఇద్దరుకథానాయికలున్న సినిమాల్లో చేస్తారా?**

హీరోయిన్లు ఎంతమంది వున్నా, కథలో ఎవరి ప్రాధాన్యం వారికే ఉంటుంది కదా. నా పాత్రకు తగిన ప్రాధాన్యం వుంటే ఎంతమంది హీరోయిన్లు ఉన్నా నాకు అభ్యంతరం లేదు.

**మీరు ఇష్టపడే హీరోయిన్లు ఎవరు?**

ప్రియాంకచోప్రా అంటే నాకు చాలా ఇష్టం. ఆమె మాదిరి బిజీ అయిపోవాలని కలలు కంటుంటా. అనుష్కశర్మ అన్నా చాలా ఇష్టం. ఓ నటిగా, నిర్మా తగా తను చేసే పని నాకు ఎంతగానో నచ్చుతుంది. ఇక, దక్షిణాదివారి జాబితా చాలా వుంది.

**మామూలుగా మీ సినిమా విడుదలకు ముందు టెన్షన్ పడుతుంటారా?**

టెన్షన్ కాదు కాని, బాగా ఎగ్జయిట్ అవుతుంటా. ప్రతి సినిమాకూ ఇలాగే వుంటుంది.

బహుశా భవిష్యత్తులో మరో ఏభై సినిమాలు చేసినా ఇంతే వుంటుందేమో.

**మీ ప్రాధాన్యం ఉత్తరాదికా? దక్షిణాదికా?**

నాకు దక్షిణాదిలోనే అవకాశాలు ఎక్కువగా వస్తున్నాయి. ఒక్కముక్కలో చెప్పాలంటే టాలీవుడ్ నాకు తల్లి వంటిది. కాబట్టి నా తొలి ప్రాధాన్యం తెలుగు పరిశ్రమకే. తమిళంలోనూ అవకాశాలు వస్తున్నాయి కాని, డేట్లు కుదరడంలేదు.

**దేవుడంటే నమ్మకం ఉందా?**

చాలా. అయినా దేవుడిని నమ్మనివారు ఉంటా రని నేను అనుకోను.

దేవుడిని నమ్మనివారుసైతం మనను నడిపించే శక్తి ఒకటి వుంటుందని నమ్ముతారు.

ఆ శక్తే భగవంతుడనేది నా విశ్వాసం. నేను నమ్మే, ఇష్టపడే దేవుళ్ళజాబితా చాలా పెద్దది అను కోండి అంటూ ముగించింది మెహరీన్.

**అయినపూరి సుజాత**

సీరియల్

# సామ్రాట్ సముద్రగుప్త

కచుడు "మహామంత్రీ! లావినియాను నావెంట తీసుకొని వెళుతున్నాను" అన్నాడు.

కశ్యపుడిలో భయసంభ్రమాలు! "ఎక్కడకు సామ్రాట్!" అని అడిగాడు.

"నాతోపాటే లావినియా నన్ననుసరిస్తుంది"

"ఆమె మరోసారి ఆత్మహత్యకు తలపడితే.."

"సముద్రగుప్తుడి కుత్తుకను కోసివేయగలనని హెచ్చరిక ఇచ్చాను. సముద్రగుప్తుడిని ప్రాణాలతో చూడాలంటే మరోసారి ఆత్మహత్యా ప్రయత్నం చేయవద్దని హెచ్చరించాను కశ్యపా!" అన్నాడు కచుడు.

సి. శివరామమూర్తి

**జరిగిన కథ (23)**

సముద్రగుప్తుడు సామ్రాట్ అవుతాడని, కచగుప్తుడు కనబడడని సేనానాయకులకు చెప్తాడు కశ్యపుడు. రేపు ఉదయం దక్షిణ వనానికి వెళ్ళండి, పరశువుతో ఓ వ్యక్తి తారసపడతాడు. ఆ వ్యక్తి నుండి ఆ పరశువును దానంగా తీసుకోండని సేనానాయకులకు చెబుతాడు కాపాలికుడు.

నిన్ను ఇక్కడకు చేర్చిందెవరో చెప్పమంటూ లావినియాను నిలదీస్తాడు కచుడు. సముద్రగుప్తుడు జైత్రయాత్రకు బయల్దేరతాడు.

చెట్లను నరికే ఓ వృద్ధుడి ఆవు మీదకు ఓ చిరుతపులి లంఘిస్తే ఆ వృద్ధుడు తన చేతిలోని పరశువుతో ఆ చిరుతపులిని వీరావేశంతో సంహరిస్తాడు.

అది చూసిన చంద్రగుప్తుని సేనా నాయకులు కాపాలికుడు చెప్పినవిధంగా ఆ వృద్ధుడిని అడిగి అతని పరశువును దానంగా కోరతారు.

ఆ వృద్ధుడు తన పరశువును వాళ్ళకిస్తాడు. జరిగిన సంఘటనను సేనానాయకులద్వారా తెల్సుకున్న చంద్రగుప్తుడు స్థిమితపడతాడు, తన కుమారుడి విజయం తథ్యమని. సముద్రగుప్తుడివద్దకు చేరుతుందా పరశువు. నాగాయకుడు సముద్రగుప్తుడిని తక్కువ అంచనా వేస్తాడు.

తనదని ఇంత కాలం భావిస్తున్న హేమమాలకు ఆమె తండ్రి కిదారుడు స్వయంవరం ప్రటించేసరికి మండిపడతాడు కచుడు.

ఇక జరిగేది చదవండి.

"... ... ..."

"మహామంత్రులు ఏమిటి ఆలోచిస్తున్నారు?" అని అడిగాడు.

కశ్యపుడు ఏమాత్రం తొట్రుపడకుండా "మరేం లేదు సామ్రాట్! మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. కానీ లావినియాను నీడలా వెన్నంటివుండే విశ్వసనీయ అంతఃపుర పరిచారిక గురించి ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"ఎందుకు?"

"లావినియా ఆత్మహత్య చేసుకోకుండా, తప్పించుకొని పారిపోకుండా ఉండేందుకు" అన్నాడు కశ్యపుడు.

"అయితే మన సౌగంధిని ఉన్నది కదా" అన్నాడు.

"అవును సామ్రాట్...! సౌగంధిని ఎంతో విశ్వాసపాత్రురాలైన స్త్రీ. సరైన పేరు సూచించారు. తక్షణమే సుకన్యను తొలగించి లావినియా ప్రాసాదంలో సౌగంధినిని నియమిద్దాం"

కచుడి ఆజ్ఞ అయింది. ఆ వెనువెంటనే సుకన్యస్థానంలో సౌగంధిని నియమించబడినది.

సుకన్య వచ్చి కశ్యపుడిని ఆశ్రయించింది. "ఇదేమిటి మహామంత్రులిలా చేశారు... నేను ఎంతో విశ్వాసపాత్రురాలిని. ఆ పాముపడగలో లావినియాను ఉంచుతారా?"

"దీనికి సమాధానం రేపు ఉదయాన తెలుస్తుంది. వెళ్ళి ఈ రాత్రి ప్రశాంతంగా నిదురపో!"

సుకన్య నిష్క్రమించింది.

కచుడు సౌగంధినికి ఉత్తర్వులు జారీచేసి తన విశ్రాంత గృహానికిచేరాడు. ఆ మరునాడు గాంధార దేశ దండయాత్రకు ముహూర్తం నిర్ణయించబడింది... అప్పటికప్పుడు సైన్యాన్ని సమాయత్తం కమ్మనమని ఉత్తర్వులు ఇవ్వబడ్డాయి!

రాజధాని పాటలీపుత్రంలో తెల్లవార్లూ సైనికుల కోలాహలం. చివరకు ఎదురుచూసిన ఆ సూర్యోదయం రానేవచ్చింది.

అక్కడ ఇంద్రప్రస్థంలో నాగాయకుడిపై ముట్టడికి, ఇక్కడ పాటలీపుత్రంలో గాంధార దేశంపై దండయాత్ర ప్రయాణానికి సర్వసైన్యాలు అప్రమత్తమయి సిద్ధంగా ఉన్నాయ్!

ఇంతలో దండయాత్రకు సిద్ధమవుతున్న కచుడికి అశనిపాతంలాంటి వర్తమానం. "లావినియా అదృశ్యమైందిట.





## పాటతో బాట

మెయిన్ హీరోయిన్‌గా ఎలాగూ వర్కవుట్ కావడంలేదు కాబట్టి సైడ్ హీరోయిన్‌గా అయినా సర్దుకుపోదామని బెంగళూరు బ్యూటీ ప్రణీత ఎంతగా ప్రయత్నిస్తున్నా ఫలితాలు లేకపోతున్నాయి. స్టార్ హీరోలతో స్క్రీన్ షేర్ చేసుకున్నా నో యూజ్.

ఏదో కమర్షియల్స్, ప్రారంభోత్సవాలతో జనంముందుకు వస్తున్న ప్రణీత ఇప్పుడు బాలీవుడ్‌పై కన్నేసింది. ఏదోక అవకాశంలే అనుకుందేమో హిందీ సినిమాలో ఓ పాటలో మెరిసేందుకు ఉత్సాహం చూపింది. ఈ పాటలో ప్రణీత సరికొత్తగా కనపడుతుందట. ఉత్తరాది గుర్తింపు వస్తుందా? ఏమో... చూద్దాం.

ఎంత గాలించినా ఆమె ఆచూకీ దొరకలేదుట" కచుడికి నుంచున్న నేల చీలినట్లయింది. హుటాహుటిన లావినియా రాజప్రాసాదానికి చేరాడు.

అక్కడ సౌగంధిని మొహంలో నెత్తుటిచుక్క లేదు. కచుడిని చూడగానే సౌగంధిని నోట తడారిపోయి మాటలు తడబడ్డాయ్!

కచుడు సుకన్యను పిలిచాడు.

సుకన్యకు జరిగినదేమిటో అర్థమై తేరుకోవటానికి చాలాసేపు పట్టింది. "సామ్రాట్! నాకేం తెలియదు. నేను అమాయకురాల్ని. నిన్నటినుండి నన్ను ఇక్కడనుండి తీసివేశారుకూడాను"

"అవును... సుకన్య చెపుతున్నది నిజమే! రాత్రికి రాత్రి లావినియా ఎలా అదృశ్యమయింది"

సుకన్య భయంగా "నిజంగా నాకేం తెలియదు ప్రభూ..! నిజానికి లావినియా, సౌగంధినిలు ఎంతో అంతరంగిక స్నేహితులు" అని చెప్పింది.

"ఏమిటి లావినియా, సౌగంధినీలు మిత్రురాళ్ళా" అనడిగాడు.

"అవును ప్రభూ! అందుకనే నన్ను తొలగించి ఆమెను నియమించారు కదా...!" అమాయకతను నటిస్తూ అన్నది సుకన్య. కచుడికి ఆగ్రహం ఉప్పెనలా ముంచుకొచ్చింది.

"చెప్పు సౌగంధినీ! చెప్పు... లావినియా ఎక్కడకెళ్ళింది... నీకు తెలియకుండా లావినియా అదృశ్యమవ్వటం అసంభవం!"

సౌగంధినికి ముచ్చెమటలు పోశాయ్! "నిజం ప్రభూ! నాకు తెలియదు. నిద్ర నుంచి లేవగానే లావినియా కనపడలేదు. అంతే!" అని చెప్పింది.

"ఓహో! నిన్ను నిద్రపొమ్మనా ఇక్కడ నియమించింది" అని కచుడు హుంకరించాడు.

సౌగంధిని కాళ్ళు, చేతులు వణకటము మొదలుపెట్టాయ్.

ఇంతలో రాజభటులు సౌధాన్నంతటినీ అణువణువునా శోధించి ఒకలేఖను కచుడికి అందజేశారు. అది అంతకు ముందు సుకన్య కశ్యపుడి నుంచి లావినియాకు పట్టుకువచ్చిన లేఖ.

ఆ లేఖలో... ఇలా రాసివుంది.

"భయం లేదు లావినియా, కచగుప్తుడి చేతిలో ప్రమాదం సంభవించినట్లయితే ప్రాసాదం నుంచి పారిపోగలవు. మిగిలిన వివరాలను సౌగంధిని చెప్పగలదు. అవసరమయితే తప్పించుకునేందుకు నీకు తోడ్పడుతుంది సౌగంధిని" ఈ లేఖను చదివి కచుడు కాలరుద్రుడయ్యాడు.

"రాక్షసీ! ఎవరు రాశారే ఈ ఉత్తరాన్ని. చెప్పు... చెప్పకపోతే నిన్ను చిత్రవధ చేయిస్తాను" అన్నాడు.

సౌగంధిని వణికే చేతులతో ఆ ఉత్తరం చదివి తనమీద పన్నిన కుట్రను అర్థం చేసుకుంది. ఇపుడు తన రోదన అరణ్య రోదనయే... కచుడు చేయబోయే చిత్రహింస ఆమె కనుల ముందు మెదిలింది.

ఒక్కసారిగా తన చేతివేలికి వున్న వజ్రపుటుంగరాన్ని తీసుకుని చటుక్కున మింగివేసింది. అందరూ చూస్తుండగా రక్తం కక్కుకుంటూనే నేలకు ఒరిగిపోయింది. సౌగంధిని కథ అలా ముగిసిపోయింది.

కచుడు చనిపోయిన సౌగంధినివైపు ఏహ్యతతో చూసి నిష్క్రమించాడు.

'లావినియా ఏమయింది?'

ఎంత ఆలోచించినా కచగుప్తుడికి లావినియా అదృశ్యమయిన విచిత్రవైనానికి మూలం దొరకటం లేదు. ఆ విషయం ఒక్క సౌగంధినికే తెలియాలని కచుడి నమ్మకం. కానీ ఆ సౌగంధిని ఇప్పుడు ఈ లోకంలో లేదు.

తన అధీనంలో, రాజధాని నట్టనడి ఉన్న కోటలో నిరంతర పహరాలో ఉన్న ప్రాసాదం నుంచి లావినియా ఎలా మాయమయింది?

ఈ విషయం తెలిసిన కశ్యపుడు కూడా విషాదాన్ని మొహాన రంగరించుకున్నాడు.

"సామ్రాట్! లావినియా సంగతి అలా ఉంచండి. ఇవాళ కాక రేపయినా ఆమె ఆచూకీ తెలియకపోదు"

"... ... ..."

"ముందు అక్కడ హేమమాల స్వయంవరం జరిగిపోతుంది. లావినియా సామాన్య వనిత. ఆమెవెంట రాజ్యాలు సంక్రమించవు. కానీ అక్కడ కుషాన్‌ల సామ్రాజ్యం. ఆలస్యం చేస్తే రాజ్యమూ, రాజ్యశ్రీ రెండూ మన చేతి నుండి జారిపోతాయ్!"

కచగుప్తుడిలో విపరీతమయిన నిస్సహాయ ఆక్రోశం. 'కానీ ఏం చేయాలి. ఎవర్ని దండించాలి'

కచుడు ఆ ప్రాసాదాన్ని కాపలా కాస్తున్న పదిమంది రాజభటులకు ఉరిశిక్షను ప్రకటించాడు.

ఆ భటులందరూ కచుడి పాదాలపై పడ్డారు. ప్రాధేయపడ్డారు. 'తమకేమీ తెలియదని. తాము ఒక్కక్షణం కూడా ఏమరుపాటు కాకుండా అప్రమత్తులమై కాపలా కాస్తున్నామని' చెప్పారు.

కచుడిలో కనికరం కలగలేదు.

మహామంత్రి జోక్యం చేసుకుని "అవును భటులారా! విధినిర్వహణలో మీరుచేసిన లోపఫలితమే ఈదారుణం. సామ్రాట్ విధించిన శిక్ష అమలుజరగవలసిందే" అన్నాడు.

వాళ్ళందరూ ఏడుస్తుండగా బరబరమని లాక్కొని వెళ్ళారు దండనాయకులు. కచుడిలో ఆక్రోశం అగ్నిపర్వతంలా బుసలుకొడుతోంది 'లావినియా ఏమయినట్లు'. కశ్యపుడు మరోసారి కచుడికి కర్తవ్యాన్ని గుర్తుచేశాడు.

"సామ్రాట్! ఈ విషయాన్ని నాకు వదిలివేయండి. ముందు గాంధార నగరానికి ప్రయాణం కండి. లావినియాను ఎలాగైనా నేను సజీవంగా బంధించి ప్రాణాలతో మీ ముందుంచుతాను"

కచుడు సందేహంగా చూశాడు.

"అలా చేయకపోతే ఈ కశ్యపుడి తలను తీయించి కోట గుమ్మానికి వేలాడదీయండి సామ్రాట్!"

"... ... ..."

"అవును సామ్రాట్! నా మాటలను విశ్వసించండి. వెంటనే కర్తవ్యోన్ముఖులై గాంధార నగర దండయాత్రకు బయల్దేరండి. చివరి క్షణంలో మీరు ఈ

**అత్యాచారం నుండి తప్పించుకునే పాఠాలు అమ్మాయిలకు చెప్పటం కాదు... అత్యాచారం ఎంతటి ఘోరమో మగపిల్లలకు చెప్పాలి.**

-అనుష్క, శంకర్, సంగీత కళాకారిణి



దండయాత్రను ఉపసంహరించుకుంటే సైన్యంలో మీరు చులకనయిపోయే ప్రమాదం ఉంది.

పైగా ఇది రాజుగా ప్రకటించిన మొదటి దండయాత్ర కూడాను"

కచుడికి కశ్యపుడు చెప్పింది సబబన్పించడమేగాక, అంతకుమించి మరో గత్యంతరం కూడా లేకపోయింది. మరికొద్ది ఘడియల్లో కచుడు సైన్యాన్ని ఆయుత్తం చేసి గాంధార నగరాభిముఖంగా ప్రయాణం కట్టాడు.

కచుడు అలా నిష్క్రమించగానే ఉత్తర క్షణంలో చంద్రగుప్తుడితో ఉత్తర్వులు ఇప్పించి రాజభటులకు మరణ శిక్షను రద్దు చేశాడు.

కశ్యపుడు శిక్షను తగ్గించి కారాగారం పాలుచేశాడు. ఆ పదిమంది రాజభటులు తమకు ప్రాణదానం చేసినందుకు చంద్రగుప్తుడికి కృతజ్ఞతలు తెల్పుకొని మళ్ళీ మళ్ళీ మొత్తుకున్నారు. "తాము అమాయకులమనీ, తమకు ఏదీ తెలియదని"

కశ్యపుడు వారివైపు కరుణగా చూసి "ఆ విషయం మాకు కూడా తెలుసు!" అన్నాడు.

"మరయితే ఈ కారాగార శిక్ష ఏమిటి అమాత్యా!"

"ఒక్క పక్షంరోజులు మాత్రమే! ఆ తర్వాత మీరు ఈ కారాగారం నుండి విముక్తులవుతారు"

"కచగుప్తులు తిరిగివచ్చినతర్వాత" అన్నాడు. కశ్యపుడు "ఆ ప్రమాదమూ, మీకే కాదు, నాకూ ఉన్నది, శిక్షను అమలుపరచని నేరస్థుడ్ని నేను"

"మరి...."

కశ్యపుడు మరి తర్కించలేదు.

"ఒక్క పక్షంనాళ్ళు ఓపికపడితే పరిస్థితులు సానుకూలమవుతాయి.అంతవరకూ కారాగారంలో విశ్రాంతి తీసుకోండి" అని చెప్పాడు.

"మమ్మల్ని విడుదల చేస్తే మరో దేశానికి పారిపోతాం అమాత్యా!"

"అందుకనే మిమ్మల్ని బంధించడంలో గల మా ఆంతర్యం.

నిజానికి ఆ అవసరం మీకు లేదు. రానివ్వను. మీరు నిర్దోషులే. నిశ్చింతగా ఉండండి" అని చెప్పాడు.

ఇక్కడ సామ్రాట్ "కశ్యపా! ఇంతకూ లావినియా ఏమయినట్టు..."

కశ్యపుడు "మీకు ఎంత తెలుసో నాకంతగానే తెల్సు సామ్రాట్! అయితే నాకు తెలిసిన సమాచారం ఎక్కడున్నా



మోడీ పరిపాలనలో వ్యవస్థలపై నమ్మకం సన్నగిల్లింది. గతంలో ఇలా ఎన్నడూ జరగలేదు.

-అశోక్ గెహ్లాట్, కాంగ్రెస్ నేత

లావినియా క్షేమం అని మాత్రం తెలుసు"

"ఎవరు చెప్పారు?"

"కాపాలికుడా!"

"అవును కాపాలికుడే"

సామ్రాట్ తర్కించలేదు.

"ఇంతకీ కాపాలికుడి నుంచి వేరే సమాచారం ఏదైనా ఉన్నదా!"

"మిమ్ములను ఉన్నఫళాన తొడ్కొని రమ్మనమన్నారు ప్రభూ!"

సామ్రాట్ కశ్యపుడితో కలిసి భద్రకాళి ఆలయానికి బయలుదేరాడు.

అక్కడ కాపాలికుడు ఆ రోజునుంచీ అంటే సముద్రుడు ఇంద్రప్రస్థానానికి బయలుదేరిననాటినుంచి అగ్నికుండంలో కూర్చొని కాళీపూజను నిర్విరామంగా చేస్తున్నాడు. సామ్రాట్‌ను చూసి కాపాలికుడు కళ్ళు తెరిచాడు.

"దీక్ష పూర్తయింది చంద్రగుప్తా!"

చంద్రగుప్తుడు, కశ్యపుడు ఆ మాటలకు ఒకరివైపు ఒకరు చూసుకుని ఆ తరువాత కాపాలికుడివైపు ప్రశ్నార్థకంగా చూశారు.

"భైరవుడు ఆవాహన చేయబడ్డాడు. చూస్తావా చంద్రగుప్తా!"

చంద్రగుప్తుడికి భైరవదర్శనం గుర్తుకువచ్చి ఒళ్ళు భయంతో జలదరించింది. ఐతే కాపాలికుడి ఆంతర్యం తెలిసిన చంద్రగుప్తుడు ఎక్కువ ఆలోచించకుండా తల ఊపాడు.

"కళ్ళుమూసుకో చంద్రగుప్తా!"

చంద్రగుప్తుడు కళ్ళు మూసుకున్నాడు.

"చంద్రగుప్తా! ఈ భైరవుడు నీ సామ్రాజ్యానికి రక్షకుడు. ఇంతకాలం నిద్రలో ఉన్న ఈ భైరవుడు మళ్ళీ మేల్కొనబోతున్నాడు. చూడుమేల్కొని ఏం చేయబోతున్నాడో"

ఉన్నట్టుండి కళ్ళు మూసుకున్నాడు చంద్రగుప్తుడు. హఠాత్తుగా ఎదురుగా ఉన్న ఈ దృశ్యమాన ప్రపంచంమొత్తం మాయమవుతున్న అనుభూతి.

భూమి బద్దలవుతున్న శబ్దం... ఆ శబ్దం నుండి కాలభైరవుడు దర్శనం ఇచ్చాడు. ఆకాశమంత ఎత్తుకు ఎగసిపోయి ఒడలంతా జడలు కప్పుకుని చేతిలో గండ్రగొడ్డలిని ధరించి, అగ్నిగోళాల్లాంటి భయంకరమైన కళ్ళతో నాలికనుండి రక్తం కారుకుంటూ భైరవుడు దర్శనం ఇచ్చాడు.

"ఆకలి.. ఆకలి" అంటూ పెడబొబ్బలు పెడ్తున్నాడు భైరవుడు.

కాపాలికుడు "భైరవా... వెళ్ళి నీ ఆకలి తీర్చుకో"

"జైకాళీ... మహాకాళీ!" భైరవుడు భూమి దద్దరిల్లిపోయేటట్టుగా అంగలార్చుకుంటూ గండ్రగొడ్డలిని భుజాన పెట్టుకొని, ఉత్తరాభిముఖంగా అడుగులు వేస్తున్నాడు.

"ఎక్కడా... ఎక్కడా... అని భైరవుడి భయంకరమైన రంకెలు" చంద్రగుప్తుడి చెవుల్లో ఇంకా మార్మోగుతున్నాయ్.

"అదిగో ఉత్తర దిక్కున.... ఇంద్రప్రస్థనగర శివార్లలో జరగబోయే ఘోర సంకుల సమరంలో సముద్రగుప్తుడు గండ్రగొడ్డలితో విజృంభిస్తున్నాడు. వెళ్ళి అతడ్ని ఆవహించు"

భైరవుడు భయంకరంగా నవ్వాడు. "సముద్రుడా... ఒట్టి పిరికివాడు.పిరికి వాళ్ళను నేను ఆవహించలేను"

కాపాలికుడు "అది నిన్నటి మాట భైరవా! నేడు గుడ్డును చీల్చుకుని డేగపిల్ల బయటకు రాబోతోంది. సముద్రుడు మహావీరుడు మహాశూరుడు" అని చెప్పాడు.

"కాపాలికా..! ఆ దక్షయజ్ఞంలోని ప్రమథగణాలలోని శివదాసుడ్ని నేను. నాలోని ప్రచండ వేగాన్ని, సహస్ర సూర్యుల సమానమైన శక్తి సామాన్య మానవుడు తట్టుకొనలేడు.

నేను ఆవహిస్తే అతడి శరీరం



## హ్యాపీ డేస్

స్కూల్ రోజుల మాట వినపడితే చాలు హ్యాపీ డేస్ అంటూ ఆనందంతో ముఖమంతా నవ్వుల కాంతుల్ని పులుముకుంటుంది కాజల్ అగర్వాల్. "నేను స్కూలుకు వెళ్ళానంటే భలే మంచి అమ్మాయిగా మారిపోయేదాన్ని. పుస్తకాలు బట్టీపట్టేసి, పరీక్షలు రాసిన దాఖలాలే లేవు. క్లాస్ ఫస్ట్ అయితే రాలేదుకాని, ఫస్టు మార్కులుమాత్రం వచ్చేవి.

కాలేజీకి వెళ్ళాక ఒక్కరోజు కూడా ఎగ్గొట్టలేదు. క్యాంటిన్‌లో గ్రూపులుగా కూర్చుని గంటలతరబడి కబుర్లాడుకునే వాళ్ళం" అని చెప్పింది కాజల్ అగర్వాల్.



తుత్తునియలయిపోతుంది. కేవలం యోగ శరీరాలను ధరించిన మహా వీరుడే నా వేగాన్ని నిగ్రహించగలుగుతాడు" అని చెప్పాడు.

"భైరవా...! నిస్సందేహంగా సముద్రుడు ఆ కోవకు చెందినవాడే. భద్రకాళీ అనుగ్రహపాత్రుడు... కారణ జన్ముడు, మహా ప్రాభవ వైభవ గుప్త సామ్రాజ్యానికి మూలపురుషుడు కాబోతున్న సముద్రుడు నిజంగా అసామాన్యుడు, అద్వితీయుడు"

"కానీ నేను ఆవహించటంవల్లనే ఆ సముద్రుడు యుద్ధం చేయకూడదు. స్వతస్సిద్ధమైన మహాశూరుడిని నిర్భయుడై, మృత్యువును ఒక గడ్డిపోచ లాగా స్వీకరించగల మహావీరుడిని మాత్రమే ఆవహించగలను. అతడిలో అవలేశమంత భయం ఉన్నా నేను ఆవహించలేను కాపాలికా?"

"అలాగే భైరవా..! వెళ్ళి చూడు... అక్కడేం జరగబోతుందో... నువ్వే చూస్తావు కదా!" అన్నాడు.

కాపాలికుడు సామ్రాట్‌ను తట్టి లేపుతున్నాడు.

"చంద్రగుప్తా! ఇక లే... లేచి కళ్ళు తెరువు" అన్నాడు.

చంద్రగుప్తుడు కళ్ళు తెరిచాడు. అపుడే ఎదురుగా భైరవదర్శనం.

కాపాలికుడు అగ్నికుండం నుంచి బయటకు వచ్చి కూర్చున్నాడు.

చంద్రగుప్తుడి కళ్ళలో వినూత్న కాంతి. కాపాలికుడు "చంద్రగుప్తా! ఇక అక్కడ కార్యం ముగిసిపోతుంది. ఇక్కడ ఈ భూమికలో నా పాత్ర కూడా అయిపోతోంది"

"అపుడే కాదు కాపాలికా...! అసలు ఇపుడే ప్రారంభమయింది"

"కాదు చంద్రగుప్తా! అలా అని కాళీమాత చెప్పింది"

"కాదు కాపాలికా...! ఈ మహా సామ్రాజ్య సంరక్షణకు, విస్తరణకు, ధర్మోద్ధరణకు నీలాంటి మహనీయుడు ఎంతయినా అవసరం"

"కానీ చంద్రగుప్తా! అలౌకిక శక్తులను అన్నివేళలా ఆసరాగా తీసుకొన రాదు. మానవుడు ముందుగా భగవంతుడు తనకు ఇచ్చిన శక్తిసామర్థ్యాలపైనే ఆధారపడాలి"

"కానీ ఈ మహాసామ్రాజ్య నిర్వహణ కేవలం మానవశక్తివల్లనే సాధ్యం కాదు కాపాలికా...! దైవశక్తి తోడయినప్పుడే మానవుడు అద్భుతాలను చేయగలుగుతాడు"

"ఆ దైవశక్తి నీ వంశానికి సంపూర్ణంగా ఉంది చంద్రగుప్తా! ఆ ఒక్క సముద్రుడికే కాదు... అతడికి పుట్టబోయే కొడుకు విక్రమార్కుడు కూడా అచంచల కాళీ భక్తుడు.

అతడి కొలువులో కాళీమాతకు అనుగ్రహపాత్రుడైన కాళిదాసు అనే ఒక మహాకవి అవతరిస్తాడు.

ధర్మోద్ధరణ, పాండిత్యం, సంపద, భోగభాగ్యాలు, ఎల్లెడలా శాంతి సంతృప్తులూ,ఏకచ్ఛత్రాధిపత్యమూ... ఇవి నీ సంతతిలోనివారు సాధించబోయేవి" అని చెపుతాడు.

"... ... ..."

"ఒక్కొక్క కాలములో ఒక్కొక్క దేవతాంశసంభూతులు ఈ భూమిని పరిపాలిస్తారు సామ్రాట్!" అన్నాడు.

"అంటే"

"భారతంలో నారాయణాంశసంభూతులూ, మౌర్యుల కాలంలో అగ్నిసంభూతులు, శాతవాహనుల కాలంలో ఈశ్వర సంభూతులు, ఆ తర్వాత అంతటి ప్రాభవవైభవాన్ని సంతరించుకున్న ఈ గుప్తుల కాలంలో కాళీమాత సంభూతులూ ఈ భారతావనిని పరిపాలిస్తారు చంద్రగుప్తా!"

చంద్రగుప్తుడు ఎదురుగా ఉన్న కాళీమాతకు నమస్కరించాడు భక్తి ప్రపత్తులతో. "మీ వంశంలోనివారందరూ ఈ కాళీ భక్తులే. మీరందరూ పూర్వజన్మలలో ఒకప్పుడు నావంటి కాపాలికులే..."

"... ... ..."

"చంద్రగుప్తా! అలా అని ఆ తల్లి నాతో చెప్పి ఉన్నది. కాళీమాత విభూతి అనంతం. ఆ తల్లి దివ్యమహిమను ఏమని కొనియాడగలం. వేయి నాలుకలు కూడా చాలవు ఆ జగన్మాత దివ్య మహిమను చెప్పటానికి..."

కశ్యపుడు ఇంతవరకూ కేవలం ప్రేక్షకుడిగా మిగిలిపోయినా ఏమీ అర్థం గాక కాపాలికుడివైపు అలా చూస్తూ వింటున్నాడు భక్తిశ్రద్ధలతో.

"కశ్యపా! నీ రాజభక్తి, దేశభక్తి నిరుపమానం. ఈ జన్మలో ఆ భగవంతుడు నీకు ఇచ్చిన పాత్రను సమర్థవంతంగా నిర్వర్తిస్తున్నావ్... ఈ జన్మలో మహామంత్రివి నీవు, మరో జన్మలో ఆ తల్లి నీకు మరింత పెద్ద పాత్రను ఒక చక్రవర్తి జన్మను అనుగ్రహిస్తుందేమో!"

**ఆశించడం ఆపితే ఆనందం మొదలవుతుంది.**
**శాసించడం ఆపితే సంతోషం మొదలవుతుంది.**

కశ్యపుడు కాపాలికుడికి సాష్టాంగ ప్రణామం చేశాడు.

"ధర్మాభివృద్ధిరస్తు...!" కాపాలికుడు దీవించాడు.

కశ్యపుడు లేచి "మహాపురుషా, కాపాలికా! నీ ఆశీర్వచనం అమోఘం. నీ వాక్కును సాక్షాత్తూ ఆ కాళీమాత వాక్కుగా భావిస్తాను" అన్నాడు.

"శుభం భూయాత్!" కాపాలికుడు మరోసారి ఆశీర్వదించాడు.

కశ్యపుడు "ఇంతకూ లావినియా ఎక్కడ వున్నది?" అనడిగాడు.

"లావినియా సురక్షితంగా ఉన్నది?" అని చెప్పాడు.

"అక్కడే ఆ కోటలో..."

"ఏమిటి కోటలోనా... ఎక్కడ...? ఎలా?" చంద్రగుప్తుడిలో ఆశ్చర్యం.

"అవును నువ్వు ఈ దేశానికి ప్రభువయినా నీ కోటలోని రహస్యాలు నీకు తెలియవు చంద్రగుప్తా!" కశ్యపుడు, చంద్రగుప్తుడు ఉత్కంఠగా చూశారు.

"ఈ భద్రకాళీ గర్భగుడి నుంచి రహస్య ద్వారమున్నది నీ కోటలోకి. నీ రాజప్రాసాదాలకు అనేక రహస్య నేలమాళిగలు ఉన్నాయ్!

ఆ నేలమాళిగలను కలుపుతూ ముఖ్య ప్రాసాదాలన్నింటిలో అనేక రహస్య ద్వారాలు ఉన్నాయ్!"

"... ... ..."

"ఇవన్నీ నీకు తెలియదు చంద్రగుప్తా! కారణం నీ తండ్రి నీ చిన్న వయసులోనే ఈ విషయాలు చెప్పకుండానే హఠాత్తుగా కన్నుమూయటం. ఇంతకీ శత్రువులు హఠాత్తుగా దాడి చేస్తే ప్రాణరక్షణకోసం ఏర్పాటుచేసిన ద్వారాలు ఇవి"

"అయితే కాపాలికా! నువ్వు..."

"అవును! నాకు అదృశ్యమయ్యే శక్తి లేదు. ఈ రహస్య మార్గాలన్నీ నాకు కరతలామలకాలు. నేను అన్నిచోట్లా హఠాత్తుగా అదృశ్యమయి, మళ్ళీ ప్రత్యక్షమయింది ఈ మార్గాలనుండే చంద్రగుప్తా!"

**ఇంకా ఉంది**



## అలుపెరగను

సుదీర్ఘంగా పనిచేయాల్సివస్తే అలసిపోయామని అందరూ అంటుంటారు. కాని అందాలతో రెచ్చిపోతున్న రకుల్‌ప్రీత్ సింగ్‌కు మాత్రం ఈ రూలు వర్తించదట. ఎంత పని వుంటే ఈ అమ్మడికి అంత మజా అట.

"షూటింగ్ కోసం వివిధ ప్రదేశాలు తిరగాల్సివస్తుంది. ఓ రోజు చెన్నైలో,మరురోజు ముంబయిలో, ఇంకోరోజు ఢిల్లీలో ఉంటుంటాం. నేను వసుధా వర్క్ హాలిక్‌ని కాబట్టి ఇవన్నీ నన్ను అలసటకు గురిచేయవు. ఎంత పనివున్నా అలసట అస్సలు తెలియదు. పైగా ఎంజాయ్ చేస్తుంటా" అని చెప్పింది రకుల్.

# హెల్త్ బిట్స్



## సంపూర్ణ ఆరోగ్యానికి

జీవితమంతా ఆరోగ్యంగా, ఆనందంగా గడచిపోవాలంటే ఒక క్రమబద్ధ జీవనవిధానం అవసరమని తేల్చారు. ఆ పద్ధతిలో జీవించటానికి ఏడు ముఖ్య అంశాలను ప్రతిపాదించారు. ఉదయం కాని, సాయంత్రం కాని కనీసం అరగంట సమయాన్ని ధ్యానానికి కేటాయించటం అవసరం.

ఆ అరగంట ధ్యానం మనసును అదుపులో ఉంచుతుంది. ప్రశాంతత తెస్తుంది. ఆహారం విషయంలో జాగ్రత్తలు పాటించాలి. వేళకు తిండి తినాలి. పోషక పదార్థాలన్నీ ఉండాలి. పరిమితంగా తినాలి. ప్రతిరోజూ అరగంటకు తగ్గకుండా వ్యాయామంచెయ్యాలి. అది నడకైనా ఓ.కె. చేసే పనిమీద ఇష్టతను పెంచుకోవాలి. నచ్చినరీతిలో పనిచేయటమనేది చాలా అవసరం.

ప్రతిరోజూ కనీసం ఏడుగంటలకు తగ్గకుండా నిద్ర వుండితీరాలి. కుటుంబ సభ్యులతో సమయం గడపాలి. వారితో కలసి ప్రయాణం చెయ్యాలి. స్నేహితులకు సమయం కేటాయించాలి.

సామాజిక సంబంధాలు సంపూర్ణ ఆరోగ్యాన్ని అందించటంలో పాత్ర వహిస్తాయి. ఉదయం వేళను ప్రశాంతంగా ప్రారంభించగలగటం నేర్చుకుంటే ఆరోగ్యంగా జీవితం సాగుతుంది. ◆

Courtesy : AROGYA SANJEEVANI

## కదలకపోతే మతిమరుపు

అటూ ఇటూ కదలక గంటలతరబడి ఒకేచోట కూర్చునేవారికి డయాబెటిస్, గుండెజబ్బు సమస్యలు వస్తాయని గతంలోనే తేలిన విషయం.

ఇప్పుడు వాటికి తోడు జ్ఞాపకశక్తి మందగించటం జత అయింది. అనేక వందలమంది మెదడును స్కానింగ్ చేసి చూశారు. 35 నుండి 75 ఏళ్ళ మధ్య వయసు కలిగినవారి శారీరక శ్రమ, వ్యాయామం, ఇతర అలవాట్లను అధ్యయనం చేశారు.

ఎవరయితే భౌతికంగా చురుకుగా, ఉత్సాహంగా వుండక ఒక చోటుకే పరిమితమయి, దీర్ఘకాలం అలాగే కూర్చునివుంటారో వారి మెదడులో కొత్త విషయాలను గుర్తుపెట్టుకునే భాగమైన మీడియన్ టెంపోరల్ లోబ్ తగ్గుదల గమనించారు.



కూర్చునివుండాల్సినదానికన్నా రోజుకు నాలుగు గంటలు అదనంగా స్థిరంగా ఒకేచోట కూర్చునేవారిలో ఆ మెదడు భాగం సరాసరిన రెండు శాతం మందం తగ్గుదల కనిపించింది.

అలా ఆ భాగం మందం తగ్గటమంటే క్రమంగా జ్ఞాపకశక్తి మందగించటమని భవిష్యత్‌లో డిమెన్షియాకి గురవుతారని హెచ్చరిస్తున్నారు. భౌతికంగా చురుకుగా వ్యవహరించటమంటే మెదడుని చురుకుగా ఉంచటమని గుర్తుపెట్టుకోండి. ◆



## లావు జంటల సమస్య

భార్యాభర్తలలో ఇద్దరూ లావుగా వుంటే లైంగికంగా ఒక రకమైన ఇబ్బంది. ఇద్దరిలో ఒకరు భారీ కాయులు అయితే సంతానం పొందటంలో ఇబ్బంది వస్తుంది. లావుగా వున్న ఆడవారు గర్భందాల్చటం ఇబ్బంది అనే విషయం చాలా కాలంగా అంగీకరించినదే. ఇప్పుడు జంటలో మగవారు లావుగా వున్నా గర్భం రావటం ఆలస్యమవుతుందని తేలింది.

అయిదువందలమంది దంపతులు, 18-44 మధ్యవయస్సు వున్న స్త్రీ, పురుషులమీద జరిపిన సర్వే ఇది. ఆ యా జంటల బాడీమాస్ ఇండెక్స్ (బి.ఎమ్.ఐ)ని లెక్కకట్టినతర్వాత ఆ యా జంటల లైంగిక అంశాల వివరాలు సేకరించారు.

ఎంత తరుచుగా సెక్స్‌లో పాల్గొంటారు, వారి బహిష్టుచక్రం ఎలా సాగుతున్నది, పురుషుల్లో అంగ స్తంభన సమస్యలు వున్నాయా అనే వాటినన్నింటినీ పరిగణనలోకి తీసుకున్నతరువాత బి.ఎమ్.ఐ. 35 అంతకన్నా అధికంగా వున్నవారు అనుకున్నంత త్వరగా గర్భం దాల్చలేరని తేల్చారు.

పిల్లల్లేని దంపతులకు చికిత్సచేసే సంతాన సాఫల్య కేంద్రాలవారు ఆ యా దంపతుల బరువు అంశం కూడా పరిగణనలోకి తీసుకోవాల్సివుంటుంది. ◆



## ముక్కునుండి రక్తం

ముక్కులోనుండి రక్తంవస్తుంది కొందరికి. ఎండాకాలంలో కనిపిస్తే వేడి చేసినందువల్ల అలా జరుగుతుందనుకుంటారు. అది ఒక కారణం మాత్రమే. గాయంవలన ముక్కు లోపలి పొరకు వచ్చిన ఇన్ఫెక్షన్‌వల్ల కూడా రక్తం కారవచ్చు.

సాధారణంగా ముక్కుమీద ఒత్తిడి పెట్టినపుడు ఐదునుండి పదినిమిషాల సమయంలో రక్తస్రావం ఆగిపోతుంది. అలా ఆగక ఇంకా ఎక్కువసమయం



రక్తం స్రవిస్తున్నా లేక రక్తస్రావం తరచుగా జరుగుతున్నా వెంటనే తగిన జాగ్రత్తలు తీసుకోవాల్సివుంటుంది. ముక్కులోపల గాయం లేదా గొంతులోపల కూడా రక్తం వస్తున్నట్టు కూడా అనిపిస్తే వెంటనే వైద్యుని సంప్రదించటం అవసరం.

ఇటీవలి కాలంలో ముఖానికి, తలకేదైనా గాయమైందేమో గమనించాలి. రక్తస్రావంవల్ల బలహీనత వస్తుంది. కళ్ళుతిరిగినట్టు అనిపించినా వెంటనే వైద్యుని సంప్రదించి పరీక్ష చేయించుకోవాలి.

# కదిలే బొమ్మల కబుర్లు

Review

## అవుట్ డేటెడ్ ప్రేమకథ

ప్రేమ అనేది అనిర్వచనీయమైన భావన. ప్రేమను అనుభవించడం సులువు. పలవరించడం కష్టం.అందుకే ప్రేమను వెండితెరపై పండించడం అంటే అంత సులువు కాదు. దానికి చాలా చాకచక్యం కావాలి.

తెరపైన ప్రేమకథలు పండాలంటే కీలకంగా కావాల్సింది హీరో హీరోయిన్లు. వారి మధ్య కెమిస్ట్రీ అద్భుతంగా పండాలి.ఆ హీరో హీరోయిన్లను చూసిన ప్రతి ప్రేక్షకుడు ఎక్కడికో వెళ్ళిపోవాలి. తమ తమ ప్రేమకథలు గుర్తుతెచ్చుకోవాలి. ప్రేమైకభావన వాళ్ళ గుండెల్ని అలా ఒక్కసారి పట్టి వదలాలి.

దీనికి కథ, కథనాలు అనే అదనపు హంగులు సమకూరాలి. అప్పుడు సినిమా సూపర్ అనిపించుకుంటుంది. ఇదంతా కూడా చెప్పినంత సులువు కాదు. కొద్దిమంది దర్శకులకు మాత్రమే సాధ్యమైన ఫీట్.

అందుకే అటు బాలీవుడ్‌లో అయినా, ఇటు టాలీవుడ్‌లో అయినా పూర్తి, ప్యూర్ లవ్ స్టోరీ సినిమాలు చాలా తక్కువ. తెలుగులో నిఖార్సయిన ప్రేమకథా చిత్రాలు ఏవి అని అడిగితే, ఎవరైనా సరే అప్పుడెప్పుడో వచ్చిన 'గీతాంజలి', 'ప్రేమ', 'నిన్నే పెళ్ళాడతా', 'సఖి' అంటూ అయిదో పేరు దగ్గర తడబడడానికి కారణం ఇదే. ఈ జాబితాలో చేరిపోవాలన్న తహతహతో ఈ వారం వచ్చిందో సినిమా. 'అదే 'నా నువ్వే'.

'నా నువ్వే' సినిమా ఎలా వుందో చూసే ముందు, కథ ఏమిటో చూద్దాం. మీరా ఓ కాలేజీ అమ్మాయి. విధి అనేదాన్ని బలంగా నమ్ముతుంది. అలాంటి అమ్మాయిని 'లవ్ సైన్స్' అనే పుస్తకం, పదేపదే వెన్నాడుతుంటుంది. ఆ పుస్తకంలో ఓ అబ్బాయి ఫోటో దొరుకుతుంది. అప్పటినుంచి ఆమెకు అన్నీ కలిసివస్తుంటాయి. దాంతో ఆ అబ్బాయే తన 'మిస్టర్ లక్కీ' అని ఫిక్సయిపోతుంది. ఇంతకూ ఆ అబ్బాయి ఎవరు? అతగాడి పేరు వరుణ్ (కళ్యాణ్‌రామ్).

అతగాడి బామ్మ, చుట్టూ వుండే జనం కూడా అదృష్టాన్ని, నమ్మకాలను నమ్మేవారే. అతగాడు మూడుసార్లు విమానాశ్రయం వరకు వెళ్ళి,అమెరికా వెళ్ళడం కుదరక వెనక్కు వస్తాడు.

ఇలాంటి ఇద్దరు కలుస్తారు. ఒకరికి ఒకరు నచ్చుతారు. కానీ మీరా తండ్రి (తనికెళ్ళ భరణి) అడ్డంపడతాడు. ఇలాంటి టైమ్‌లో అనుకోని సంఘటనలు జరిగి ఇద్దరూ దూరం అవుతారు.

మళ్ళీ వరుణ్ కలుసుకోవడంకోసం మీరా ఎఫ్ఎమ్ రేడియో జాకీగా 24 గంటల నాన్‌స్టాప్ మారథాన్ కార్యక్రమం స్టార్ట్ చేస్తుంది.అప్పుడేం జరిగింది అన్నది మిగిలిన కథ.

ఏ ప్రేమ కథకు అయినా థ్రెడ్ కాస్త చిన్నదే వుంటుంది. కానీ సరైన సంఘటనలు, వాటిని తెర కెక్కించే వైనం మాత్రం బలంగా వుండి, సినిమాను పండిస్తాయి. 'నా నువ్వే'సినిమాలో కూడా థ్రెడ్ చాలా చిన్నదే. డెస్టినీ అనే పాతకాలం లైన్‌ను పట్టుకుని దర్శకుడు జయేంద్ర కథ రాసుకున్నాడు. పోనీ పాత లైనే, కొత్తగా ఏమన్నా చూపిస్తారేమో అనుకుంటే అది కూడా లేదు. ఆ మధ్య 'హలో' అంటూ దర్శకుడు విక్రమ్‌కుమార్ డెస్టినీ బేస్డ్ ప్రేమకథను కొత్తగా, కాంటెంపరరీగా, యూత్‌ఫుల్ పెయిర్‌తో చూపిస్తేనే, ప్రేక్షకులు 'ఫీల్ లేదు' అని పక్కన పెట్టేశారు.

అలాంటిది ముదురు మొహాలను వీలయినంత లేతగా చూపిస్తూ, అరకొర సీన్లతో ఇదే అద్భుతం, ఫీలైపోండి అంటే జనాలేం చూస్తారు. కళ్యాణ్‌రామ్



### పాత్రకు న్యాయంచేశా

ఈమధ్య తమిళంలో విడుదలైన 'ఎక్స్‌వీడియోస్'అనే సినిమాలో అకృతిసింగ్ ఓ సన్నివేశంలో నగ్నంగా నటించడంపై విమర్శల దుమారంరేగింది. అశ్లీల వెబ్‌సైట్లప్రభావం యువతపై పడి, పెడదారి పట్టిస్తున్నదన్న విషయంపై ప్రజల్లో అవగాహన కల్పించడంకోసం ఈ సినిమా తీశారు.

బెంగాల్‌కు చెందిన అకృతిసింగ్‌కు ఇది తొలి తమిళ సినిమా. కొన్ని హిందీ సినిమాల్లో నటించింది. తాను నగ్నంగా నటించడంపై వచ్చిన విమర్శలకు ఆమె స్పందించింది.

"ఒక సామాజిక సమస్యపై ప్రజలను జాగృతం చేసే ఉద్దేశ్యంతో తీసిన సినిమా ఇది.

ఓ నటిగా పాత్రకు న్యాయంచేయడంకోసం నగ్నంగా నటించాను. సినిమాలో ఎటువంటి అసభ్యత, అశ్లీలత లేదు. కుటుంబసభ్యులతో కలిసి చూడవచ్చు" అంటూ వివరించింది. ◆



### అల్లరిపిల్లనే

హీరోయిన్ అయ్యాక చిలిపిగా, సందడిగా కనిపించే అనుపమా పరమేశ్వరన్ చిన్నతనంనుంచీ అల్లరిపిల్లేనట. స్కూల్ నుంచి కాలేజీకి వెళ్ళాక కూడా తెగ అల్లరిచేసేదట.

"ఎంత అల్లరిచేసేదాన్నో అంత బాగా చదివే దాన్ని. మార్కులు తెచ్చుకోవడంలోనూ ముందుండే దాన్ని.హాస్టల్‌లో ఏదిజరిగినా ముందు నా పేరే వినపడేది. దీనికి కారణం నువ్వేనా అని అడిగేవాళ్ళు. టీచర్లందరికీ నేనంటే ఇష్టమే.

సాంస్కృతిక కార్యక్రమాల్లోనూ ముందుండే దాన్ని. చిన్ననాటి అనుభవాల్ని మరువలేను" అంటూ ఫ్లాష్ బ్యాక్‌లోకి వెళ్ళింది. ◆




మొహం అయితే కాస్త యంగ్‌లుక్‌కు తీసుకువచ్చారు. కానీ కళ్ళలో ఆ ఫీల్‌నుతీసుకురావడంకుదరలేదు.

ఇలా లీడ్ పెయిర్ ఎప్పుడైతే కెమిస్ట్రీనే కాదు, ఫిజిక్స్, మేథమేటిక్స్, సమస్త సబ్జెక్ట్‌లు పండకపోవడంతో, సినిమా గాడి తప్పేసింది.

'నా నువ్వే' తొలిసగం టైటిళ్ళు ప్రారంభం కావడంతోనే అర్థం అయిపోతుంది. ఓపెనింగ్ షాట్‌లోనే హీరోయిన్ రైల్వేస్టేషన్‌లో 24గంటల రేడియో కార్యక్రమం నిర్వహించడానికి రావడమే నీరసంగా వస్తుంది. ఆమె మొహంలో ఫీలింగ్స్, బాధో, విషాదమో, నీరసమో, మరోటో అర్థంకాదు.

అక్కడినుంచి స్టార్ట్ ఐన ఈ వ్యవహారం సినిమా ముగిసేవరకు సాగుతూనేవుంటుంది.

సినిమా తొలిసగంలో సగంవరకు హీరోయిన్, హీరోల మధ్య డెప్తనీ వ్యవహారాన్ని ఎస్టాబ్లిష్ చేయడంతోనే చెల్లిపోతుంది. సినిమాకు కీలకమైన బ్లాక్ అనుకున్నది భలే సిల్లీగా వుంది. నిజానికి ఇలాంటిది వీలయినంత క్లుప్తంగా వుండాలి.

ప్రేమికులమధ్య మరిన్ని బ్లాకులు పెట్టుకోవాలి. అంతేతప్ప, కేవలం ఒక్క బ్లాక్‌తోనే సినిమా మొత్తం లాగించేయాలని అనుకోవడం దర్శకుడి ఆలోచనా బద్ధకం అనుకోవాల్సివస్తుంది.

తొలిసగం తరువాత కథను వేరేరూట్లోకి తిప్పి, చిన్న సిల్లీ రీజన్‌తో హీరో హీరోయిన్లు దూరం అయినట్లు చూపించడం అంటే దర్శకుడు సబ్జెక్ట్‌ను ఎంత తేలిగ్గా తీసుకున్నాడో అర్థం అవుతుంది. అలాంటి సినిమాకు క్లైమాక్స్ మాత్రం రొటీన్‌గా వున్నా, కాస్త వరకు అదే బాగుందని అనిపిస్తుంది.

ఒక్కపాట మినహా మరే పాట ఆకట్టుకోదు. కానీ బాగున్న ఆపాట క్లైమాక్స్‌ముందుకు వచ్చేసరికే, ప్రేక్షకులకు సినిమామీద ఆసక్తి పూర్తిగాచచ్చిపోతుంది.

సంగీత దర్శకుడు శరత్ పాటలకు ట్యూన్‌లు అలాగే ఇచ్చాడు, నేపథ్య సంగీతం అలాగే ఇచ్చాడు. పిసి శ్రీరామ్ సినిమాటోగ్రాఫర్ అని గుర్తుచేసుకుంటూ సినిమా చూస్తుంటే కొన్ని ఫ్రేమ్‌లు బాగున్నాయి అనిపిస్తుంది. కాని ఆయన గత సినిమాలు, రీసెంట్‌గా వచ్చిన 'ఇష్క్,' గుర్తుతెచ్చుకుంటే మాత్రం ఈ సినిమా నథింగ్ అనిపిస్తుంది. సంభాషణలు కూడా ఏమాత్రం స్పందన కలిగించవు.

ఇటు లీడ్ పెయిర్, సంగీతం, సంభాషణలు, సరైన సీన్లు, ఇలా ప్రేమకథలకు అవసరమైన ప్రతి ముడిసరుకు లోపమే అయినప్పుడు సినిమా ఎలా వుంటుంది? 'నా నువ్వే' అలాగే వుంటుంది.

ప్లస్‌పాయింట్స్...
సినిమా జోనర్

మైనస్‌పాయింట్స్...
లీడ్ పెయిర్, సంగీతం, కథనం

పంచ్‌లైన్
ప్రేమా లేదు ఫీల్ లేదు ◆



## బలమైన పాత్రలకే ప్రాధాన్యం

'హోమ్‌మినిస్టర్'తో కన్నడంలో కాలుపెట్టిన బెంగళూరు భామ తాన్యాహోప్ రెండో కన్నడ చిత్రానికీ రెడీ అయింది. ఇంకోపక్క తెలుగు సినిమా. 'పేపర్‌బాయ్'లో మెడికోగా నటిస్తున్నది.

"సంప్రదాయబద్ధమైన కుటుంబ నేపథ్యంగల వైద్యవిద్యార్థినిగా నటిస్తున్నాను. చక్కని ప్రభావం చూపగల బలమైన పాత్రలకే నేను ప్రాధాన్యం ఇస్తాను. ఇటువంటి పాత్రల్ని శోధించడానికి కొన్ని నెలల సమయం పడుతుంది.

నటిగా ఇవి నన్ను ముందుకు తీసుకెళ్ళగలవనేది నా అభిప్రాయం. ఇటువంటి పాత్రలు నాకెంతో స్ఫూర్తిదాయకమైనవి" అంటున్న తాన్యా తమిళరంగంలోనూ తళుక్కు మనబోతున్నది. ◆



## క్రేజీ కపుల్

'కుమారి 21 ఎఫ్' తర్వాత హ్యాట్రిక్ కొట్టేసిన హెబ్బాపటేల్‌కు ఆపైన వరుస అపజయాలు ఎదురవడంతో కెరీర్ ముందుకు సాగలేదు.

'ఏంజెల్' సినిమా తర్వాత ఇప్పటిదాకా అవకాశాలు వచ్చినదాఖలాలు లేవు.కాగా, ఆమె తాజాగా నాలుగోసారి రాజ్‌తరుణ్ సరసన నటించబోతున్నదన్న కబుర్లు వినపడుతున్నాయి.

ఇప్పటిదాకా వీళ్ళిద్దరూ కలిసి 'కుమారి 21 ఎఫ్', 'ఈడో రకం... ఆడో రకం', 'అందగాడు' సినిమాలు చేశారు.వీటిలో రెండు హిట్ కావడంతో క్రేజీ కపుల్‌గా పేరు వచ్చింది.దాంతో వీళ్ళిద్దరితో కలిసి మరోహిట్ ట్రైచేసే ఆలోచనలో చిత్రనిర్మాతలు ఉన్నారన్నది వార్త. రాజ్‌తరుణ్‌కు కూడా ఈ మధ్య హిట్లులేవు. మరోసారి ఈ కాంబినేషన్ కొట్టి, ఊపందుకుంటారేమోలే! ◆

Review

# హాయైన పూలవాన

మసాలా ఘాటు నాలుకకు అలవాటై పోతే, మనదైన పుల్లట్లు రుచించకుండా పోయే ప్రమాదం వుంది. అందుకే 'సమ్మోహనం' అనే సినిమాను, మంచి సినిమా చూడాలనే అభిరుచి వున్నవాళ్ళే చూడాలి.

నరికేస్తా, పాతేస్తా అనే డైలాగులు, అరివీర భయంకర పోరాటాలు, అరకొర దుస్తులతో డ్యాన్స్‌లు చూడాలనుకునేవారు మాత్రం కాదు. ఇది ముందుగా చెప్పాల్సిన చట్టబద్ధమైన హెచ్చరిక.

ఎందుకంటే... అన్ని సినిమాలు ఒకలా వుండవు. కొన్ని సినిమాలు బాంబుల దాడిలా వుంటే, మరికొన్ని సినిమాలు పూలవాన కురిపిస్తాయి. కొన్ని సినిమాలు తుపాను అలజడిలా వుంటే, మరికొన్ని సినిమాలు తొలకరి జల్లులా ఆహ్లాదంగా వుంటాయి.

కొందరు డైరెక్టర్లు మాస్ మహాజనాల కోసమే సినిమాలు తీస్తే, ఒకరో ఇద్దరో, హాయిగా సినిమా చూడాలనుకునేవారి కోసం మెగా ఫోన్ పట్టుకుంటారు. అలాంటి వైవిధ్యమైన దర్శకుల్లో ఒకరు ఇంద్రగంటి మోహనకృష్ణ.

'అష్టాచెమ్మా' దగ్గర నుంచి 'అమీ తుమీ' వరకు అచ్చతెలుగు హాస్యం. ఆయన అందించిన సినిమానే ఈ వారం విడుదలైన 'సమ్మోహనం'.

ఇంతకీ 'సమ్మోహనం' కథేంటీ అంటే... సినిమాల మీద, సినిమా జనాలమీద పెద్దగా సదభిప్రాయం లేని కుర్రాడు విజయ్ (సుధీర్ బాబు). అలాంటి వాడి ఇంటికి షూటింగ్ కోసం వస్తుంది టాప్ హీరోయిన్ సమీర (అదితీరావ్ హైదరీ).

అలా అలా దగ్గరవుతారు ఇద్దరూ.ఆ చనువుతో, ఆమెకు తన ప్రేమను తెలియచేస్తాడు విజయ్. అయితే ఆమె దానిని సున్నితంగా తిరస్కరిస్తుంది. దాంతో అప్సెట్ అవుతాడు విజయ్.

అసలు సన్నిహితంగా వచ్చిన సమీర ఎందుకు విజయ్ ప్రేమను తిరస్కరించింది, తరువాత ఏమైంది అన్నది మిగిలిన సినిమా.

పూల సువాసన సున్నితంగా వుంటుంది. పెర్ఫ్యూమ్ మాదిరిగా ఒక్కసారిగా మొహానికి, ముక్కుకు తగలదు. 'సమ్మోహనం' సినిమాలో కథ కూడా అంతే. సింపుల్ ప్రేమకథ.

పెద్దగా కాన్‌ఫ్లిక్ట్ ఏమీ వుండదు. భావోద్వేగాలు, కన్నీళ్ళు కుప్పగా కురిసేయవు. అలా అలా పైపైన టచ్ చేసుకుంటూ వెళ్ళిపోయే కథ. అందుకే పెద్దగా ఇబ్బందిపడకుండానే చూసేయచ్చు.

సినిమా తొలిసగం చాలా వేగంగానే సాగుతుంది. హీరో ఫ్యామిలీ పరిచయం, ఇరవై రోజులపాటు హీరో ఇంట్లో సినిమా షూటింగ్, ఆ హడావుడి, సరదాలు,




సందళ్ళతో స్మూత్‌గా సాగిపోతుంది.

ఫ్యామిలీ సరదాలు, ఆపై సినిమా సరదాలు అన్నీ కలిసి ప్రేక్షకులను ఎంగేజ్ చేస్తాయి.

దాంతో తొలిసగం అంతా చకచకా నడచిపోయిన ఫీలింగ్‌ను తీసుకువస్తాయి.

ద్వితీయార్థంలోకి ప్రేక్షకుడు కొన్ని అంచనాలతో ప్రవేశిస్తాడు. ముఖ్యంగా ఇది ప్రేమకథ కాబట్టి, విశ్రాంతి వేళకు ప్రేమికులు విడిపోయారు కాబట్టి, ద్వితీయార్థంలో వారి మధ్య బోలెడు కాన్‌ఫ్లిక్ట్ వుంటుందని, ఆ సంఘర్షణలు, భావోద్వేగాలు తెర నిండా పరుచుకుంటాయని అనుకుంటాడు.

కానీ దర్శకుడు అదంత సీరియస్‌గా తీసుకోలేదు. జస్ట్ ఓ పాత్రచేత అయిదునిమిషాలు మాట్లాడించి, విషయం తేలిపోయింది అనిపించేశాడు.

ఆ మాటకు వస్తే అసలు హీరో, హీరోయిన్ల మధ్య విశ్రాంతి వేళకు వేసిన ముడికూడా ఏమంతబలమైనదికాదు.దర్శకుడు ఎందుకో, ఈ ముడిని కానీ, ఆ తరువాత సరైన సీన్లు రాసుకునే వ్యవహారాన్ని కానీ సీరియస్‌గా తీసుకున్నట్లు కనిపించదు. ఈ నేపథ్యంలో వీలైనంత వినోదం పండించడంమాత్రమే కీలకంగా తీసుకున్నట్లు కనిపిస్తుంది.

అందువల్ల సినిమాలో ప్రేమకథను సీరియస్‌గా తీసుకున్న ప్రేక్షకులకు ఇది కాస్త రుచించదు.ద్వితీయార్థంలో ఇంకేదో వుందనుకుంటే, మరేదో వుంటుంది. కానీ సినిమా నడకకు, ప్రేక్షకుడి సంతృప్తికి ఇదేమంత అవరోధం మాత్రం కాదు.

ఎందుకంటే సినిమాను తేల్చేశాడు దర్శకుడు అనుకునేసరికి-

క్లైమాక్స్ రూపంలో పదినిమిషాలసేపు నాన్‌స్టాప్‌గా నవ్వులు పూయించి, ప్రేక్షకులకు సంతృప్తి కలిగించాడు. అదేవిధంగా చిన్న ఎక్స్‌టెండెడ్ క్లైమాక్స్‌ను కూడా సెట్‌చేసి, ఓకే అనిపించుకున్నాడు.

సినిమా మొత్తంమీద ప్రతి ఒక్కరి చేత సహజమైన నటనను రాబట్టుకున్నాడు దర్శకుడు.

సుధీర్‌బాబు సినిమాలో కథకుతగ్గట్లు, ఓ సాదా సీదా కుర్రాడిగానే కనిపిస్తాడు. ఆద్యంతం మంచి నటన కనబర్చాడు. ఎక్కడా ఎక్కువ చేయకుండా, తక్కువ చేయకుండా బాగానే చేశాడు.

అదితీరావ్‌హైదరీ తన నటనతో, లుక్స్‌తో ఆకట్టుకుంటుంది. సినిమా మొత్తం మీద 'స్టీల్ ది షో' అంటే సీనియర్ నరేష్‌దే.తనదైన కామెడీతో సినిమా మొత్తం దున్నేశాడు.దానికి దర్శకుడు అందించిన సెటైరికల్ డైలాగులు భలే జత కలిశాయి.

పవిత్రా లోకేష్ తదితరులు కూడా బాగా చేశారు. సినిమాలో పాటలు కూడా జోనర్‌కు, దర్శకుడి టేస్ట్‌కు తగినట్లు, సున్నితంగా వుంటాయి.

పాటలన్నీ బాగుంటాయి. కానీ వినగా వినగానే గుర్తుంటాయి. విందా సినిమాటోగ్రఫీ సినిమాకు పెట్టిన ఖర్చును క్లియర్‌గా చూపించింది.

దర్శకుడిగా ఎంత రాణించాడో, అంతకు అంతా మాటల రచయితగా రాణించారు ఇంద్రగంటి మోహనకృష్ణ మొత్తం మీద నాటుకొట్టుడు సినిమాల మధ్య కాస్త రిలీఫ్ 'సమ్మోహనం' సినిమా.

ప్లస్‌పాయింట్స్...
వినోదం, పాత్రల చిత్రణ
కలర్‌ఫుల్ చిత్రీకరణ

మైనస్‌పాయింట్స్...
సెకండాఫ్‌లో మిడిల్ డ్రాప్

పంచ్‌లైన్
సమ్మోహనమే

## ఎలా ఆడుతున్నాయి?

- రజనీకాంత్ 'కాలా' డిజాస్టర్‌గా మిగిలింది. ఇటీవల కాలంలో రజనీకాంత్ సినిమాలు ఏవీ తెలుగునాట బాక్సాఫీస్ దగ్గర నిలబడటంలేదు. 'కాలా' కూడా వాటిల్లో ఒకటిగా మిగిలిపోయింది.
- 'ఆఫీసర్' సినిమా నాగార్జున కెరీర్‌లో అతి దారుణమైన పరాజయంగా నిలిచిపోతుంది. ఒకవారంలో కనీసం కోటి రూపాయలు వసూలు చేయలేకపోయింది. కేవలం డెబ్బైఅయిదు లక్షల రూపాయలు వసూలు చేసింది.
- ఈవారం విడుదలయిన 'నా నువ్వే' సినిమా కూడా పరాజయం చవిచూసినట్లే.
- 'సమ్మోహనం' సినిమా ఎలా వుంటుంది అన్నది ఫస్ట్ వీకెండ్ అయితే కానీ తెలియదు. ◆

# చివరి రోజుల్లో...

జీవితం సుఖంగా గడవటమే అందరిలక్ష్యం. కాని ఆ సుఖం ఎందులోనుండి లభిస్తుందనేదానిదగ్గరే ఏకాభిప్రాయం లేదు.

కొందరికి సంపదద్వారా సుఖం వస్తే, కొందరికి పేరుప్రతిష్ఠలు, గుర్తింపు, గౌరవ సన్మానాలు సుఖం అనిపించవచ్చు. కష్టంలోనూ సుఖం ఉందనుకునే వారు లేకపోలేదు. వారిది తాము కోరుకున్నదానిని పొందటం, తాము చెయ్యదలచుకున్నది చెయ్యటంలో ఆనందం, తృప్తి ఉంటుంది.

ఇతరులు ఏమంటున్నారనేది పట్టదు. నేను అనుకున్నది అనుకున్న రీతిలో చెయ్యగలుగుతున్నానా, లేదా అనే దారిలోనే వారి జీవితం నడుస్తుంది.

మిగిలినవారికి చిత్రంగా అనిపించే ఆ జీవితం చదివినప్పుడు ఇటువంటి మనుషులు కూడా ఉంటారా అని ఈ తరంవారు ఆశ్చర్యపోవచ్చు.

కాని తెలుగు భాష కోసం, తెలుగు కథానిక కోసమే పుట్టి తెలుగు సాహిత్యం సుసంపన్నం చేసి అచ్చమయిన తెలుగువాడిగా, తాను చెప్పదలచుకున్నది చెప్పి, తాను సృష్టించదలచుకున్నది సృష్టించి పాఠకులకు అందించిన తెలుగుతల్లి ముద్దుబిడ్డడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

ఎలా పుట్టాం, ఎలా పెరిగాం అనేదే కాక ఎలా జీవితం అంతమయింది అనేది ఆలోచించినప్పుడు కొందరికి చివరి రోజుల్లో డబ్బు లేకుండాపోయిందే అనే బాధ మిగులుతుందేమో.

కాని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రికి చివరి రోజుల్లో అయ్యో నేను అనుకున్నదంతా రాయకుండానే వెళ్ళిపోవాల్సివస్తుందే అన్నదే బాధ. ఏనుగంత ఎత్తునపేర్చగలిగినంత రాయాలన్నది ఆయన కోరిక.

ఎంత రాసినా ఇంకా ఏదో రాయాల్సింది వుంది, పాఠకులకు కొత్త విషయం అందించాలన్నదే ఆయన ఆలోచన. సంపాదనమీద అంతగా ఆశ లేదు. బతకటానికి తగినంత వస్తే చాలదా! అంతకన్నా ఎక్కువ వచ్చినా ఏమి చేసుకుంటాం! అనే ఆలోచన శ్రీపాద వారిలో తప్పించి మరెవరిలో చూడలేము.

ఉద్యోగం చెయ్యలేదు. అంతా స్వతంత్రభావం. తెలుగు భాషా గ్రంథాలను హాయిగా చదువుకుంటూ, వాటిలో వున్న విషయాలను అర్థంచేసుకుంటూ జీవితాన్ని వెళ్ళబుచ్చటంకన్నా ఇంక కావాల్సిందేముంది అన్నది శ్రీపాదవారి భావన.

పిల్లలు లేరు. కాబట్టి సంసారభారం పరిమితం. తన రచనా లోకంలో తాను తేలుతుంటే మిగిలిన కుటుంబ వ్యవహారాలను నడిపించగలిగిన భార్య వుంది. ఏ రోజుకారోజు గడవటం ఎలా అని ఎదురు చూసిన రోజులున్నాయి ఆయన జీవితంలో.

పోస్ట్‌మేన్ వచ్చి రచనలకు పారితోషికపు మని ఆర్డర్ అందిస్తే ఆ రోజుకు కావాల్సిన సరుకులు కొనుక్కునివచ్చిన సందర్భాలు అనేకం. అయినాజీవితంలో రాజీపడలేదు.ఇతర మార్గాలద్వారా ఆదాయం పొందవచ్చని ఇతరులు సూచించినా శ్రీపాద లొంగింది లేదు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి పుట్టింది వైదిక విద్యను అభ్యసించే కుటుంబంలో.



శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
(1891-1961)

కథ ఇంగ్లీషు భాషలోనుండి వచ్చింది కాబట్టి ఐరోపా భాష కథలు చదవాలనేదానికి శ్రీపాద వ్యతిరేకం. అసలు ఆయన ఇంగ్లీషును చదవలేదు. తెలుగుకన్నా గొప్ప భాష లేదన్నది ఆయన అభిప్రాయం.

సంస్కృతం అభ్యసించి, సాంప్రదాయాలను ధిక్కరించి, తెలుగుమీద మమకారం పెంచుకుని, వ్యావహారిక భాషను స్వాగతించి నాటి ప్రసిద్ధ పద్య కవితా విధానాన్ని విడనాడి వచనంలోకి అడుగు పెట్టి, కథానికలమీద పట్టు సాధించి తెలుగు కథా రచయితలలో శాశ్వత స్థానం సంపాదించినవారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

ఆయన రాసిన 'వడ్లగింజలు', 'అరికాళ్ళ కింద మంటలు' వంటివి చిరకాలం నిలిచేవి.మధ్యతరగతి గోదావరి తీర సాంప్రదాయ కుటుంబాలచుట్టూనే ఆయన కథలు నడిచాయనేవారున్నా ఆయన రాసిన తీరు వారి విమర్శను తిప్పికొట్టేవి.

కథ ఇంగ్లీషు భాషలోనుండి వచ్చింది కాబట్టి ఐరోపా భాష కథలు చదవాలనేదానికి శ్రీపాద వ్యతిరేకం. అసలు ఆయన ఇంగ్లీషును చదవలేదు. తెలుగుకన్నా గొప్ప భాష లేదన్నది ఆయన అభిప్రాయం. తన భావాలను పంచుకునేందుకు, తన కథలు ప్రచురించేందుకు 'ప్రబుద్ధాంధ్ర' పత్రిక ప్రారంభించినా దానివల్ల ఆయన సంపాదించిందేమీ లేదు. తన 'అనుభవాలు-జ్ఞాపకాలు' ప్రతి తెలుగు వారు తప్పక చదవవలసిన పుస్తకం.

రాజమండ్రిలో షష్టిపూర్తి, విశాఖపట్నంలో కనకాభిషేకంతో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిని సన్మానించారు. నిండైన విగ్రహం, గిరజాల జుట్టు, నుదుట బొట్టు, మెడచుట్టూ కండువా... చూడగానే ఆకట్టుకునే శ్రీపాదవారిని ఒకసారి చూస్తే మరువటం కష్టం.

తాను తన రచనలతో చిరకాలం సాహిత్యసేవ చేయాలనుకుని ఆశపడిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రికి చివరలో పక్షవాతం వచ్చింది.డెబ్బైయ్యవ ఏటికి సమీపిస్తుండగా ఒకరోజు ఉదయం ముఖం కడుక్కునేందుకు ఎత్తిన చెంబు చేతిలో నుండి హఠాత్తుగా జారి పడింది. ఆయన వెనక్కి పడ్డారు.

చుట్టూ వున్నవారు గుమిగూడి ఆ విద్యావిశారదుడిని ఆసుపత్రికి తీసుకువెళుతుంటే, వంకర పోయిన ఆ మూతినుండి వస్తున్న మాటలేవో ఎవరికీ అర్థంకావటంలేదు.

చివరికి ఆయన భార్య వచ్చి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పెదవుల కదలికను గమనించి-

"నా సొంత రచనలను సాపు చెయ్యలేని స్థితికి చేరానే" అని ఆయన విచారంతో మాట్లాడుతున్న విషయం వివరించింది. అంత బాధలోనూ రచనల గురించిన ఆలోచనే, తెలుగు భాషమీద తపనే.

అలా దాదాపుగా సంవత్సరంపాటు పక్షవాతంతో బాధపడ్డారు. తాను ప్రారంభించిన వ్యావహారిక భాషలో మహాభారతం రచనను పూర్తిచెయ్యకుండా వెళ్ళిపోతానేమోనన్న భయం శ్రీపాదది.

అది, విరాటపర్వాలు మాత్రమే అప్పటికి పూర్తయ్యాయి. వాటిని ఎవరైనా పూర్తిచేస్తే బాగుండన్నది శ్రీపాద ఆలోచన. వేరే ఆదాయం లేదు. రచనలు ఆగిపోయి ఆర్థికంగా చితికిపోయిన బతుకు అయింది శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిది.

'తనతో జీవితం పంచుకున్న భార్యను చెట్టుకింద నిలబెట్టినట్టయిందా తన భాషాభిమానం, తెలుగు పట్ల మమకారం' అనే ఆలోచన అప్పుడు కలిగింది.

అంతటి ఆర్థిక, ఆరోగ్య ఇబ్బందుల్లో వున్నప్పటికీ తాను ఎవరెవరికి ఎంత ఇవ్వాలో మరచిపోలేదు శ్రీపాద. తన రచనలు అచ్చువేసిన సరస్వతి ప్రెస్ వారి అప్పు తీర్చేందుకు తన రచనలను అమ్మాలని ప్రయత్నించినా కుదరలేదు.

తాను సాపు రాసిన రచనలనైనా అమ్మి ఆ ప్రెస్ వారి రుణం తీర్చి, ఏమైనా మిగిలితే భార్య సీతమ్మకి ఇమ్మని చివరి దశలో ఆయన విశాఖపట్నంలోని తన మిత్రుడికి ఉత్తరం రాయించాడు శ్రీపాద.

తెలుగును ప్రేమించి, తెలుగుకోసమే జీవించిన శ్రీపాదవారు తన 70వ ఏట పక్షవాతంనుండి కోలుకోకుండానే వచన భారతం పూర్తిచేయలేకపోయానే అనే దిగులుతో మరణించారు.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

→ డి.శ్రీనివాసాచార్యులు, ఎర్రగొండపాలెం

పురుషులు, అనిమిషులు (రెప్పపాటు లేని వారు, దేవతలు) అయ్యేదెప్పుడు?

ఆడది అర్థనగ్నంగా నాట్యం చేస్తున్నప్పుడు.

→ ఎమ్.ఆర్.గౌతమి షణ్ముఖప్రియ, విజయవాడ

అప్పటికీ-ఇప్పటికీ తేడా?

అప్పుడు ప్రతీ ఇంట్లో, పది విస్తళ్ళు లేస్తే, ఇప్పుడు ప్రతీ ఇంట్లో పది ఇళ్ళు లేస్తున్నాయి.

→ పి.యోబు, ముదునూరు

"చాలామంది డబ్బును 'మంచినీళ్ళలా' ఖర్చు పెడుతుంటారు" మరి పిసినారి ఎలా ఖర్చుపెడతాడు?

'టానిక్‌లా'.

**ఉత్తమ ప్రశ్నకు ₹500**
**ప్రతి ప్రశ్నకు ₹300 బహుమతి**

→ కె.హెచ్.రామకృష్ణారెడ్డి, బెంగళూరు

ప్రతి 'మని'షి మోసపోయేది?

'మనీ' వ్యవహారంలో.

→ కె.నరేష్‌బాబు, బదేవారిపాలెం

పట్టువదలని విక్రమార్కులు అంటే ఎవరు?

'ఈ శీర్షిక మీదే' రచయితలు.

→ ఆర్.ప్రశాంతి, విజయనగరం

ప్రయాణపు చిత్రం?

డీజిల్ వాహనంతో పెట్రోలింగ్‌కి వెళ్ళడం.

→ పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట

తె'లివి'?

పెరిగిపోతే అ'లివి' కానిది.

→ కె.వి.ఎన్.ఎన్.ఎల్.ఎన్.నగేష్, విశాఖపట్నం

చీర?

'చీ'కటిలో 'ర'మింపజేసేది.

→ ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

ప్రై'వేటు' ఉద్యోగం; కామెంట్ ప్లీజ్?

'వేటు' ప్రమాదమున్న ఉద్యోగం.

## ఈ కార్టూన్ మీదే




## B హ్యాపీ

"మీ ఇంట్లో రేడియో లేదా, టీ.వి. లేదా... మరి కాలక్షేపం ఎలారా!" ఫ్రెండ్‌తో అన్నాడు గోపీ.

"ఎందుకూ... ఆ రెండింటి పెట్టు మా ఆవిడ వుందిగా..." అన్నాడు గోపీ ఫ్రెండ్.

కుటుంబరావు వంటింట్లో వంటలు చేస్తుండగా మిత్రుడు సుందరరావు వచ్చి "ఏమిట్రా నువ్వు చేయి కాల్చుకుంటున్నావు.... మీ ఆవిడ ఏమయింది! ఊరు వెళ్ళిందా!!" అని అడిగాడు.

"లేదురా... వారపత్రికలకు వంటకాల కాలమ్, టి.వి. ఛానళ్ళకు కొత్త వంటకాలు తయారుచెయ్యటం ఎలా" రాస్తున్నదని చెప్పాడు.

"అల్లావుద్దీన్ అద్భుత దీపం మీ చేతికి దొరికితే మీరేం కోరుకుంటారు" అని అడిగింది టీచర్.

"డబ్బు అని ఒకరు, చదువు అని మరొకరు..." ఇలా సమాధానం చెప్పారు-

చివరిగా రాంబాబు లేచి "ఈ బోరింగ్ ప్రశ్నలు వేసే క్లాస్‌లోనుండి దూరంగా తీసుకెళ్ళమంటా"

"మీరు రాసినవాటిలో అన్ని దొరికాయిగాని, చివరలో రాసిన ఈ ఒక్కటి ఏ మందులషాపులో కూడా లేదంటున్నారు డాక్టర్" అంటూ ప్రిస్క్రిప్షన్ వెనక్కితెచ్చాడు రోగి.

అదిచూసిన డాక్టర్ "అది మందు పేరు కాదయ్యా, పెన్ను సరిగా రాయటంలేదని పక్కన గీసి చూశానంతే..." అన్నది డాక్టర్ రావు సమాధానం.

ఐదో క్లాస్ తప్పాడని పిల్లాడిని విడవకుండా తిడుతున్నారు ఇంట్లో.

వినీవినీ సాయంకాలమయ్యేసరికి "తప్పటంవల్ల బుక్స్, యూనిఫామ్ కొత్తవి కొనాల్సిన అవసరం లేక మీకు ఎంత మిగిల్చానో ఒక్కసారైనా ఆలోచించారా" అంటూ విసుక్కున్నాడు కుర్రాడు పుల్లారావు.

"హెడ్మాస్టర్‌గారూ నాకు రానురాను మతిమరుపు ఎక్కువవుతోందండి... ఆరోతరగతికి వెళ్ళాల్సింది ఎనిమిదో తరగతికి వెళుతున్నా..."

"ఈ విషయం నాకెందుకు చెపుతున్నట్టు?"

"ఓ... మీరు మా హెడ్మాస్టర్ కాదా! ఆయన గది అనుకుని వచ్చా" అంటూ వెళ్ళిపోయాడు హిందీ పంతులు ఆచారిగారు.

చింటూకి పరీక్షలో ఒక ప్రశ్న తెలియక ఖాళీ పేపర్ ఇచ్చి బయటకు వచ్చాడు.

క్లాస్‌మేట్ రాణిని అడిగితే- "తాను ఖాళీ పేపర్ ఇచ్చివచ్చాను" అంది.

"అలా ఎందుకు చేశావ్. మనిద్దరం కాపీకొట్టామని టీచర్ అనుకోదా" అంటూ కోప్పడ్డాడు చింటూ.

"మిగతా పిల్లలదగ్గర ఎప్పుడూ డబ్బులుండవు. నీ దగ్గర ఎప్పుడూ డబ్బులు ఉంటాయి. ఏమిట్రా రహస్యం" అడిగాడు వార్డెన్.

"నేను రాసి సంపాదిస్తానండీ" చెప్పాడు వాసు.

"ఏమిటి... ఈ వయసులోనే కథలు, కవితలు రాస్తున్నావా...." అడిగాడు వార్డెన్.

"లేదండీ... మా అమ్మానాన్నకు ఉత్తరాలు రాసి సంపాదిస్తుంటా..." అన్నాడు వాసు.

వీరులు అపజయం చూసి క్రుంగిపోరు. విజయం సాధించేవరకు పోరాటం చేస్తారు.